బదులిచ్చాడు.

ఈ సంఘటనలోచేరమాను  ఒక మహాసత్యాన్ని వెల్లడించాడు. "ఒకడు అనర్హుడై నను ఋషికి గురువునకు ఆత్మీయుడవగలిగినచో గురువు తనతో బాటు తన శిష్యునికి గూడ భగవత్ సాన్నిధ్య మొసగగలడు" అన్న సత్యము రూఢమైనది.

సుందరారు పూర్వపురీతిని మనసా, వాచా, దైవాన్ని కొలుస్తూ కైలాసంలో వుండి పోయాడు. పరవయారు, సంగ్లియార్లు పుడమిపై తమ పూర్వజన్మ కర్మలననుభవించి కైలాసానికి చేరారు. పార్వతీదేవికి యధావిధిగా వారివారి పరిచర్యలు ప్రారంభించారు. పెరుమాళ్ళను నమ్మిన భటులు తమ ప్రభువును విడిచి యుండజాలక కత్తులతో బొడుచు కొని - కైలాసానికి చేరుకున్నట్లు ప్రతీతి.

****

## 2. తిరునీలకంఠ నాయనారు

చిదంబరంలో నిరంతర శివధ్యాన తత్పరుడైన ఒక మహాభక్తు డుండేవాడు. కుమ్మరి కులంలో జన్మించాడు. అదే వృత్తిని చేబట్టి శివభక్తులను ఎంతో నమ్రతతో సేవించేవాడు. మంచి గృహస్తు. గృహస్తు ధర్మాన్ని యధావిధిగా పాటిస్తూ వచ్చిన శివభక్తులకు ఆనందముతో సేవ చేస్తూ తాను తయారుచేసిన బిక్షా (మృణ్మయ) పాత్రలను శివభక్తులకు ఉచితంగా ఇచ్చేవాడు. శివుని నీలకంఠునిగా భక్తి ప్రపత్తులతో కొలిచేవాడు. ప్రపంచం మనుటకు శివుడు హాలాహలంను మ్రింగిన వైనమును, ఆయనను కొలిచేవారికి రక్షకుడు పాపాల్నిబాపి తనలోకానికి తీసికొని వెళ్తాడని అందఱకు చెబుతూండేవాడు. సదా నీలకంఠుని నామము ఉచ్ఛరించేవాడుకాన అందఱూ అతనిని నీలకంఠనాయనారు అని పిలిచేవారు.

ఇన్ని మంచి గుణాలున్నా ఒకరోజున కామానికి వశుడై ఒక పడుపు కత్తె ఇంటికి వెళ్లాడు. ఇంటికి రాగానే అతని భార్య ఈ విషయాన్ని పసిగట్టింది. హృదయం వేధిస్తున్నా - దానిని బయటపడనీక - భర్తకు యోగ్యురాలయిన భార్యగా సేవచేస్తూనే - దాంపత్య సమాగమాన్ని మనసులోనే వెలివేసింది. నాయనారుకు ఆమె చర్యలు అర్థము కాలేదు. ఒక రోజున కోరికతో ఆమెను సమీపింపగా - ఆమె నీలకంఠుని పై ఆన పెట్టింది. “ఆయన పేరుతో మిమ్ములను అడుగుతున్నాను మమ్మల్ని తాకకండి”! . ఆమె మమ్మల్ని అని అంది కాబట్టి నీలకంఠనాయనారు లోకంలో ఏ స్త్రీని తాకకూడదని నిశ్చయించుకున్నాడు. పరమశివునిపై ఆయనకు అంత అనన్య ప్రేమ. ఈ విధంగా ఒకరినొకరు తాక కుండ జీవించటం మొదలుపెట్టారు. దీన్ని గూర్చి బయట ప్రపంచంలో ఎవరికిని తెలియ నీయలేదు. సంవత్సరాలు గడిచాయి. భార్యాభర్తలు వృద్ధులు గూడ అయ్యారు.

ఈశ్వరునికి వీరి ఔన్నత్యము లోకానికి చాటాలనిపించింది. అందుకని ఒక శివ యోగిగా రూపుదాల్చి - నీలకంఠనాయనారు ఇంటికి విచ్చేశాడు. నీలకంఠారు సాదరము గా తన వీటిలోనికి ఆహ్వానించాడు. సపర్యలు చేశాడు. యోగి ఒక బిక్షాపాత్రను నీలకం ఠనాయనారునకు ఇచ్చి "నేను మఱలి వచ్చువరకు దీన్ని సురక్షితంగా వుంచండి. నాకు ఇది అత్యంత విలువైనది.దీన్ని తగులటయే తరువాయి అన్ని వస్తువులు పవిత్రమవుతాయి. అందుకని జాగ్రత్తగా కాపాడవలసినది" అంటూ శివయోగి వెళ్లిపోయాడు. నీలకంఠారు దాన్ని జాగ్రత్తగా దాచాడు.

చాలకాలమైన తర్వాత ఒక రోజున శివయోగి తిరిగివచ్చి నీలకంఠారును ఆ భిక్షా పాత్ర గూర్చి అడిగాడు. శివయోగి దాన్ని మాయంచేసి ఆ పాత్రను తెచ్చి ఇమ్మని నీలకంఠా రును అడిగాడు. నీలకంఠార్ అంతా వెదికాడు. ఆ పాత్ర ఎచ్చటను కన్పింపలేదు. అది మా యగావుంది. సిగ్గుపడి పోయాడు. భయంతో వణకుతూ శివయోగి పాదాలపై బడ్డాడు. ఆ పాత్ర ఎచ్చటనూ కన్పింపలేదు అని వాపోయాడు.యోగికి విపరీతంగా కోపం వచ్చింది. నీలకంఠారును -నీవు దొంగవని, మోసకారివని నిందించాడు. నీలకంఠార్ ఆ పాత్ర కన్న విలువైన పాత్ర ఇస్తానన్నాడు. శివయోగి ఒప్పకొనలేదు.

పదే పదే శివయోగికి -"తాను ఆ పాత్ర ను దొంగి లించలేదని, ఏదోమాయగా అది కన్పించటం లేదని, అది ఎట్లా మాయమైందో తనకు అర్థం కావటం లేదని" చెప్పా డు. శివయోగి "నీవు చెప్పేది నిజమైతే నీభార్య చేయిపట్టుకొని ప్రమాణం చేయుమని" అడిగాడు. నీలకంఠునిపైన ఆనపెట్టాడుకాన నీలకంఠారుదానికి అంగీకరించలేదు. "అత ని అనంగీకారం నీలకంఠారు దోషాన్ని చూపుతున్నదని" శివయోగి అన్నాడు. అందుకని దొంగతనం నేరంపై న్యాయస్థానానికి తీసికొని వెళ్లాడు. శివయోగి చెప్పినట్లుగా ప్రమా ణం చేయవలసినదనిగా ఆజ్ఞాపించారు. నీలకంఠారు తను, తన భార్య ఒక కఱ్ఱను ఇద్ద రు చెరి యొక కొనను పట్టుకొని చెఱువులో మునుగబోయారు. యోగి వీరిరువురు చేయిని బట్టికాక కఱ్ఱను పట్టుకొని మునుగుటకు వీలులేదన్నాడు. నిజం నిరూపణ కొఱ కు ఒకరి చేయినొకరు పట్టుకొని నీటమునగాలని ఆదేశించారు. నీలకంఠారు తన ఆన గూర్చి ఇక నిజందాచ లేకపోయాడు. భార్యా భర్తల మధ్య జరిగినది, దేమునిమీద ఆన గూర్చి వెల్లడించి తాను తన భార్య చేయిని తాక జాలనని విన్నవించాడు. ఇలా చెప్పి ఇద్ద రు కఱ్ఱను చెరి ఒక కొనను పట్టుకొని నీటమునిగారు. ఒక విచిత్రం జర్గింది. ఇద్దరూ

నీటమునిగి బయటకు లేవగానే - వారిద్దరు రూపసులైన యవ్వన వంతులుగా మారి పోతారు. శివయోగి అంతర్ధాన మయ్యాడు. పార్వతీపరమేశ్వరులు అచట సాక్షాత్కరించారు. "మీరు అత్యంత సంయమనముతో, భక్తితో జీవనం జరిపిన పుణ్య విశేషంచే మీరిద్దరు నిరంతరం యవ్వన వంతులుగా నాలోకంలో శాశ్వతంగా నివసించండి" అని వారిని తమ లోకానికి తీసికొని పోయారు. శివభక్తి తత్పరత, సంయమము, నిర్మల జీవనము ఎలా, పరమశివుని యొక్క శాశ్వత స్థానానికి చేర్చగలవో పరమశివుడు లోకానికి వెల్లడించాడు. పరమశివునిపై అనన్య భక్తి నీలకంఠారును చెడుపనులనుండి చెడుతలపులనుండి వైముఖ్యత కల్గించి సచ్చరిత్రులుగా వారిని నిలబెట్టి అంత్యమున వారికి శివసాయుజ్యము కలుగుటకు కారణభూతమైంది.

****

" దాతయైన వాడు దారిద్ర్యమున నున్న
మానడుపకరించు మార్గమతడు"
-కురాల్

## 3. ఇయర్‌పగై నాయనారు

దాతృత్వము విషయములో 'నేనిచ్చుటకు నాదగ్గరేమిలేదు' అన్న లేమిమాట ఉన్న తుల యెడ వినిపించదుఅని కురాల్ చెబుతుంది. అటువంటి మహనీయులలో ఒకరు ఇయర్‌పగైనాయనారు. దాతృత్వము ఆయన నరనరాల్లో జీర్ణించి పోయింది. శివభక్తుల ను తన ఇంటికి పిలిచి శ్రద్ధగా భక్తితో వారినర్చించి - వారు కోరినది తన దగ్గర ఉన్నది సంతోషముగా ఇచ్చెడివాడు. శివభక్తుడు అడిగినచో లేదనుమాట అతని నుండి వెలువ డదు. వారి సంతోషమే పరమశివుని అనుగ్రహ విశేషమని ఆప్రకారమునడచెడివాడు.

ఇయర్‌పగైనాయనారు కావేరీపూమ్ పట్టణము వాస్తవ్యుడు. వైశ్యకులజుడు. శివభ క్తులందరూ ఆయనకు శివస్వరూపులే.

ఈ భక్తుని విషయమై పరమశివునికి సంతృప్తికలిగింది. ప్రపంచానికి ఇయర్ పగైర్ విశిష్టత తెలుపాలనుకున్నాడు. అందుకని ఒక బ్రాహ్మణ వేషములో త్రిపుండ్రములతో శైవాచార్యుడుగ నాయనారు ఇంటి ఎదుట నిలిచాడు. నాయనారు ఆయనను చూచి పరమానందముతో స్వాగతము చెప్పి, లోనికి గొని పోయి "మహాత్ములు ఊరకరారు. మీరు వచ్చిన కారణము తెలుపగలరు !' అని నమ్రతతో బలికెను. బ్రాహ్మణుడు "అయ్యా నీవు వున్న పదార్థములతో అడిగిన దానిని లేదనుకుండ ఇచ్చువాడవు. ఇది తెలిసికొని నిన్నొకటి కోరవచ్చితిని' అన్నాడు. నాయనారు విస్మయముతో 'సెలవిండు, తమరు ఏది కోరినను, నాదగ్గరున్నచో వెంటనే ఇచ్చెదను' "కోరుకొనుడు' అనెను. బ్రాహ్మణుడు "నీభా ర్యను కోరివచ్చితిని" అని పలికాడు.

పరమశివుని మహాభక్తుడు నాయనారు. నాయనారుకు వచ్చినతని కోరిక మంచిదో చెడుదో అన్న ఆలోచన, తలపు దరికి రానీయలేదు. శివభక్తుడు వచ్చాడు. అడిగాడు. అడిగిన ది తన దగ్గరున్నది ఇస్తానన్నాడు. అంతే భక్తుని కోరికను పాటించుటే తన కర్తవ్యము. 'ఇచ్చితిని' 'అనిమాటిచ్చి ఈ సంగతి నాయనారుభార్య కెరింగించాడు. ఆమె ముందఱ నిశ్చేష్టురాలైంది. వెంటనే తేరుకొని భర్త ఆజ్ఞను పాటించుటే పతివ్రతా ధర్మమని - ఆ బ్రాహ్మణుని వెంట వెళ్లుట కు అంగీకరించింది. నాయనారు బయటకు వచ్చి నా దానము పరిగ్రహించండి అని బ్రాహ్మ ణుని అడిగాడు. బ్రాహ్మణునకు భార్య తరపు బంధువులు తననేమైనా జేయుదురేమోనని భయపడి - మీ బంధువులు వూరుదాటువరకు అడ్డగించకుండ నీవుకూడ నా వెంటరావలె నని ఇయర్ పగైయారును కోరాడు. సరేనని బ్రాహ్మణుని కాపాడుటకు ఆయుధము వెంటబె ట్టుకుని ఆ బ్రాహ్మణుడు తోను భార్యతోను బయలుదేరాడు.

కొంత దూరము పోవుసరికి బంధువులు ఈ విషయమును విని కోపోద్రిక్తులై బ్రాహ్మణుని చంపుటకు బయలుదేరారు. వచ్చి ఎదిరించారు. బ్రాహ్మణుడు భయపడ్డాడు. నాయనారు

భార్య -"మీరు భయపడ వలదు - నాయనారు వారి నందటిని జయించును" అన్నది. బంధు వులందఱు నాయనారుతో "నీవు చేస్తున్నది, బ్రాహ్మణుడు కోరినది మహా పాపము,అకృత్యము" అని వాదించారు. నాయనారు వినలేదు. అపకీర్తి, అపవాదులను భరించలేక ఆ బంధువులు "నీతో పోరాడుతాము, చావనైనా చస్తాముకాని ఈ అపకీర్తి అపవాదులను భరించలేము" అనిపోరుకు సిద్ధమయారు. ఒక గడియలో నాయనారు చేతిలో అందరు బంధువులు చని పోయారు. నాయనారు నిశ్చింతతో భార్యను ఆగంతుకుని వెంట తీసికొని బయలు దేరాడు.

కొంత దూరముపోగా తిరుచ్చైకాడు దేవాలయము వచ్చింది. బ్రాహ్మణుడు నాయనారును "ఇంటికి తిరిగి వెళ్లుము" అని ఆదేశించారు. నాయనారు బ్రాహ్మణునకు నమస్కరించి వెను దిరిగాడు.

ఇయర్ పగైయారు ఇంటిదెసగా కొంచెము దూరము వెళ్లాడోలేదో - బ్రాహ్మణుడు నాయనారును బిగ్గఱగా పిలిచాడు. ఇంకెవరైనా అడ్డగించారేమో నని తలచి నాయనా రు బ్రాహ్మణుడుదగ్గరకు వెంటనే వెళ్లాడు. అక్కడ నాయనారుకు ఆశ్చర్యకరముగ బ్రాహ్మ ణుడుఅంతర్ధానమైనట్లనిపించింది. భార్య ఒక్కతే అక్కడ నిలుచుని వుంది. ఇంతలో పార్వతీపరమేశ్వరులు ఆకాశమున నగుపడి "మీ భక్తి తత్వరతకు ముగ్ధులమైనాము. భక్తు లయెడ నీ సేవ అమోఘము. మీ ఇద్దరు కైలాసమునకు రండి" అని ఆహ్వానించారు. పార్వతీపరమేశ్వరులు అంతర్ధానమయ్యారు. నాయనారు తన భార్యతో కైలాసానికి చేరాడు. బంధువులుగూడ శివుని చూచిన విశేషమున వారు గూడ శివసాయుజ్యమం దినారు. శివుని మీద పరాభక్తి సాకులను వెదుకదు.ధర్మాన్ని ఉల్లంఘింప జేయదు. శివు నికి శివభక్తులకు జోహారు.

****

# 4. ఇలయాన్‌కుడి మారనాయనారు

ఇలయాన్‌కుడి మారనాయనారు ఒక పంటకాపు. మారనార్ అతని పేరు. ఇల యాన్‌కుడి గ్రామవాసి. శివారాధన తత్పరుడు. శివభక్తులను సేవించేవాడు. శివభక్తుల ఇతోధిక సేవలలో పరమానంద భరితుడయ్యేవాడు. ఈ సాధనకు (మహేశ్వర భక్తార్చన, శివార్చన) మహేశ్వరపూజ అని అంటారు.

మహేశ్వర పూజ ఇలా వుంటుంది.

“శివభక్తుని విభూతి పుండ్రములతో, రుద్రాక్షలతో చూడగానే - ఆయననే సాక్షాత్తు శివుడుగా భావించి, లోనికి గౌరవ పురస్సరముగా ఆహ్వానించి, ఆయనకు సాష్టాంగపడి, ఆయన కరచరణాదులను కడిగి, ఆ చరణామృతమును తలపై జల్లుకొని, ఆయనను ఆసీనునిచేసి, పూలతో, దీపముతో, ధూపముతో, నైవేద్యముతో ఆయనను అర్చించి, మంచి తియ్యని మాటలాడి, ఆయనను తాము అర్చించుటకు అవకాశ మిచ్చినందులకు మహద్భాగ్యమని పొగడి, ఆయన తిరిగి వెళ్లునప్పుడు ఆయనను కొంత దూరము వరకు సాగనంపివచ్చుట” -ఇదంతా “మహేశ్వరపూజ” అవుతుంది.

శివభక్తులకు భోజనమిడుటచే ఆత్మ పునీతమవుతుంది. దేవుని అనుగ్రహమునకు గృహస్తు పాత్రుడవుతాడు.

తిరువల్లువారు కురాల్ లో ఇట్లా చెప్పారు.

“అతిథి రాక కలరి యాతిధ్యమిచ్చెడి

వారి యింట లక్ష్మి వలచి నిలుచు.”

నాయనారుకు అనంతైశ్వర్యమిచ్చాడు భగవంతుడు. నాయనారు మాత్రము “ ఆ సంపద అంతా ఈశ్వరునిది. దానిని ఆయన భక్తులకే వినియోగించాలి” అనుకునేవాడు.

నాయనారు భక్తి తత్పరతకు ఈశ్వరుడు పరవశుడయ్యాడు. ఎన్ని అవాంతరాలు, బెడదలు వచ్చినా - నాయనారు తన ప్రవర్తనలో - తొణకడు, బెణకడు అని ప్రపంచానికి చూప దల్చాడు.

అంతే! నాయనారు ఆస్తి కరిగిపోయింది. నాయనారును సంపద వీడి పోయిందే కాని - అతని సద్గుణాలు అతనిని వీడలేదు.పైగా నాయనారుకు పరమశివునిమీద ప్రేమ, భక్తి బహుధా ఇనుమడించాయి. ఆస్తిని అమ్మవలసి వచ్చింది. మహేశ్వర భక్తులను సేవించుటకై, వారి సేవలకై తనను తానే అమ్ముకోవలసిన పరిస్థితి కూడ వచ్చింది. అయినా శివభక్తినుండి మరల లేదు.

ఒక రోజున కుంభవృష్టి కురుస్తోంది. నాయనారున్ను భార్యయున్ను పస్తున్నారు. ఎవరూ వారికి సాయము చేయలేదు. రాత్రి నిదురిద్దామని తలుపుకు గడియపెట్టాడు. నిదురపోబోతుండగా, ఎవరో తలుపు తట్టిన శబ్దము వినిపించింది. తలుపు తెరచిచూస్తే వర్షముతో తడుస్తూ ఒక శివభక్తుడు వాకిటి ముంగిట నిలబడి యున్నట్లు నాయనారు గమనించాడు. నాయనారు తక్షణమే ఆ ఆగంతకుని ఇంటిలోనికి తెచ్చి కట్టుకోటానికి పొడి బట్టలు ఇచ్చాడు. వచ్చినతనితో "స్వామీ కొద్దిసేపు విశ్రమించండి. ఈలోగా మీ ఆకలి తీర్చుటకు ఆహారము సమకూరుస్తాము" అని చెప్పి భార్యతో "ఈ ఆపదనుండి ఎట్లా గట్టెక్కాలి" అని వాపోయాడు. వెంటనే నాయనారు భార్య నాయనారును "పెరట్లో ఈ రోజునే పాతిపెట్టిన ధాన్యపు గింజలను త్రవ్వి తీసికొని రండి" అన్నది. నాయనారుకు ఆసలహా నచ్చింది. అతివృష్టి మూలాన్ని ఆగింజలన్నీ తేలుతూ నీళ్లమీద వున్నాయి. అందుకని వాటిని బుట్టలో తేవీలయింది. వాటిని తెచ్చి భార్యకు ఇచ్చాడు. ఆమె వాటిని దంచి పెరట్లో వున్న ఆకుకూరలతో కలిపి పచనము చేసి అతిథికి మంచి భోజనము సమకూర్చింది.

నాయనారు చాల సంతోషించాడు. అతిథిని నిద్రలేపుటకు వెళ్లాడు. అక్కడ వెళ్లి చూడగా అతిథి అంతర్ధాన మైనట్లుగమనించాడు. తల ఎత్తి ఆకాశము వంక చూచాడు. పరమేశ్వరుడు అతిథిరూపంలో పార్వతీ దేవితో ప్రత్యక్షమయి దంపతుల మీద ఆశీర్వచన అక్షతలు కుర్పించాడు.

పరమేశ్వరుడు నాయనారుతో "మీభక్తికి చాల సంతసించాను. నాలోకానికి వచ్చి అచ్చట శాశ్వతముగా యుండండి" అని వారిని వెంటనిడుకొని పోయెను.

****

# 5. మయిపోరుల్ నాయనారు

పరమ పవిత్ర మూర్తి అయిన మయిపోరుల్ నాయనారు - కొండకోనల ప్రాంతమైన సేతి ప్రజలకు రాజు. చాలాయుద్ధాలుచేసి అన్ని యుద్ధాలలోను విజయుడయ్యాడు. అతని రాజ్యంలో శాంతి, సుఖ, సంతోషాలు వెల్లివిరిశాయి. పంటలు పుష్కలంగా పండాయి. ప్రజలు ఆయనను దేవుడుగా కొలిచేవారు.

రాజుగారు ఆగమాలలో నిష్ణాతుడు. పరమశివుని అత్యంత భక్తుడు. ఆయనకు శివుడన్నా, రుద్రాక్షలు, జడలుకట్టిన శివభక్తులన్నా - వారు సత్యానికి కేవలము ప్రతిరూపులని, పరమ సత్యమని మిగతా ప్రపంచమంతా (గడ్డి) పఱక అని నమ్మేవాడు. ఆయనకు అంతా శివమయంగా కన్పించేది. రాజ్యంలో శివభక్తులు సంపూర్ణ స్వాతంత్ర్య మనుభవించారు. వారిని రాజుగారు, ప్రజలంతా గౌరవించేవారు. రాజుగా - రాజ్యాన్ని పాలించినా - రాజుగారి మనస్సంతా దేవుని పాదాలు మీదనే వుండేది. ప్రతిరోజు ప్రత్యేక ప్రార్థనలు చేయించేవాడు. గుళ్లల్లో పండుగలు జరిపించేవాడు.

నాయనారు ఖ్యాతి చాలదూరము విస్తరించింది. ప్రక్కదేశానికి రాజైన ముత్తునాథన్‌కి నాయనారుమీద ఈర్ష్య ప్రబలింది. అతను పెద్ద సైన్యాన్ని సమకూర్చుకొని ఆ సైన్యంతో నాయనారు మీద పెక్కు పర్యాయములు దండెత్తాడు. కాని ప్రతిసారి అపజయం ఎదురైంది. అందుకని ముత్తునాథన్ కుట్రపన్నాడు. నాయనారుకు శివయోగులమీద అత్యంత భక్తి. ఇది తెలిసికొని ఒక రోజు శివయోగి వేషము దాల్చి - రాత్రివేళ రాజుగారి నివాసానికి వెళ్లాడు ద్వారపాలకులు శివయోగి కాబట్టి అతణ్ణి అడ్డగించలేదు. నాయనారు కో ధాతన్ అను ఒక బుద్ధిశాలి, నమ్మకస్తుడైన సేవకుడున్నాడు. రాజుగారి పడకగదిని ధాతన్ కాపాలా కాస్తున్నాడు. శివయోగి రాజుగారి పడకగదిని సమీపించగానే - ధాతన్ రాజుగారు నిద్రిస్తున్నారు. లేపవలదండి అని శివయోగిని ప్రార్థించాడు. శివయోగి వినలేదు "రహస్య శాస్త్రము ఆయనకు (రాజుకు) అందజేయవలసివుంది. నన్ను అడ్డగిం

చకు. నేను వేచియుండలేను." అని శివయోగి అన్నాడు. ధాతన్ ఆయనను లోనికి వెళ్ల నిచ్చాడు. రాజుగారి భార్యలేచి ఒక శివయోగి పడక గదిలో ప్రవేశించుట చూచి భర్తను వెంటనే నిదుర నుండి లేపింది. శివయోగి "శాస్త్రము అతి రహస్యమైనది. అని దేవునిచే చెప్పబడింది. ఒక్క రాజుగారే దీనిని విననర్హుడు." అని చెప్పాడు. రాజుగారు తక్షణమే భార్యను ఆగది నుండి పంపి శివయోగికి సాష్టాంగపడి రహస్యము వినుటకు సిద్ధప డ్డాడు.

రాజుగారి దగ్గఱ నున్న శివయోగి ఎవరో కాదు. ఈర్ష్యను పెంచుకున్న విరోధి యైన ముత్తునాధన్. ముత్తునాధన్ తన దుస్తులలో దాచిన కత్తిని తీసి రాజుగారిని పొడి చాడు. ఆ క్షణమే - శివయోగిని అనుమానిస్తున్న ధాతన్ గదిలో ప్రవేశించి - రాజుగారు నెత్తురు మడుగులో నున్నట్లు, ముత్తునాథన్ చేతిలో కత్తియున్నట్లు గమనించాడు.ధాతన్ వెంటనే కత్తితీసి ముత్తునాధన్‌ని చంపబోయాడు.చనిపోబోతున్న నాయనారు ధాతా ! ఆయన మనవాడు శివయోగి రూపంలో వున్నవాడు. అందుకని ఆయనను మనము గౌరవించవలె. ఆయనకి హాని చేయవద్దు. వెంటనే మన పొలిమేరవఱకు ఆయనను సాగనంపు. ఆయనకు అపకారం జరుగ కుండ చూడు" మన్నాడు. రాజుగారి ఆజ్ఞను శిర సావహించి - శివయోగి రూపంలోవున్న ముత్తునాథన్‌ని సాగనంపుతూంటే ప్రజలు జరి గింది విని ఆగ్రహము చెంది ముత్తునాథన్ పై బడ్డారు. ధాతన్ రాజుగారి ఆజ్ఞను తెలిపి ముత్తునాథన్‌కి ఎవరూ హాని చేయవద్దని నచ్చచెప్పాడు. రాజుగారి ఆజ్ఞను వారుమన్నిం చారు. రాజుగారి భక్తి తత్పరను నిష్ఠను అర్థము చేసికొన్నారు.

ఈ విధంగా ముత్తునాథన్ సురక్షితంగా తన దేశాన్ని చేరగలిగాడు. ధాతన్ తిరిగి రాజసౌధానికి వెళ్లి ముత్తునాథన్ సురక్షితంగా తన దేశాన్ని చేరిన వైనం తెలిపాడు.

ధాతన్ చెప్పినది విని - నాయనారు తన మంత్రులను, బంధువులను తన దగ్గఱ కు పిలిచి ఇలా చెప్పాడు.

"శివభక్తుల సేవ - మన కర్తవ్యము. ఏ పరిస్థితిలో నైనను వారిని గౌరవించాలి. పూజించాలి. మన ప్రజలను శివభక్తుల అడుగుజాడల్లో నడువమనండి. శివభక్తులతో దేశాన్ని నిండిపోనీయండి. వారి ఆశీస్సులతో దేశంలో సిరిసంపదలు వెల్లి విరుస్తాయి."

ఈ మాటలంటూ రాజుగారు కళ్లుమూసుకొని పరమశివుని ధ్యానంలో మునిగిపోయారు.

వెంటనే పరమశివుడు రాజుగారి ఎదుట ప్రత్యక్షమై "నీభక్తికి నేను అలరితిని. నీ భక్తి నిరుపమానము. ప్రశ్నించకుండ, నా భక్తుల యెడ నీవుచూపిన అప్రతిమాన అనురాగం నభూతో నభవిష్యతి. హంతకునిలో గూడ నన్నే చూడగలిగావు. అందుకని దేవతలు గూడ ప్రవేశించలేని కైలాసంలో వుండుటకు నీవు అర్హుడవు. త్వరలో నాలోకానికి రమ్ము" అని ఆశీర్వదించి అంతర్ధానమయాడు.

మయిపోరూల్ నాయనారు గూడ కొలది కాలంలోనే కైలాసం చేరాడు.

****

## 6. విరాల్ మిండ నాయనారు

విరాల్ మిండ నాయనారు పర్వతప్రాంతమైన శీంగునూరు లో జన్మించారు. వెల్లాల కులజుడు. అత్యంత శివభక్తుడు. ఆ భక్తి ప్రపత్తిలో 'నేను' 'నాది' భావాలను అధిగమించాడు. సమత్వ దృష్టి అలవడింది.

శివభక్తులయెడ గౌరవము, శివభక్తుల సేవ - పరమశివుని అర్చనతో సమానమని అంతేకాదు కొంచెము ఎక్కువేనని, ఎంతటి శివోపాసకుడైనను శివభక్తులను కించిత్ అగౌరవపరచిన వారు ముక్తికి దూరమవుదురని భావించేవాడు. అనుదినము శివాలయమున కేగుట అతని దైనందిక కృత్యము. దేవుని ఆరాధించే ముందు - అక్కడ ఏ శివ భక్తుడున్నను అతనిని సేవించిన తర్వాతనే శివార్చన గావించేవాడు.

తీర్థయాత్ర చేయనుత్సహించి శీంగునూరును విడిచి తిరువారూరు చేరుకొన్నాడు. ఒక రోజున దేవుని అర్చించుచుండగా సుందరమూర్తి నాయనారు ఆ దేవళమునకు విచ్చేసి అచ్చట నున్న భక్తులను దాటుకుంటూ గర్భగుడిలోనికి వెళ్లాడు. విరాల్ మిండ నాయనారుకు ఇది గర్హనీయమనిపించింది. భక్తులను దాటి వెళ్లుట అపరాధముగా భావించాడు. సుందరారుతో నీవు శివభక్తులను కించపర్చావు. అందుచే పరమ పవిత్రులైన శివభక్తులమధ్య నీవుండదగవు అందుకని నిన్ను వెలివేస్తున్నాను అంటూ, శివునిగూడ నుద్దేశిస్తూ - శివా - నీవు అనాలోచితముగ సుందరారు అర్చన పరిగ్రహించావు. అందుకని దైవములలోనిన్నుగూడ వెలివేస్తున్నాను అని తన కోపము వెళ్లగక్కాడు. ఆ విరాళ్ మిండ నాయనారు పరమభక్తి శివునిగూడ మందలించ గలిగింది.

ఒక విధముగ ఇది గూడ శివసంకల్పమే. శివభక్తులయెడ ఎంత గౌరవ భావముండవలయునో అందఱకు తెలియ బరచ గలందులకు అతని చేత శివుడట్లా అనిపించాడు.

సుందరమూర్తి నాయనారు శివునియెడ, శివభక్తులయెడ విరాళ్ మిండార్ యొక్క మనోభావాల్ని అర్థము చేసికొని - అతనికి సాష్టాంగ పడి - ఆయనను ప్రశంసిస్తూ

ఒక పడిగమును పాడాడు. ఈ పడిగముతో విరాల్ మిండార్ హృదయము కరిగింది. సుందరారుకు వందనము చెబుతూ - "శివభక్తుల యెడ మీ మనసుకు సరియైన దృక్పధము కలిగింది. వారి ఎడ మీ గౌరవము నిరుపమానము" అని పలికాడు.

ఈ విధంగా భగవంతుడు విరాల్మిండ నాయనారు గొప్ప తనమును అందరికి తెలియ బరచగలిగాడు.

పరమశివుడు విరాల్ మిండ నాయనారును తన లోకంకు తీసికొని వెళ్లి శివ గణాలకు అధిపతిగా చేశాడు.

****

# 7. అమర్నీతి నాయనారు

అమర్నీతి నాయనారు చోళరాజ్యమున ప్రసిద్ధినందిన పళైయ్యరాయికి చెందిన వైశ్య కులజుడు. ఆ గ్రామం చాలా సారవంతమైనది. చుట్టూ తోటలతో లతలతో పచ్చగా శోభాయమానంగా ఒప్పతూండేది.

అమర్నీతి నాయనారు బంగారం, రత్నాలు, పట్టు వస్త్రముల వ్యాపారి. విదేశాల నుండి వస్తువులను తెప్పించి వ్యాపారం చేస్తుండేవాడు. ఆయన ఆర్జన బహునీతిమంత ముగాయుండేది. వ్యాపారం కలిసిరావడంతో మంచి ధనవంతుడయ్యాడు. వ్యాపారము చేస్తున్నా, ఇహలోక వ్యాపకాలున్నా నాయనారు మనసు శివుని మీదే వుండేది. పరమశివ భక్తుడు. శివ భక్తులను తన గృహమునకు పిలిచి వారిని అర్చించేవాడు. వారలకు కౌపీనము, దుస్తులు మొదలగునవి ఇచ్చి, షష్టుగా భోజనము పెట్టి, ఏవైనా కానుకలు ఇచ్చి వారు సంతసించునట్లుగా చేసి సాగనంపేవాడు.

పండుగలలో పబ్బాలలో తిరునల్లూరు దేవాలయమునకు దైవదర్శనమునకు వెళ్లేవాడు. అక్కడ శివుని ముందు భావయుక్తంగా పంచాక్షరిని జపిస్తూ శివుని అర్చించే వాడు. కొన్నాళ్లకి పండుగలకు మాత్రమే తిరునల్లూరు దేవాలయమునకు వెళ్లటంతో సంతృప్తినందక - ఆ వూరిలోనే నివసించిన - నిరంతరము శివదర్శనము చేయవచ్చని శివభక్తుల సేవకు వీలవుతుందని తలచి - తిరునల్లూరుకు తన బంధువులతో సహా వెళ్లి అక్కడే స్థిరపడి - దైవదర్శనమునకు వచ్చెడి శివభక్తులకు వుండుటకు వీలుగా ఒక మఠం కట్టించాడు. ప్రతిదినము వారిని తన ఇంటికి పిలిచి వారలకు కౌపీనము మొదలగునవిఇచ్చి సంతసింపజేసేవాడు.

నాయనారు భక్తితత్పరతకు పరమశివుడు పరవశించి పోయాడు. ముఖ్యముగా కౌపీనముల నిచ్చుచుండుట, శివభక్తులయెడ వాత్సల్యము, ఔదార్యము శివుని ఆకర్షించి నవి. అతని ఔదారత్వాన్ని అందరిచేత ప్రశంసింపజేయాలని అతనికి తన శుభాశీస్సుల నియ్యటానికి శివుడు నిశ్చయించాడు.

అందుకని ఒకరోజున బ్రహ్మచారివేషంతో జటతో, విభూతి పుండ్రములు, భుజం మీద దండంతో శివుడు అమర్నీతియారు మఠంకి విచ్చేశాడు. బ్రహ్మచారి దండానికి చివర 2 కౌపీనములు, విభూతిసంచి కట్టబడి వున్నాయి. ఆయన ముఖం తేజోవం తంగా యుంది. కళ్లు ప్రకాశమానంగా వున్నాయి. ఠీవిగా మఠంలోకి ప్రవేశించాడు. అమర్నీతి యారు పరమానందంతో అతిథిని ఆహ్వానించి అర్చించాడు. బ్రహ్మచారి - అమర్నీతియారుతో " మీరు మహాత్ములు. ప్రతి ఒక్కరు మీదానాలకి ముఖ్యముగా కౌపీన ముల దానాలకు మిమ్ములను అభినందిస్తున్నారు.మీ దర్శనానికి వచ్చాను." అని అన్నాడు. అమర్నీతియారు - బ్రహ్మచారిని తన వద్దనుండి బిక్షను స్వీకరించవలసిందిగా అర్థిం చాడు. బ్రహ్మచారి ఒప్పకొని - "నేను నదికెళ్లి స్నానము చేసి నిత్యకర్మానుష్టానము చేసి వస్తాను. వర్షము వస్తోంది. వర్షముకు నా కౌపీనములు తడిసిపోయాయి. అందుకని ఈ పొడి కౌపీనమును జాగ్రత్త పరచండి. నేను వచ్చి తీసికొంటాను. అది చాలా విలు వైంది. ప్రత్యేకమైనది గూడ. అందుచే దానిని భద్రముగా యుంచండి" అని చెప్పి స్నానా నికి నదికి వెళ్లాడు.

బ్రహ్మచారి నదికి వెళ్లాడు. అమర్నీతియారు ఆ కౌపీనమును భద్రపరిచాడు. పర మశివుడు దానిని మాయం చేశాడు. బ్రహ్మచారి స్నానము చేసి వచ్చి తన పొడి కౌపీన మును ఈయమని కోరాడు. తన రెండో కౌపీనము వానకు తడిసిపోయింది. అందుకని పొడిదానిని అడిగాడు. అమర్నీతియారుకు తాను భద్రపరిచినచోట కౌపీనము కనిపించ లేదు. అంతటా వెదికాడు. ఎక్కడా కన్పించలేదు. అందుకని వణుకుతూ బ్రహ్మచారికి ఇం కొక కౌపీనముతో నిలబడి పరిస్థితిని చెప్పాడు. బ్రహ్మచారి నాయనారు మాటలను అంగీ కరించలేదు. వినలేదు. నాయనారు చాలాధనము దానిబదులు యిస్తానన్నాడు. బ్రహ్మ చారి "ధనాన్ని నేనేమి చేసికొంటాను అవసరం లేదు నా అవసరం కౌపీనము మాత్రమే" నన్నాడు. బ్రహ్మచారి ఇంకా అన్నాడు. "మీకు కౌపీనము కనిపించనిచో, నా ఇంకో కౌపీన మునకు సరితూగు వేరొక కౌపీనము నీయండి" అన్నాడు. అమర్నీతియారుకు కొంచెం స్వస్థత కలిగింది. వెంటనే త్రాసును తెప్పించాడు. బ్రహ్మచారి కౌపీనమును ఒక తక్కెటలో

ఉంచాడు. రెండో తక్కెటలో తాను ఇవ్వదలచిన కౌపీనమును పెట్టాడు. బ్రహ్మచారి కౌపీనమే ఎక్కువ బరువుచూపింది. అమర్నీతియారు ఏమిపెట్టినను బ్రహ్మచారి కౌపీనమే బరువుగా కన్పించిది. అమర్నీతియారుకు ఆశ్చర్యము కలిగింది. ఇదంతా శివలీలయని గ్రహించాడు. తన సంపదయావత్తు బ్రహ్మచారి కౌపీనమునకు సరితూగలేదు. పరమ శివుని కౌపీనము వేదమును తలపింపజేస్తుంది. దాని పోగులు శాస్త్రాలు.

అమర్నీతియారుకు పాలుపోలేదు. బ్రహ్మచారి కాళ్లమీద పడ్డాడు. "స్వామీ! నన్ను, నా భార్యను, నా పుత్రుని గూడ మీ కౌపీనమునకు సమమవుతాయేమో తూచండి" అని అర్థించాడు. బ్రహ్మచారి అంగీకరించాడు. అమర్నీతియారు తన కుటుంబముతో తక్కెట లో కూర్చుంటూ " నేను యథార్థంగా శివభక్తులను భక్తితో, చిత్తశుద్ధితో సేవించుచున్న ట్లయితే, ఈ త్రాసు ఇప్పడు సరితూగుగాక" అన్నాడు. త్రాసు ఆశ్చర్యకరంగా సరితూగింది. అమర్నీతియారు పుణ్యం బ్రహ్మచారి కౌపీనమునకు తుల్యమయింది. అచ్చట చేరిన ప్రజ లందరూ చకితులయ్యారు. వారు అమర్నీతాయారు పాదములపైబడి ప్రశంసించారు. దేవతలు ఆ కుటుంబముపై పారిజాత సుమ వృష్టికురిపించారు. బ్రహ్మచారి అంతర్థానమై నాడు.పార్వతీపరమేశ్వరులు వృషభవాహనముపై ప్రత్యక్షమై నాయనారును అనుగ్రహిం చారు. పరమేశ్వరుడు అమర్నీతియారు నుద్దేశించుచు "నీ కౌపీన దాతృత్వము శివభ క్తుల నిరుపమాన సేవ మమ్మల్ని అలరించింది. నీవు, నీ భార్య, పుత్రుడు ముగ్గురు నాలో కంలో శాశ్వతంగా నివసించండి" అన్నారు. శివానుగ్రహం వల్ల తక్కెడ దివ్యవిమానంగా మారి అమర్నీతియారును, భార్యను, పుత్రుని శివలోకానికి చేర్చింది.

****

## 8. ఎరిపాత (భక్త) నాయనారు

చోళరాజ్యంలో ప్రధాన పట్టణమైన కరువూరులో ఎరిపాతనాయనారు జన్మిం చారు. అది చాలా పవిత్ర పుణ్యస్థలం. పట్టణము ప్రక్కనుంచి అంబరావతి నది పారుతూ వుంటుంది. ఆ నది యిరువైపులా ఋషులు తపస్సు చేస్తూ భక్తి తరంగాలు ప్రసరితం చేస్తూ వుంటారు. అచ్చట ప్రఖ్యాతి నొందిన పశుపతీశ్వరుని దేవాలయముంది. పసుపతీ శుడు రాజుకు ప్రజలకు శాంతి సుఖ సంతోషాలనిచ్చే ఇష్టదైవము. ఎరిపాత నాయనారు పశుపతినాథుని అనుదినము గొల్చేవాడు. శివభక్తులకు సేవచేసి, వారికి రక్షకుడుగా వుండుట ఆయన ధ్యేయము. ఒక గొడ్డలిని పుచ్చుకుని తిరిగేవాడు. శివభక్తులకెవరికైనా హాని తలపెడితే భక్తులకు సహాయముగా గొడ్డలిని చూపి హానిచేయువారిని శిక్షించే వాడు. ఇది శివుని పని అని తను చేస్తున్నట్లుగా భావించేవాడు.

ఆ వూళ్లోనే శివకామి ఆండార్ అనే ఇంకో శివభక్తుడున్నాడు. శివుని నియమ ముతప్పక అర్చించేవాడు. ప్రాతఃకాలమున అనుష్ఠానములు అయిన తర్వాత పూలను సేక రించడం వానిని మాలలగా గ్రుచ్చి దేవునికి సమర్పించడం గూడ అతని దైనందిన కార్య క్రమమయింది.

ఒక మహానవమి రోజున అందరూ ఆనందోత్సాహితులై యున్నప్పుడు శివకామిఆం డార్ ఎప్పటిలాగున పూలసజ్జ పుచ్చుకుని త్వరిత గతిని వెళ్తున్నాడు. ఆ క్షణం లోనే మావ టీండ్రు రాజుగారి ఏనుగును నదిలో స్నానము చేయించి ఏనుగుతో తిరిగి వస్తున్నారు. దానిమీద ఇద్దరు మావటీండ్రు వున్నారు. ముగ్గురు దానికి సహాయ రక్షకులుగా వున్నారు. ఎందుకనో దానికి మదమెక్కి మనుష్యులను తరుముట మొదలుపెట్టింది. వాళ్లంతా ఇటూ అటూ పరుగిడ మొదలు పెట్టారు. ఆ ఏనుగు శివకామి ఆండార్ దెసకు పరుగెత్తి శివకామి ఆండార్‌ను పుచ్చుకొని పూలబుట్ట అతని నుంచి లాక్కుని నేలమీద విసిరేసి వెళ్లిపోయింది. పూలన్నీ విరజిమ్మబడ్డాయి. శివకామిఆండార్‌కు మతి తప్పింది. దేవుని అర్చ నకై తాను సేకరించిన పూలన్నీ నేలపాలయ్యాయి. ఏనుగును తరిమాడు. తరుముతూ వ

యసు మళ్లినవాడు కాన అలిసి నేలమీద పడ్డాడు. బిగ్గరగా ఏడ్చాడు. శివా శివా అని బాధలో అరిచాడు.

ఎరిపాతనాయనారు ఆ బాటన పోతున్నాడు. శివకామిఆండార్ దీనమైన ఆక్రందన వినిపించింది. ఎరిపాతార్ - ఏనుగెక్కడ? అని ప్రశ్నించాడు. శివకామిఆండార్ చూపిన దెసకు పరుగెత్తి వీరభద్రావతారము దాల్చి ఏనుగు మీద తన గొడ్డలిని విసిరి ఏనుగును చంపేశాడు. మావటివాళ్లు అతనిమీదకు దండెత్తగా వాళ్లని గూడ అంతమొందించాడు.

ఏనుగు చంపబడిందన్న వార్త రాజుగారి చెవినపడింది. ఆయన వెంటనే సైనికులతో గుఱ్ఱం మీద వచ్చాడు. ఏనుగును ఎవరు చంపారో తెలియలేదు. అందుకని ఏనుగును ఎవరు చంపారు? అని గట్టిగా అరిచాడు. కొందరు ఎరిపాతార్‌ను చూపారు. శివయోగి ఇంకను రౌద్రముగా యున్నాడు. శివయోగిని చూడగానే రాజు గారి కోపము చల్లారింది. శివయోగి పనవుతే దానికి తగిన కారణముంటుంది. బహుశా తనను తాను రక్షించుకొనుటకు ఈ పనిచేసి వుండవచ్చును అనుకున్నాడు. ఎరిభక్తునితో ఇట్లా అన్నాడు. “స్వామీ ఏనుగును మీరు చంపారని అనుకోలేదు. ఏనుగు, మావటివాండ్రు మీకు అపకారము చేసి వుంటారు. వారికి తగిన శిక్షను మీరు ఇచ్చారు” ఎరిపాతార్ జరిగినది చెప్పాడు.

“ఏనుగు, మావటీండ్రు శివాపరాధమొనరించారు. అందుకు దానిని, వాళ్లను చంపాను” అన్నాడు. ‘శివాపరాధం’ అన్న మాట వినగానే రాజుగారి మనసులో వేదన కలిగింది. ఎరిపాతార్ కాళ్లమీద పడ్డాడు. ‘స్వామీ! వాళ్లు చేసిన అపరాధానికి మీరు విధించిన శిక్ష స్వల్పము. అటువంటి ఏనుగును అటువంటి మావటివాళ్లను పెట్టుకున్నందుకు నేను ఇంకా పెద్ద అపరాధము చేశాను. మీ పవిత్రమైన ఆయుధము (గొడ్డలి)తో నన్ను చంపవద్దు. ఇదిగో నా కత్తి. దీనితో నా తలను ఉత్తరించండి” అని ప్రార్థించాడు.

ఎరిపాతార్ ఆ మాటలు విని నిశ్చేష్టితుడయ్యాడు. తనుగూడ పశ్చాతాపముతో బాధపడ్డాడు. రాజుగారికి, మహాపవిత్రుడైన రాజుగారికి నేనెంత వేదనను కలిగించాను?

రాజు ఎంత ఉన్నతుడు? అనుకొని రాజుగారు తన్ను తాను అంతమొందించుకొను నేమో యని రాజు వద్ద నుండి కత్తిని లాక్కున్నాడు. రాజుగారి దుస్థితికి ఎరిపాతార్ తానే కారణ మని ఎంచి తనకు తానే శిక్ష విధించుకొని తన కంఠంను ఉత్తరించుకోబోయాడు. రాజుగారు తన మూలాన్ని ఇంకో ఘాతుకము జరుగబోతూందని - ఎరిపాతార్ చేయిని, కత్తిని గట్టిగా పట్టుకొని కంఠం ఉత్తరించుకోకుండా ఆపాడు.

పరమశివుని లీల పూర్తయింది. అశరీర వాక్కు వినిపించింది. “మహానుభావు లారా! ఇదంతా పశుపతీశ్వరుని లీల. ప్రపంచంకు ఈ భక్తుల మహాభక్తి తత్వరత తెలియ గలందులకు ఇది జరిగింది” తక్షణమే ఏనుగు, మావటివాళ్లు పునర్జీవితులయ్యారు. శివ కామి ఆండార్ పూజసెజ్జ పూలతో నిండిపోయింది. అందరూ ఆశ్చర్యచకితులై పశుపతీశ్వ రుని మీద ఆయన విశేషాన్ని కీర్తిస్తూ ఆనందంతో భక్తినిరతితో పాడారు.

ఎరిపాతార్ ఖడ్గమును రాజుగారి పాదాలముందు పెట్టి సాష్టాంగపడ్డాడు. రాజు గారు కూడా ఎరిపాతార్ కాళ్లకు మ్రొక్కాడు. ఇద్దరు ఆనందతో ఒకరి నొకరు పరిష్వంగ నం చేసికొన్నారు. ఎరిపాతార్ రాజుగారిని ఏనుగునెక్కించి సాగనంపాడు. తన స్థానానికి తాను వెళ్లాడు. శివకామి ఆండార్ పూలసజ్జతో ఆలయంలోకి వెళ్లాడు

ఎరిపాతార్ శివభక్తులను సేవిస్తూ అంత్యమున శివసాయుజ్యమొందినాడు.

# 9. ఎనాది నాథనాయనారు

ఎనాది నాథనాయనారు గౌడ కులస్థుడు. చోళ సామ్రాజ్యంలో ఐనానూరులో జన్మించాడు. ఆవూరు అరిసోల్ నదీ ప్రవాహము ఒడ్డున కుంభకోణమునకు వాయువ్య దిశలో వుంది. చాలా సారవంతమైన ప్రదేశము.

ఎనాదినాథర్ అచంచల శివభక్తుడు. శివభక్తిలో మాయిపోరూల్ నాయనారును మించిపోయాడు. శివభక్తులనేకాదు శివయోగులనే కాదు, మనుజులు ఫాలమున విభూతిరేఖలు మూడు ధరించిన చాలు వారిని బహుదా గౌరవించేవాడు. అపరిమిత భక్తసేవాతత్పరుడు. అవసరమైతే వారికొఱకు తన ప్రాణాలనైనా త్యజించుటకు సిద్ధపడే వాడు. త్యజించాడుకూడా.

కత్తిసాములో ఎనాదినాథర్ సుప్రసిద్ధుడు. రాజకుమారులను ఖడ్గవిద్యలో ప్రవీణు లుగా నొనరించేవాడు. ఈ విద్యకు గురువైనందుకు ఆదాయము కూడా వచ్చేది. ఆవచ్చి నదంతా శివభక్తుల సేవకై వెచ్చించేవాడు.ఈ విద్యలో అందరిచేత ప్రశంసలందుకొన్నాడు.

ఇది కొందరిలో ఈర్ష్య, ద్వేషము, అసూయలను రేకెత్తించింది.

అట్లా అసూయ, ద్వేషము పెంచుకున్న వారిలో అతిసూరన్ అనేవాడు ఒకడు. ఎనాదినాథర్ మీద కార్పణ్యము పెంచుకొన్నాడు. అతనికి ఖడ్గ విద్య అంతగారాదు. పేరు కు (అతిసూరన్ - మహాశూరుడు) తగడు. అంత శరీర దార్ఢ్యము కూడా లేదు. ఏనాది నాథర్‌తో పోరి జయించాలనుకున్నాడు.

ఒకరోజున తన మనుష్యులు, బంధువులతో నాయనారు ఇంటిపై దండెత్తి, ఇంటి ముందు నిలబడి పోరుకు రమ్మని పిలిచాడు. నాయనారు పోటికి సిద్ధపడ్డాడు. అక్కడ నున్న పొద దగ్గర పోరాడుదాము, అక్కడికి రమ్మన్నాడు నాయనారును. అతిసూరన్ బం ధువులంతా ఆ పొద చాటున దాగున్నారు. నాయనారు పొదదగ్గఱ పోటీకి సిద్ధమైనాడు. ఈలోగా నాయనారు స్నేహితులు వచ్చి అతనికి రక్షణగా నిలిచారు. ఉభయులకు పెద్దపో రాటమే జరిగింది. చాలామంది నిహతులయ్యారు. అతిసూరన్ పారిపోయాడు.

మఱునాడు అతిసూరన్ మఱల సందేశమంపాడు. “ఇతరుల సాయము లేకుం

డా పోరాడుదాము. మనమూలాన్న ఇతరులు హతులవుతున్నారు. అందుకని ఒక ఏకాంత ప్రదేశమున మన మిద్దరమే బలాబలాలు తేల్చుకుండాము" అని కబురంపాడు.

ఏనాదినాథర్ ఒప్పకున్నాడు. మఱునాడు ప్రొద్దున్నే అతిసూరన్ తన ఫాలం మీద 3 విభూతిరేఖలుంచుకుని, అవి కనబడకుండా కవచము నడ్డుబెట్టుకొని నాయనారుపై పోరుకు దిగాడు.

ఏనాదినాథర్ అతిసూరన్‌పై తన ఖడ్గాన్ని ప్రయోగించబోయాడు.

ఆ క్షణమే అతి సూరన్ తన ముఖముపై వుండే కవచాన్ని తొలిగించాడు.

నాయనారుకు అతి సూరన్ ఫాలముపై విభూతిరేఖలు కనిపించాయి నిశ్చేష్టుడయ్యాడు. వెంటనే ఖడ్గాన్ని దించి "అయ్యో ఎంత శివాపరాధము చేయబోయాను ? అతను ఇప్పుడు శివభక్తుడైనాడు. అతనికి హాని చేయరాదు. నన్ను చంపాలన్న అభిలాషను అతిసూరన్ నెరవేర్చుకోనీ" అనుకున్నాడు. అనుకొని ఖడ్గాని పారవేయబోయాడు. కాని దానిని చేతిలోనే వుంచుకొని పారవేయాలి అన్న ఆలోచనను మరల్చుకొని - నేను ఖడ్గాన్ని పారవేస్తే నిరాయుదుడ్ని చంపిన పాపము అతనికి అంటుకుంటుంది. శివభక్తునికి అటువంటి పాపము తగలనీయరాదు అనుకుంటూండగా అతి సూరన్ నాయనారును పొడిచి చంపేశాడు.

నాయనారు ఆత్మాహుతికి , మహాశివభక్తితత్పరతకు, శివభక్తుల యెడ గౌరవము అభినివేశము చూచి పరమేశ్వరుడు చలించిపోయాడు. ఏనాది నాథుని యెదుట ప్రత్యక్షమయి, అతనిని తనలోకానికి తీసికొని వెళ్లాడు.

****

భస్మధారణ మహిమ ఇంతింతయని చెప్పలేము. శైవభక్తుల ఫాలమున మూడు విభూతి రేఖలను చూస్తాము. ముముక్షువులకు భవబంధాలు, త్రయీతత్త్వాల నుండి విముక్తి కలిగిస్తున్నట్లు, కలుగజేయుటకు ఉత్తేజము ఉత్సాహము నొసగు రేఖలవి. వాటికి ప్రతీకలు.

త్రయీతత్వాలు : 1. మలత్రయము : ఆనవము ('I'ness) కర్మ (selfish activity) మాయ (illusion)

2. ఈషణత్రయము: ధనేషణ, దారేషణ, పుత్రేషణ

3. వాసనత్రయము: లోకవాసన (worldliness)

దేహవాసన (attachment to the body)

శాస్త్రవాసన (blind faith in the scriptures and polemics)

4. శరీరత్రయము: స్థూల సూక్ష్మ కారణ శరీరములు

5. త్రయావస్థలు: జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్తి అవస్థ .

# 10. కన్నప్ప నాయనారు

పొత్తవి నాడులో ఉడుప్పూరు గ్రామములో నాగడు అను ఒక బోయరాజున్నాడు. అతని భార్య దత్త నామధేయముగలది. భార్యా భర్త లిద్దఱు సుబ్రహ్మణ్య స్వామి భక్తులు. స్వామిదయ వలన చాల కాలమునకు ఒక పుత్రుడు జన్మించాడు. తల్లిదండ్రులు ఆ బాలునకు తిన్నడు అని నామకరణము చేశారు.

శ్రీకాళహస్తి పురాణముననుసరించి తిన్నడు పూర్వజన్మములో అర్జునుడు. శివుని గూర్చి తపము చేసి పాశుపతాస్త్రమును పొందినాడు. పరమేశ్వరుడు బోయవానిగ అర్జ నుని ముందర వచ్చినప్పుడు అర్జునుడు శివుని గుర్తించలేకపోయాడు. ఆకారణముచే మరుజన్మలో అర్జునుడు బోయవాడుగా (తిన్నడు) జననమంది ఆ రూపంలో శివుని మెప్పించి సాయుజ్యమందవలసి వచ్చింది.

నాగడు తిన్ననికి బోయలకు వలయు సకల విద్యలను నేర్పించినాడు. తిన్నడు విలువిద్యలో ఆరితేరాడు. చిన్నవాడుగా వుండగానే నాగడు తిన్నని రాజ్యాభిషిక్తుడుగా చేశాడు. బోయవాడుగా తన కులధర్మము ననుసరించి వేటాడినా - తిన్ననికి అన్ని జీవు లయెడ - వాత్సల్యము, ప్రేమాభిమానములు పుట్టుకనుండి అభివృద్ధి నొందాయి. జంతు వులలో పిల్లలని, ఆడవాటిని, రుగ్మత తో నున్న జంతువులని వేటాడేవాడు కాదు. తనలోని జంతు భావాలైన కామ, క్రోధ, మద మాత్సర్యాలను జయించాడు.

ఒక రోజున తిన్నడు వేటకువెళ్ళాడు ఒక సూకరము అతని వలనుంచి తప్పించు కొని పారిపోజూచింది. తన అనుయాయులైన నాముడు, కాముడులతో ఆ పందిని తరు ముకుంటూ వెళ్లాడు. సూకరముకు అలసట వచ్చింది. చెట్టుముందర ఆగింది. తిన్నడు దానిని చంపాడు. వీళ్లు గూడ అలిసిపోయారు. దప్పికైంది. పందిని మోసుకొని స్వర్ణ ముఖీ నదీ తీరానికి పోయారు. కాళహస్తి పర్వతము, దేవాలయము కన్పించాయి. తిన్నడు ఆ పర్వతమెక్కి -ఆ దేవాలయమును చూడదలచాడు. అక్కడ పరమేశ్వరుడు

కుడుము దేవారు. (పిలకవున్న దేవుడు) అని నాముడు చెప్పాడు. కాముడు పందిని పచనము చేయ మొదలుపెట్టాడు.

ఆ పర్వతమెక్కుతుంటే తిన్ననిలో మార్పు కానవచ్చింది. అదిపూర్వ జన్మసంస్కార ఫలితము. తన మీదనుంచి బరువు ఏదో తగ్గుతున్నట్లనిపించింది. దేహస్పృహకూడ మందగించింది. అక్కడ శివలింగంను కనుగొనగానే దాని మీద అనంతమైన ప్రేమ పుట్టుకు వచ్చింది. ఆ లింగమును కావలించుకున్నాడు. ముద్దులు గుమ్మరించాడు. ఆనంద భాష్పాలు రాలటంతో, శివునితో 'ఈశ్వరా ! ఈ దట్టమైన అడవిలో ఒంటరిగా ఎలా వున్నావు ? నీకు ఆహారము ఎలా వస్తుంది ? నేను నీతోనే వుంటాను. ఆకలిగా నున్నట్లున్నది. నీకు ఆహారం సమకూరుస్తాను' అని లింగం ను వెంటనే విడిచి వెళ్లలేకపోయాడు. శివుని ఆకలిదీర్చుటకు వెంటనే కొండదిగాడు. కాముడు పచనము చేసిన పందిమాంసమును రుచి చూచి మంచిది శివునికి వేర్పరచాడు. 'నాముడు ఈశ్వరుడుకు ఆహారము సమర్పించే ముందు ప్రతిదినము నీటితో అభిషేకింపబడుతాడని, పూలతోపూజింపబడతాడని చెప్పాడు.' తిన్నడు అదివిని నదినుండి నోటినిండా నీళ్లను పుక్కిలి బట్టి సేకరించిన పూలను తన తలమీద వుంచుకొని, పచనము చేసిన మాంసమును చేతిలో వుంచుకొని, విల్లు అంబులతో తిన్నగా గుడికి వెళ్లాడు. అక్కడ పుక్కిలిబట్టిన నీరును శివునిపై వదిలాడు. అది అభిషేకమయింది. తలమీదవున్నపూలతో శివుని అలంకరించాడు. అది అర్చన అయింది. తర్వాత తాను తెచ్చిన పందిమాంసమును దేవునిముందు పెట్టాడు. అదిఆయనకు నివేదన అయింది. ద్వారమువద్ద ఎవరిని, ఏ జంతువులను రానీకుండ కాపలా కాశాడు. మరునాడు ప్రొద్దున మళ్లీ ఆహారము తెచ్చుటకు బయలుదేరి వెళ్ళాడు.

నాముడికి కాముడికి మతిపోయింది. తిన్నడులో వచ్చిన మార్పును మతిభ్రమణమేమోనని భావించి వెంటనే వెళ్లి తిన్నని తల్లిదండ్రుల కెరింగించారు. వారు తిన్నని ఇంటికి తీసికొని పోజూచారు. తిన్నడు తాను శివుని దగ్గరే వుంటాను అని వెళ్లలేదు.

తిన్నడు దేవునికాహారము సేకరించటానికి వెళ్లగా, ఆలయ అర్చకుడు శివగోచారి శివుని దైనందికార్చనకు వచ్చాడు. ఎవరో దేవాలయమును అపవిత్రము చేశారని భావిం

చాడు. నిర్ఘాంతపోయాడు. ఆగమాల్లో ఆ అర్చకుడు నిష్ణాతుడు. అందుకని అక్కడ వున్న మాంసము మొదలగువానిని తొలగించి మంత్రయుక్తముగా సంప్రోషణగావించి మళ్లీ స్నానము చేసి మడిగా కుండలో తెచ్చిన స్వర్ణముఖీ జలముతో అభిషేకము చేసి, పూల తోనలంకరించి విభూతినలిమి,తెచ్చిన పళ్లు మధుర పదార్థములతో నివేదన గావించి వెళ్లాడు.

పూజారి వెళ్లగానే, తిన్నడు మళ్లీ దేవుని నివేదనకై వేటాడిన మాంసమును తెచ్చాడు. పూజారి అలంకరించిన పూజాద్రవ్యములను తీసివేసి తనదైన పద్ధతిలో పూజచే శాడు. ఈవిధంగా ఐదు రోజులు జరిగాయి. పూజారి ఇక వుండబట్టలేకపోయాడు. దుఃఖి స్తూ పరమశివుని ప్రార్థించాడు. "ఈ ఘోరకలిని ఆపండి" అని ఎలుగెత్తి ప్రార్థించాడు. శివుడు శివగోచారికి తిన్నని భక్తిప్రపత్తులను చూపదలచాడు. అర్చకునకు కలలో కని పించి "నీవు లింగము వెనుక దాగి యుండు. బయటకు రాక అక్కడ ఏమిజరుగుచు న్నదో గమనించుము" అని ఆదేశించాడు.

ఆఱవ రోజున యథావిధిని తిన్నడు ఆలయానికి వచ్చాడు. వస్తుండగా తిన్ననికి కొన్ని దుశ్శకునాలు గోచరించాయి. ఏదో శివునకు ఆపద జరిగిందని భావించాడు. శివునికి ఆపద జరుగగలదా అని తనని గూర్చి మరిచిపోయాడు. గుడికి పరుగెత్తి వెళ్లాడు. వెళ్లిచూడగానే - శివుని కుడికన్ను నుండి రక్తము బయటకి వస్తోంది. దేవుని అర్చనకు తాను తెచ్చిన వస్తువులు క్రింద పడిపోయాయి. బిగ్గరగా ఏడ్చాడు. ఎవరు ఈ పనిచేశారో తెలియలేదు. తనకు తెలిసిన మూలికావైద్యం చేశాడు.కాని రక్తము ఆగలేదు. వెంటనే అతనికి ఒక ఊహ కలిగింది. 'కన్నుకు కన్ను' సిద్ధాంతముగా స్ఫురించింది. వెం టనే బాణంతో తనకుడి కన్నును పెకలించి శివునికి పెట్టాడు. రక్తమాగిపోయింది. సంతో షించాడు. నృత్యము చేశాడు. నృత్యము చేస్తుండగా - ఇప్పుడు శివునికి ఎడమ కన్ను నుండి నెత్తురు బయటకు రావడం గమనించాడు. భయము లేదు మందు తెలసిం

దిగా, కాని ఒక సమస్య మదిలో మెదిలింది. తన ఎడమ కన్ను గూడ తీసిన శివుని కన్ను కనుగొనుట ఎలా? అందుకని గుర్తెరుగుటకు తన పాదాన్ని శివుని ఎడమ కంటిపై బెట్టి - తన ఎడమ కన్నును పెకళించబోయాడు.

పరమ శివుడు వెంటనే ప్రత్యక్షమయి తిన్నని చేతిని పట్టుకొని ఆపాడు. "నిలువుము కన్నప్పా! కన్నప్పా! నీ భక్తికి మెచ్చాను. ఇంతటి నిరతిశయ భక్తిని మునుపెన్నడు చూచి ఎరుగను. పంచాగ్నుల మధ్య నిలిచి తపమొనర్చిన మునుల ఆంతర్యము కన్న నీ చిత్తము అతి పవిత్రమైనది. నా హృదయమునకు సంపూర్ణానందము కలిగించినది నీవొక్కడివే కన్నప్పా!" అని ప్రశంసించాడు.

పరమేశ్వరుడు కన్నప్పా అని మూడుమారులు పిలిచాడు. అంటే కన్నప్ప శివుని అనుగ్రహమును మూడింతలుగా పొందాడన్నమాట. తన కన్నును ఈశ్వరునికర్పించినందులకు తిన్నడు కన్నప్ప అయ్యాడు. కన్నప్పనాయనారు అయ్యాడు. నేత్రేశనాయనారు అనునది సంస్కృత నామము.

శివుడు తన రెండు చేతులతో కన్నప్పను తన దగ్గరకు తీసికొని తన ప్రక్కకు చేర్చుకున్నాడు. కన్నప్పకు చూపువచ్చింది. సాక్షాత్తూ శివుని వలె జీవించాడు. శివగోచారికి తిన్నని అపురూపమైన శివభక్తి గోచరమైంది.

ఈ కథలో దివ్యార్థమొకటుంది. కన్నప్పనాయనారు అన్ని దొసగులను జయించగలిగాడు. కాని అహంకారము మాత్రము ఇంకా మిగిలివుంది. అది గూడ తొలగిపోవాలి. అడవిపంది ఈ విషయాన్ని చూపుతుంది. ఆ పందిని తరిమితరిమి వేటాడాడు. చంపగలిగాడు. అది చంపబడగానే తనలోని అహం నశించింది. తిన్ననిలో నిరతిశయభక్తి పుంజుకుంది. దాన్ని వేటాడేటప్పుడు మంచి, చెడు అతనితోనే వున్నాయి. నాముడు దేవుడు గూర్చి అభిషేకము, పూజ, నివేదనము మొదలగునవి తిన్ననికి చెప్పాడు. నాముడు మంచికి ప్రతీక. కాముడు (చెడు) వెనకుండి పోయాడు. మంచి సంస్కారాలతో కన్నప్ప శివుని దగ్గఱకు వెళ్లాడు. దేవుని చేరాలన్నచో తనొక్కడే ప్రయత్నించాలి. అందుకని శివుని పూజకు తనొక్కడే వెళ్లాడు. నాముడు, కాముడు తల్లిదండ్రుల దగ్గరకు వెళ్లారు. నాయనారు తల్లిదండ్రులు అంతర్లీనంగా దాగి యున్న భవబంధాలు. తిన్నని ఆపటానికి ప్రయత్నించారు. తిన్నడు ఆ భవబంధముల నుండి గూడ వైదొలగి ఒక్కడే వుండిపోయాడు. పరమ శివుడు తన (లింగం) వెనుక పూజారిని దాగి యుండమన్నాడు. భక్తుడైన తిన్నడు పరమశివుని ముందరున్నాడు. అంటే భక్తి, క్రియాకలాపాల కన్న మిన్న. తన కళ్లని పెకలించి శివుని

కిచ్చుటలో తిన్నని సంపూర్ణశరణాగతి ఆత్మనివేదన గోచరిస్తుంది. అంతకన్న అనితరమైన భక్తితత్పరత కనిపించదు. వెంటనే అది భగవంతుని సాక్షాత్కరింప చేస్తుంది. చేయగలదు.

****

## 11. గుగ్గలు కలశ నాయనారు

చోళదేశమున తిరుక్కడవూరులో గుగ్గలు కలశనాయనారు జన్మించాడు. ఆయన బ్రాహ్మణుడు. అక్కడ దైవము పేరు అమృతఘటేశ్వరుడు. దేవతలు, అసురులు అమృత కలశంతో ఆ వూరు వచ్చారు. వారు స్నానము చేయుదము అనుకొన్నారు. ఆ కలశాన్ని నేలపై నుంచి నదికి స్నానమునకు వెళ్లారు. వారు తిరిగి వచ్చి ఆ కలశమును తీసికొందామంటే నేలనుంచి అది పైకి రాలేదు. ఆ కలశం లింగంగా మారింది. అందుకని ఆ లింగాన్ని అమృత లింగం అంటారు. మార్కండేయుడు ఈ లింగంకే తపస్సుచేసి తన 16వ ఏట అమరుడయ్యాడు. ఇక్కడ అమ్మవారు అభిరామి అమ్మన్. అభిరామపట్టార్ ఈ అమ్మన్‌కు పరమభక్తుడు. అమె మీద ఎన్నో కీర్తనలు పాడాడు. అభిరామపట్టార్ యందు అమ్మకు అనుగ్రహం మెండైంది. రాజుగారి ఆగ్రహము నుండి ఈ పట్టార్‌ను తప్పించుటకు ఈమె అమావాస్యను పౌర్ణమిగా మార్చింది కూడ.

గుగ్గలు కలశనాయనారు ఈ ఆలయమున శివునికి ప్రతిదినము గుగ్గిలముతో ధూపము వేయుచు పూజ చేయువాడు. ఈకారణముచే అతనికి గుగ్గలుకలశ నాయనారు అను పేరు వచ్చింది. గుగ్గలము ధూపము శివునికి మంచి సేవ అనుకున్నాడు. చేతిలో ఒక చిన్నకుంపటి, అగ్ని, గుగ్గిలము పుచ్చుకొని నిరంతరము గుగ్గిలము ధూపము వేయుచు అర్చిస్తూ గడిపేవాడు.

ఈ భక్తుని సేవా విశేషము, అతని శివార్చన తపన పరమశివుని పరవశింప జేశాయి. అతని పరమభక్తి విశేషాలు ప్రపంచానికి చూప నిశ్చయించాడు.

శివుని సంకల్పమున నాయనారు కటిక పేదవాడయ్యాడు. ఆస్తి అంతా అమ్ముకోవలసి వచ్చింది. కుటుంబము పస్తుంటున్నది. అయినా నాయనారు తన గుగ్గిలం సేవలు మానలేదు. ఒకరోజున భార్య అనుకుంది. అంతా అమ్మబడింది. ప్రతి స్త్రీ భర్త చనిపోవునంత వరకు అట్టిపెట్టుకోవలసిన మాంగల్యము మాత్రము మిగిలి వుంది. భర్త పిల్లలు ఆకలితో నకనకలాడుతున్నారు. అని ఆలోచించి మెడలో పుస్తెలతో పసుపు కొమ్ము వుంచు

కొని తన బంగారు మాంగల్యమును భర్తకు తీసి యిచ్చి - దీనినమ్మి ధాన్యము తీసికొని రండు అని భర్తను బ్రతిమాలింది. అతడు అది పుచ్చుకొని అంగడికి బయలు దేరాడు. బజారునకు పోవుచుండగా ఒక వర్తకుడు గుగ్గిలము మూటలను భుజముల మీద నుంచుకొని విక్రయించుటకు ఎదురు వచ్చుచుండగా అది చూచి - నాయనారు - "ధాన్యము కొనుటకంటే దేవునికుపయోగింపవచ్చును గుగ్గిలము కొనుట చాలా మంచిది" అని మంగళసూత్రమునిచ్చి, వర్తకుని నుండి గుగ్గిలము మూటలను ఆలయమునకు తీసికొని వెళ్లి యథారీతిన గుగ్గిలము ధూపముతో తపోమగ్నుడయ్యాడు.

భార్యాపిల్లలు క్షుద్బాధ తట్టుకోలేక అలసి పడుకున్నారు. ఝామురాత్రి అయినా భర్త తిరిగి రాలేదు. దైవమును ప్రార్థింప మొదలిడింది. తనకు అతి పవిత్రమైన మాంగల్యమును కూడా భర్తా పిల్లల ఆహారము కొఱకు పసుపుకొమ్ముతో సరిపెట్టుకొని ఇచ్చింది. అయినా పరమేశ్వరా ఇలా అయింది రక్షింపు అని ప్రార్థించింది. ఆమె ప్రార్థనకి, నాయనారు భగవత్‌సేవ నిష్ఠకు, వారి మంచితనము, పవిత్రతకు పరమేశ్వరుడు చాలా సంతుష్టి చెందాడు.

కురాల్‌లో : "పతిని దైవముగను వ్రతమున్న ఇల్లాలు
కురియుమన్న క్షణమె కురియువాన"

ఆమె కలలో శివుడు కన్పడి " నీకు సకల సౌభాగ్యాలు ఇస్తున్నాను" అన్నాడు.

ఆమె మేల్కొనగానే ఆమె చకితురాలగునట్లుగా - గృహము సకల సంపత్తులతో నిండిపోయింది.

వెంటనే ఆమె పరవశంతో పరమేశ్వరుని వినుతించింది. ఆయనపై పాటలు పాడింది. మహానంద భరితురాలై వెంటనే వంటచేసి తన బిడ్డలకు అన్నము పెట్టి భర్త రాకకై వేచి వుంది.

అట ఈశ్వరుడు నాయనారును 'ఆకలిగొని యున్నావు, ఇంటికి పోయి భుజింపుము' అని ఆదేశించాడు.

ఇంటికి పోగా అతనికి ఆశ్చర్యమైంది. ఈ భాగ్యమంతా ఎలా వచ్చింది అని భార్య

నడిగాడు. అమె జరిగింది చెప్పింది. శివానుగ్రహమునకు, తాను అక్కడ చేరిన శివభక్తులును కలిసి శివుని బహుధా కీర్తించారు. నాయనారు ఈ సంపద తనదిగా భావించలేక పోయాడు. "ఇదంతా శివునిది - దీనిని శివభక్తులకే వినియోగించాలి" అని అంటూ - వాని నిరంతర సేవ కొనసాగించాడు.

ఒక రోజున నాయనారు తిరుప్పనందాళ్ దేవాలయము సందర్శిద్దామనుకొన్నాడు. అరుణ సతీశుని దేవాలయము అచట నున్నది. ఒక రాక్షసుని కుమార్తె తాటక, పుత్రునికై అచ్చట శివలింగాన్ని రోజూ అర్చించేంది. ఒకరోజున ఆ లింగమును పుష్పహారముతో అలంకరిద్దామని పూలదండను ఎత్తిపట్టుకోబోయింది. ఆమె వస్త్రము నడుము నుంచి జారబోయింది. వస్త్రమును రెండుమోచేతులతో అదిమి పెట్టింది. అందుకని ఆమె  చేతులు ఎత్తలేక పోయింది. ఆమె బెడద  నుండి ఆమెను తప్పించుటకు శివుడు ఒక ప్రక్కకు ఒరిగి(ఒంగి) ఆమె దండను స్వీకరించాడు. ఆ లింగము అట్లనే ఒరిగి వుండి పోయింది. చాలామంది ఆ లింగంను సరిపెట్ట ప్రయత్నించారు. వీలుకాలేదు. రాజుగారు ఆ వంపుకు మోకులు తాళ్లు కట్టించి ఏనుగులతో లాగించారు. ప్రయోజనము కలుగలేదు. రాజుగారికి ఏమీ పాలుపోలేదు.

ఈ సంగతి గుగ్గులు కలశనాయనారుకు తెలిసింది. అచ్చటికి వెళ్లి "నేను గూడ కొంచెము ప్రయత్నించెదను" అని ఆ శివలింగం వంపును తాడుతో బిగించి ఆ తాడు కొసను తన మెడకు కట్టుకొని శివుని ధ్యానము చేస్తూ లాగాడు. తోడనే లింగము వంపు సరి అయి యథాస్థితికి వచ్చింది. దేవతలు పుష్పవృష్టి కురిపించారు.

రాజు దానిని చూచి "ఈతడు భక్తి రజ్జువుచే ఇట్లు చేయగలిగాడు" అని తెలిసికొని నాయనారును చాలా గౌరవించి అనేక విధముల సన్నుతి చేశాడు. అందరికి నాయనారు భక్తి ప్రపత్తులు వెల్లడయ్యాయి.

కొన్ని దినములకు వాగేశనాయనారు, జ్ఞాన సంబంధనాయనారు అచటికి వచ్చారు. గుగ్గులు కలశనాయనారు వారిని అనేక విధముల సంభావించి బ్రతికియున్నంత కాలము శివసేవలోను, శివభక్తుల సేవలలోను గడిపి అంత్యమున శివసాయుజ్యమొందినాడు.

# 12. మనకంచార నాయనారు

చోళరాజ్యంలో కంచరూరు ఒక సారవంతమైన ప్రాంతము. అక్కడ నున్నవారంద రూ మంచి శివభక్తులు. పరమ శివభక్తుడైన మనకంచార్‌నార్ గూడ ఆ వూరి వాడే. వెల్లాల కులస్తుడు. వంశపారంపర్య సేనాధిపతి. ఆవూరి ప్రజలందరికి మన కంజారునా యనారు మీద గౌరవము మెండు. సుందరమూర్తి నాయనారుకు సమకాలీకుడు. శివ భక్తులను కొలుచుట, గౌరవించుట శివపూజ పద్ధతులలో విశేషమైనదిగా నాయనారు భావిస్తాడు. మనుష్యుల చూపులనుబట్టి వారి మనస్సులలో ఏముందో చెప్పగల శక్తిమం తుడు. శివభక్తులు అడుగకుండానే వారి సేవకుపక్రమిస్తాడు.

చాలాకాలము నాయనారుకు సంతానములేదు. గాఢ తపస్సు చేసి శివుని మెప్పిం చి ఒక కుమార్తెను వరంగా పొందాడు. ఈ దైవ దత్తమైన కుమార్తె జననమును దాన ధర్మములతో బహు వేడుకగా జరిపాడు. ఆమెకు యుక్త వయస్సు వచ్చింది. ఇయర్‌కాన్ కాలికమార్‌తో వివాహము నిశ్చయించాడు. అతను గూడ మంచి శివభక్తుడు. ఓ రోజు వివాహమునకు సుమూహూర్తము గూడ నిశ్చయించారు. వివాహమునకు అంతా సిద్ధ ము చేశారు.

పరమశివుడు నాయనారు మీద విశేష అనుగ్రహము చూపదలచాడు. ఒక మహావ్రతుడుగా రూపుదాల్చి నాయనారు ఇంటికి వచ్చాడు. ఆ మహావ్రతుడు ముఖంనిం డా విభూతి నలంకరించాడు. జుట్టుజడలు కట్టింది. ఆ కొప్పను శల్యముల హారముతో నలంకరించాడు. కేశములను యజ్ఞోపవీతముగా చేసి హృదయాన్ని అలంకరించాడు. మనకంచార్‌నాయనారు - మహదానందముతో ఆగంతకుని - ఇంటిలోనికి ఆహ్వానిం చాడు. గృహమంతా అలంకరించి యుంచుటకు కారణాన్ని అడిగాడు. నాయనారు తన కుమార్తె వివాహము ఆరోజున జరుగనున్నది అని, తన కుమార్తెను పిలిచి మహావ్రతుని పాదములకు నమస్కరింపమన్నాడు. మహావ్రతుడు ఆమెను చూచి, ఆమె కేశసంపదను

చూచి, "మహాత్మా, మీ అమ్మాయి కేశసంపదను చూచాను. నాకు పరమానందమైనది. దీనిని పంచవటిగా రూపొందించవచ్చు" అన్నాడు. నాయనారు వెంటనే కత్తితీసి కుమార్తె కేశసంపదను కత్తిరించి, వచ్చిన శివభక్తునకు ఆ కేశసంపదను దానము చేసాడు. ఆరోజే ఆమెకు వివాహమన్న సంగతి కూడా తలచలేదు. తనకు ఒక్కతే కుమార్తె అని, ఆ ఒక్క కుమార్తెను అందవిహీనురాలుగా చేస్తున్నట్లుగా గూడ భావించలేదు. పరమశివుడు వీరి భక్తితత్పరతకు పరమానంద భరితుడయ్యాడు. తాను, పార్వతీదేవి నిజస్వరూపముతో అచ్చట ప్రత్యక్షమయ్యారు.

మహావ్రతుని రూపంలో వున్న ఆగంతకుడు మాయమయ్యాడు. ఇదంతా శివలీల. పెండ్లికుమారుడు అతని బృందము వచ్చి జరిగినదంతా చూచారు. కేశవిహీనయైన పెండి కుమార్తెను స్వీకరించుటకు కొంచెము సందేహించాడు. ఈ విషయం పరమ శివునికి అర్థమైంది. పెండ్లికుమార్తెను ఆశీర్వదించాడు. వెంటనే ఆమె కేశసంపద యథా స్థితికి వచ్చింది. నాయనారు కుటుంబము యావత్తు మహదానంద భరితులయ్యారు. నాయనారు కుమార్తె వివాహము జరుపుట కుపక్రమించాడు.

***

# 13 అరివత్తయ్య నాయనారు

చోళ రాజ్యంలో కన్నమంగళంలో తాయనార్ అనే మంచి వెల్లాల గృహస్థువుండే వాడు. గృహస్థ ధర్మాలను చక్కగా పాటించేవాడు. తిరువళ్లువారు నుడివినది ఈయన ఎడ సత్యమే.

యుక్తరీతి ధర్మ యుక్తుడౌ గృహమేధి

యజ్ఞ యాగ ఫలములనుభవించు

బ్రదుక వలసినట్లు బ్రదికినచో నింట

మింట సురలు బిలిచి మెత్తు రతనిని - (కురాల్)

నాయనారు నిష్ఠాగరిష్టుడయిన శివభక్తుడు. అనుదినము ఎర్ర బియ్యముతో అన్నము వండించి, ఎర్ర మూలికలతో చారు కాయించి మామిడి వూరగాయతో శివునికి నివేదనము గావించెడివాడు. మహేశ్వరునికి ఈయన నివేదన సంతుష్టి కలిగించినది. ప్రపంచానికి ఈతని నిష్ఠా విశేషములు చూపదలిచాడు. శివసంకల్పముతో నాయనారు ఆర్థిక దుస్థితికి లోనయ్యాడు. తాయనారు తనకు ఎర్ర బియ్యము వేతనముగా చెల్లించెడి పద్ధతిని ఉద్యోగములో చేరాడు. తను ఆ ఎర్ర బియ్యము తినడు. ఖరీదు తక్కువైన కార బియ్యముతోనే తాను సరిపెట్టుకునేవాడు. శివునికి నివేదనమునకు ఎర్ర బియ్యము వుంటే చాలును. దానితో సంతృప్తి నొందేవాడు.

శివుడు ఇంకా పరీక్షించదలచుకున్నాడు. అన్ని భూములలోనూ ఎర్రబియ్యమునే అందరూ పండించ మొదలుపెట్టారు. అతని భార్య తోటలోని ఆకుకూరలను వండి పెట్టడం మొదలుపెట్టింది. శివునికి యథాస్థితి ఎర్రబియ్యముతోనే నివేదన జరిగేది. శివుడు ఇంకా పరీక్ష పెట్టదలచాడు. తోటలో ఆకుకూర ఎండిపోజొచ్చింది. నాయనారుకు తన స్వంత పచనమునకు ఏమియు మిగులలేదు. నాయనారు దిగులు చెందలేదు. వట్టి మంచినీళ్లు తాగి పొట్ట నింపుకోవడం మొదలుపెట్టాడు. శివునికి నివేదన ఇచ్చుచున్నా

నన్న భావనతో తన ఆకలిదప్పికలను మరచాడు. నాయనారు బక్కచిక్కిపోయాడు. దేవునికి నివేదనము చేస్తూ నీరసమున మెలిదిరిగి పడిపోయాడు. తను దేవునికిచ్చే నివేదనము నేలమీద పడింది. నాయనారుకు మతిపోయినట్లయింది. బిగ్గరగా ఏడ్చాడు. పరమేశ్వరా! నీకై తయారుచేసింది నేలపాలయింది. నేనేం అపరాధం చేశాను? ఇలా జరిగింది. నన్ను క్షమించు. నాపై కరుణ జూపు. నీవు సర్వసమర్థుడవు. సర్వజ్ఞుడవు. సర్వాంతర్యామివి. ఈ విషయము నిజమైతే నీవు ఈ నేల మీద గూడ నున్నట్లే. వచ్చి ఇక్కడున్న నివేదనను గ్రహించు. నీవు అట్లు చేయనిచో నేను ప్రాణమును త్యజించెదను అంటూ తన కంఠము కొడవలితో నుత్తరించుకోబోయాడు. ఈ పని మూలాన్ని ఈయనకు అరివత్తయ్యనాయనారు అనెడి పేరు వచ్చింది.

శివుడు తన లీలను అంతటితో ఆపాడు. తన చేయి చాచి నాయనారు చేతిని పట్టుకొని నాయనారు తన కంఠమునుత్తరించుకోకుండా ఆపాడు. నాయనారుకు ఏమి జరుగుచున్నదో అర్థము కాలేదు. ఆవకాయ ముక్క కొరుకుతున్న శబ్దము వినిపించింది. దేవుని లీల నాయనారుకు అర్థమయింది. అవగతమయింది. దేవుని గురించి నృత్యము చేస్తూ వినితిస్తూ పాడాడు. పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమై ఆశీర్వదించారు.

“మాననీయుడా! నీ అనితరభక్త్యావేశము నన్ను పరవశింపజేసింది.నీవు, నీభార్య అనతికాలములోనే నా లోకానికి వచ్చి శాశ్వతంగా నా దగ్గర వుండండి” అని శివుడు పలికి పార్వతితో అంతర్ధానమైపోయాడు.

****

# 14. ఆనయ నాయనారు

తమిళనాడులో తిరుచినాపల్లి జిల్లాలో ప్రముఖ తీర్థయాత్రా స్థలములలో తిరు మంగళము ఒకటి. ఇక్కడుండే దైవము సామవేదేశ్వరుడు. ఈ దైవమే పరశురాముని మాతృ హత్యాపాతకము నుండి విముక్తి కలిగించినది. పరశువును గూడ ఇచ్చి భార్గవరా ముని పరశురామునిగ జేసినది.

ఈ మహిమాన్వితమైన గ్రామములో ఆనయారు అనబడే పశుల కాపరి వుండే వాడు. గోసంరక్షకుడుగా నున్నందున ఆయన కాపేరు వచ్చింది. ఆయన శివభక్తాగ్రేశ్వ రుడు. ఎల్లపుడు విభూతిని ధరించేవాడు. శివభక్తులలో కులము, మతము మున్నగు నవేవీగమనించక వారిని బహుప్రీతిగా అర్చించేవాడు. వేణుగానంలో పంచాక్షరి మంత్ర మును మిళితం చేసి పరమశివుని మీద భక్తిని చూపేవాడు. ఈ మంత్రధ్యానంలోనే శివుని పొందాలనుకున్నాడు.

ఒక రోజున శివునికి పరమ ప్రీతికరమయిన కోన్రాయి వృక్షము క్రింద కూర్చొని పరవశముతో పంచాక్షరిని వేణువు మీద పాడుతున్నాడు. ఆ సంగీతము ఆ ప్రదేశమంతా వీనులవిందుగా సాగింది. ఆవులు దూడలు చెవులు నిక్కరించుకొని వినడానికి మూగా యి. చెట్లుమీద పక్షులు ఆ నాదంలో మునిగిపోయి ఎక్కడివి అక్కడే వుండి పోయాయి. నెమళ్లు పురివిప్పి గమకంగా నృత్యము చేశాయి. జంతుతతి అలానే తన్మయత్వంతో నిల బడిపోయాయి. లేళ్లు, సర్పతతి, సింహాలు, ఏనుగులు, శార్దూలాలు పంచాక్షరి మంత్రము గ్ధులై ఆ వేణుగానాన్ని ఆలకిస్తూ నిలిచాయి. నదీ ప్రవాహములు గూడ స్థబ్ధులయ్యాయి. సముద్ర తరంగాలు గూడ మురిసిపోతున్నట్లు కనిపించాయి. విద్యాధరులు, కిన్నెరలు, దేవతలు దివినుండి వారి వాహనాలపై భువికి దిగి చుట్టు మూగారు.

సమస్త ప్రకృతిని తన్మయత్వంలో ముంచిన ఆనయారు భక్త్యభి నివేశమునకు పరమశివుడు ఆనందాబ్ధిలో ఓలలాడాడు. భక్తికి కరిగిపోయాడు. వేణువుపై పంచాక్షరి గానము అమృతమై చిలికింది.

పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమయి నాయనారును ఆశీర్వదించి తమ నివాస ము కైలాసమునకు ఆదరముతో నాయనారును తీసికొని వెళ్లారు.

# 15. మూర్తినాయనారు

మంచి గంధము (చందనము)తో శివలింగమంతటనలది పూజించుట విశేష శివపూజగా పరిగణిస్తారు. మూర్తినాయనారు శివునికి అంతా చందనమలది అనుదిన ము అర్చించేవాడు. పాండ్య రాజధాని మధురలో ఈయన జన్మించాడు. కులమునకు వైశ్యుడు. అత్యంత పరమ శివభక్తుడు. చందనార్చన నిష్టగా పెట్టుకొన్నాడు.

ఒకరోజున కర్నాటక రాజు మధురపై దండెత్తి పాండ్యరాజును ఓడించి పాండ్య రాజ్యమునకు రాజయ్యాడు. ఆ రాజు జైన మతస్థుడు. శైవ మతాన్ని దేశాన్నుండి తుడిచి వేయాలని సంకల్పించి శైవులను హింసించుట మొదలుపెట్టాడు. అందరిని జైనమతము స్వీకరించమని ఆదేశించాడు. మూర్తినాయనారును గూడ బాగా హింసించాడు. కాని నాయనారు శైవమతమును వీడలేదు. మొక్కవోని ధైర్యముతో నిలబడి రోజూ చందన ముతో శివార్చన చేసేవాడు.

ఇతనిని బలవంతంగానైనా జైన మతంలో కల్పుకుందామని, వూరిలో మూర్తినా యనారుకు చందనమమ్మకుండ కట్టడి చేశాడు.ఈ అస్తవ్యస్త పరిస్థితి అశనిపాతమైంది. "దయాసాగరా! ఈ రాజ్యాన్ని ఒక కర్కోటకుడు పరిపాలిస్తున్నాడు. నీ భక్తులను జీవించనీ కుండ చేస్తున్నాడు. మాకు శివభక్తుడైన రాజును ఎప్పుడు అనుగ్రహిస్తావు? అందరూ రాజునే అనుసరిస్తారు. అందుకని శివభక్తుడైన రాజునే మాకనుగ్రహించు" మని నాయ నారు ఎలుగెత్తి ప్రార్థించాడు.

రోజంతా చందనమెచ్చటనైనా దొరకునేమోనని గాలించాడు. ఎవరూ అతనికి చందనము అమ్మలేదు. భగ్న హృదయుడై దేవాలయమునకు వెళ్లాడు. ఒక వినూత్నమైన ఆలోచన వచ్చింది. చందనం బదులు తన చేతులనే సానమీద అరుగదీయసాగాడు. కొంతసేపటికి ఎముకలు బయటపడి కొంతవరకు అరిగిపోయాయి. రక్తము ఆలయ మంతా క్రమ్మింది. శివుడు అతని అచంచలమైన నిష్టకు చలించి పోయాడు. ఒక దివ్య వాణి వినిపించింది. "మహాత్మా మీనిరతిశయ భక్తికి చాల సంతోషించాను. నీ సాహస ము చాలును ఆపెయి. నీ బెడదలు అన్నీ తొలగిపోతాయి. నువ్వే రాజువు అవుతావు.

న్యాయంగా వైదుష్యంతో చాలాకాలము రాజ్యముచేయి. శైవమత ముద్ధరింపు. తర్వాత నా సన్నిధికి రమ్ము" అని వినిపించింది.

నాయనారుకు ఆశ్చర్యము వేసింది. తన చేతులు యథాస్థితికి వచ్చాయి. మూర్తి నాయనారు తాను రాజు కావాలని కోరుకోలేదు. దైవ సంకల్పము అతను రాజు కావాలని. ఆ రాత్రి ఆ కర్కోటక రాజు మరణించాడు. ఆచారము ప్రకారము మరునాడు మంత్రులందరు పట్టపుటేనుగునకు పూలమాల ఇచ్చి వూళ్లో తిప్పారు. ఆ ఏనుగు ఎవరిమెడలో ఆ పూలమాల వేస్తే అతను రాజవుతాడు. ఆ ఏనుగు దేవాలయము సమీపించింది. మూర్తి నాయనారు అప్పడే దేవుని అర్చించుటకు అచ్చటకు వచ్చాడు. ఏనుగు నాయనారుకు ఎదురేగి తన మోకాళ్లపై నుంచుకొని మూర్తినాయనారు మెడలో ఆ పూలమాలను వేసి, నాయనారును తనపై నెక్కించుకొని రాజప్రసాదానికి ఆయనను తెచ్చింది.

మంత్రులు నాయనారును రాజువుకమ్మని అర్థించారు. నాయనారు ఒక షరతుతో అంగీకరిస్తానన్నాడు. "ముందు మీరు శైవ మతస్థులు కండు. నాకు విభూతియే పట్టాభిషేకమునకు సామగ్రి, రుద్రాక్షలే ఆభరణములు, జటాజూటమే కిరీటము" అందరూ దానికి అంగీకరించారు. నాయనారు రాజయి బ్రదికి యున్నంత కాలము న్యాయంగా వైదుష్యంతో పరిపాలించాడు. శైవమతము వృద్ధికావించాడు. అనేక ధర్మకార్యములనాచరించి అంత్యమున శివసాయుజ్యమును పొందినాడు.

****

# 16. మురుగ నాయనారు

శైవాగమ శాస్త్రాల్లో పరమ శివునికి కుసుమార్చన, పుష్పమాలా అలంకరణ, పంచాక్షరీ మంత్ర మననము - ఉత్కృష్టమైన శివపూజ అని చెప్పబడింది. పంచాక్షరి మహిమాన్వితమైన మంత్రరాజము. ఈ విషయం యజుర్వేదంలో మధ్యకాండ శ్రీరుద్రాధ్యాయి మధ్యలో చెప్పబడింది. పంచాక్షరి జపము చేయువాడు పునర్జన్మరాహిత్యుడవుతాడు.

ఈ విధమైన శివపూజలో మురుగనాయనారు నిమగ్నుడై యుండేవాడు. తిరుపుకలూరులో జన్మించాడు. ఈ వూరిలో ఇంకా కొంతమంది నాయనారులు ప్రసిద్ధులయ్యారు. అనుదినము సూర్యోదయం ముందరే నిదుర లేచి, స్నానము చేసి, ఫాలమున విభూతి నలముకొని నిత్యానుష్టానము చేసి - పూల సెజ్జతో తోటకు వెళ్లేవాడు. అక్కడ పంచాక్షరీ మంత్రమును జపిస్తూ పూలను సేకరించి, వివిధ మనోహరమైన పూలమాలలను గ్రుచ్చి ఆలయమున మహాదేవునికి సమర్పించేవాడు.

ఒక దినమున తిరుజ్ఞాన సంబంధారు ఆవూరు వచ్చాడు. మురుగ నాయనారు ఆ శివభక్తుని తన ఇంటికి ఆహ్వానించి మనసారా పూజించాడు. జ్ఞాన సంబంధనాయనారు మురుగనాయనారుని చూచి ముచ్చట పడ్డాడు.గాఢ స్నేహితునిగా స్వీకరించాడు. సంబంధారు వివాహ మహోత్సవానికి హాజరయ్యే భాగ్యము నాయనారుకు సంభవించింది. ఆ వివాహమహోత్సవమునకు కారణము - సంబంధారు తొలుత వివాహము నిరాకరించినాడు. కాని అచటనున్న బ్రాహ్మణులు - అందరును - సంబంధారుకు నమస్కరించి " దేవరవారు వేదాగమము స్థాపనకు అవతరించారు. వేదాగమము ప్రకారము వివాహము చేసికొనుట ధర్మమన్నారు." దానికి అడ్డుచెప్పలేక జ్ఞాన సంబంధనాయనారు వివాహమునకంగీకరించాడు.తిరునల్లూరు నంబండారునంబి కుమార్తెతో వివాహమయింది. కళ్యాణమయిన తర్వాత సంబంధారు దేవుని నుతింపగా పరమశివుడు "నీవును నీ భార్యయు, నీపెండ్లికి వచ్చిన భక్తులును మీ ఎదుటనున్న జ్యోతిలో ప్రవేశింపుడు." అని ఆనతిచ్చాడు. చూడగా ఎదుట శివ సన్నిధి మొదలు ఆకాశము వరకు జ్యోతి కన్పించింది.

అపుడు భార్యా సమేతముగా శ్రీజ్ఞాన సంబంధారు ప్రధముడుగా అచ్చట గల భక్తులు మురుగనాయనారుతో సహా ఆ జ్యోతిలో ప్రవేశించి శివసాయుజ్యమును పొందారు.

సంబంధారు యెడ మురుగనాయనారు భక్తిప్రపత్తి సంబంధారును స్నేహితునిగా చేసినది. ఆ స్నేహము మురుగనాయనారు ముక్తికి దారితీసింది.

అందుకనే కురాల్ లో ఇలా చెప్పబడింది :

వినయవంతుడైన విక్రమవంతుడు

శత్రువులను మిత్రులుగ జేయు

మంచి చెడ్డలరసి మంచిచేయువారె

వలయు కార్యమునకు బలముగాను

పనితనమ్ము తెలిసి ప్రతిబంధములకోర్చు

సాహసుండె కార్యసాధకుండు

****

# 17. రుద్రపశుపతి నాయనారు

యజుర్వేదంలో దేవుని తలమానికంగా భావించబడే ఏడుకాండములున్నాయి. మధ్యకాండ శ్రీరుద్రం. దాని పఠనం అందరినీ పునీతులను చేస్తుంది. పరమాత్ముని వివిధ అవతారాలను వర్ణిస్తుంది. నదిలోనుంచొని ఈ పవిత్ర రుద్రాన్ని వల్లెవేస్తే అది మహి మాన్వితమని భక్తునికి మోక్ష ప్రాప్తి లభిస్తుందని ప్రతీతి.

రుద్రపశుపతినాయనారు పరమశివుని అచంచలభక్తుడు. శ్రీరుద్రం సాధన కుప క్రమించాడు. నదిలో కంఠం వరకు నించొని అత్యంత శ్రద్ధతో ప్రొద్దున, మధ్యాహ్నం, సాయంకాలంలలో అత్యంత శ్రద్ధతో వల్లెవేశేవాడు. తత్ఫలితం శివుడు అతనికి మోక్షాన్ని అనుగ్రహించాడు.

****

# 21. తిరునవుక్కరసారు నాయనారు

శైవసమయాచార్యులు (మతగురువులు) నలువురిలో ఈయన ఒకరు. తిరునవుక్కదసారు నాయనారును అప్పార్, వాగీశనాయనారు అని గూడ పిలుస్తారు. జైనులు ధర్మసేనుడు అని పిలిచేవారు. తండ్రిపెట్టిన పేరు మరుల్‌నీకియారు.

ఈయన 7వ శతాబ్దమువాడు. తిరుమునైపాడునాడులో తిరువామూరులో పూకలనారు, మాతినియారు దంపతులకు తిలకవతి అని కుమార్తె, మరుల్‌నీకియారు అనే కుమారుడు జన్మించారు. మరుల్ నీకియారు అనగా చీకట్లను పారద్రోలేవాడు. లేక అజ్ఞానాన్ని అంతమొందించేవాడు అని అర్థముంది. చిన్న వయసుననే అన్ని శాస్త్రాలలో పరిణితి పొందాడు.

తిలకవతికి 12 సం॥ వయసురాగానే పల్లవ సేనాధిపతి అయిన కలైపహయారుకిచ్చి వివాహము చేయ నిశ్చయించారు. వివాహమునకు మునుపే అతను ఒక యుద్ధము చేయుచు మరణించాడు.

తండ్రి తీవ్ర రుగ్మతతో మరణించాడు. తల్లి మాతినియారు సతీసహగమనము జేసింది. పిల్లలు ఈ హృదయ విదారణ దారుణం నుండి తేరుకునేలోపల కలైపహయారు మరణవార్త చేరింది. వివాహానికి నిశ్చయ తాంబూలము పుచ్చుకోవటము జరిగినందున కలైపహయారును తన భర్త క్రిందనే పరిగణించి - తిలకవతిగూడ సహగమనము చేయదలచింది. మరుల్‌నీకియారు తిలకవతితో - నీవు ఇప్పుడు మాకందరికి తల్లివి. నీ సతి నిర్ణయం మార్చుకో. మనసు మార్చుకోనియెడల తాను గూడ చనిపోవుదునని బెదిరించాడు. తిలకవతి చేయునది లేక సతిని మానుకొన్నది. ఇంకా బాల్యావస్థ అయినా శివయోగినిగా శివధ్యానతత్పరతతో నుండుటకు నిశ్చయించుకొన్నది. ఆమె దివ్య జీవనాన్ని సేకిజార్ - తిరుమురాయిలలో మనోహరంగా పాడాడు. అప్పార్‌కు ఆమె తల్లిగా భాసించింది.

మరుల్‌నీకియారు వయస్సునకు చిన్నవాడైనా ప్రపంచ అనిత్యతను గ్రహించాడు. అన్ని దానధర్మకార్యాలలో నిమగ్నుడయ్యాడు. మతములలో మంచి మతమును అనుసరిద్దామను కొన్నాడు. జైనమతం గూర్చి చాలవిన్నాడు. జైనుల అహింసా సిద్ధాంతము నచ్చింది. తనకు జైనమతము ముక్తినీయగలదని భావించాడు. అందుకని జైనమతావలంబి అయ్యాడు. దక్షిణ ఆర్కాటు జిల్లాలోని పాటలీపుత్రం గూడ దర్శించి అచ్చటి జైనవిద్యాలయంలో చేరాడు. మత గ్రంధాలలో పాండిత్యము సంపాదించాడు.

సోదరుడు జైనమతం స్వీకరించడం తిలకావతి సహించలేక పోయింది. తన వూరు విడిచి తిరువడిగాయి విరాట్టనము మఠంలో చేరింది. విరాట్టనేశ్వరుని తన సోదరుని రక్షించుమని, అతనిపై ఈశ్వరకృప చూపమని బహుధా ప్రార్థించింది. ఒకరోజున విరాట్టనేశ్వరుడు ఆమె కలలో కనుపించి "నన్ను గురించి మీ సోదరుడు చాల తీవ్ర తపస్సును ఈవరకే చేసియున్నాడు. తీవ్రవ్యాధికి గురిచేసి అతని మనసు తప్పక మార్చెదను. నా అనుయాయుడిగా చేసెదను"అని చెప్పాడు.

మారుల్ నీకియారుకి శూలవ్యాధి పొడసూపింది. బాధ భరించలేకపోయాడు. జైనులు ఆ వ్యాధిని కుదుర్చలేకపోయారు. ఈ వ్యాధి అతని మనోనేత్రంను తెరిపించింది. జైనమతం అంటే మమకారం పోయింది. తన సోదరి జ్ఞాపకానికి వచ్చింది. శ్రేష్ఠమైన మాహేశ్వర మతం విడిచి జైనమతమవలంబించుటచే - నాకీ బాధ కలిగింది కాబోలు ననుకున్నాడు. జైనదుస్తులు తీసివేసి ఎవరికి చెప్పకుండా తన సోదరి దగ్గరకు వెళ్లి ఆమె కాళ్లపై బడి తనను రక్షించమన్నాడు. ఆమె ఇది ఈశ్వరలీల అని గ్రహించింది.

ఆమె 'నీ వ్యాధి శివుని కృపచే నయమవుతుంది. దిగులుపడకు" అని పంచాక్షరిని జపిస్తూ అతని ఫాలంన మంత్రించిన విభూతినలమింది. అతని అజ్ఞానం సమసిపోయింది. విరాట్టనేశ్వరుని దేవాలయమునకు తీసికొని వెళ్లింది. అచ్చట ప్రదక్షిణ నమస్కారములు చేయించినది. మరుల్‌నీకియారు దేవుని అర్చించి ఒక కీర్తనపాడాడు. "మహాదేవా! నిన్ను, శైవమతాన్ని నిందించాను చాలా చెడ్డపనులు చేశాను. గోదావరి ఒడ్డున ఋషులతో వాదించాను. జైనమత ప్రాశస్త్యాన్ని గూర్చి ప్రచారం చేశాను. ఈ అపరాధ

ముచే యముడే ఈ యమ బాధరూపంలో నా వద్దకు వచ్చాడు. కరుణామయా! మీరే నాకు శరణ్యం. మీరే నా రక్షకులు, నన్ను రక్షించండి. మీ పాదకమలాన్ని సదా నాయెద ధరిస్తాను" అని పాట పాడాడు.

ఆ పాట అయిందో లేదో అతని వ్యాధి నిమ్మళించింది. ఒక దివ్యవాణి అన్నది "నీవు నా మహిమ నెఱిగి నన్ను తేవారములలో నుతించితివి. నీవు ఇప్పటి నుంచి "తిరు నవుక్కరసార్" (లార్డ్ ఆఫ్ స్పీచ్) వాగీశుడవని పిలువబడుతావు. అంతటా నీ మంచిపేరు వ్యాప్తి చెందుతుంది" అని వినిపించింది.

నాయనారు సంతోషానికి అవధులు లేకపోయాయి.

తిరునవుక్కరసార్‌కు వ్యాధి నిమ్మళించి శివునిమీద భక్తి అనురక్తి అనేక రెట్లు పెరి గింది. శివుని మహాభక్తులలో ఒకడయ్యాడు. పంచాక్షరీ మంత్రాన్ని నిరంతరం జపిస్తూ శివునిలోనే జీవించాడు.

నాయనారులోని ఈ మార్పు జైనులను భయపెట్టింది. జైనులు అతని వ్యాధిని కుదుర్చలేనందుకు, అందుకు ఆయన శైవమతము స్వీకరించి వ్యాధి కుదుర్చుకొన్నట్లును

రాజునకు తెలిసిన తమను రాజు శిక్షించునేమో అని తల్లడిల్లారు. ఈ బెడద తప్పించుకొ నుటకు వాళ్లు ఒక కథ అల్లారు. తిరునవుక్కరసార్ దేశద్రోహి. రాజుగారి యెడ, రాజుగారి జైనమతము యెడ ద్రోహము తలపెట్టినట్లు చిత్రించారు. రాజు వాళ్లని -నాయనారును వెంటనే తన ముందుకు తెమ్మన్నాడు. నాయనారుకు తనమీద జైనుల అభియోగం తెలి సింది. జైనులు తిరువతికాయి వద్దకు ఒకసేనతో వచ్చి, నాయనారుకు అభియోగం గూర్చి చెప్పి రాజుగారు తనని తీసికొని రమ్మని పంపిరని చెప్పారు.

నాయనారు - " మీ రాజు గారి ప్రజలలో నేను ఒకడిని కాను. నేను శివునికి చెం దిన వాడిని. అందరికి ఆయనే (శివుడే) రక్షకుడు. అన్ని దురితములను పోగొడుతాడు ఆ దేవదేవుడు. బ్రహ్మానందాది మోక్ష ప్రదాత. రాజుగారిని ధిక్కరిస్తే దేశద్రోహ నేరమవు నేమో కాని అది ఆయన దేశస్థులకు మాత్రమే పరిమితమవుతుంది.అంతేకాని నాకు

గాదు.నేను దేముని సంరక్షణలో నున్నాను. భయమనేది నా దరిదాపులకురాదు. నేను యముణ్ణే తన్నిన మహాశివుని భక్తుడను” అన్నాడు.

వచ్చినవారికి తిరునవుక్కరసారు గొప్పతనం తెలిసింది. కాని నాయనారు లేకుం డా తిరిగి వెళ్లుటకు భయపడ్డారు. అందుకని నాయనారును తమతో రావలసిందిగా ప్రాధేయపడ్డారు. వారిమీద కరుణతో శైవమతం బలపర్చి శివుని గొప్పతనం చాటటం కోసం - వారితో నాయనారు వెళ్లాడు.

తిరునవుక్కరసును చూడగానే రాజు మండిపడ్డాడు. జైనులను ఈతనికి తగు శిక్ష విధించండి అన్నాడు. వాళ్లు అతణ్ణి సలసల కాగుతున్న సున్నం బట్టీలో వేయమన్నారు. ఆ ఆజ్ఞ ప్రకారం సున్నం బట్టీలో ఏడురోజులున్నాడు. నాయనారు మనసంతా శివునిమీద పెట్టి పంచాక్షరిని జపిస్తూ సమాధిలోకి జారాడు. నాయనారు చెక్కచెదరలేదు.

జైనులు - 'లోగడ ఈతడు జైనుడు అప్పడు అతనికి అబ్బిన శక్తి ఇది' అని ఓ విధ మైన సమాధానం చెప్పి - అతనికి విషమిప్పించండి అని సలహా ఇచ్చారు.

ఆ విషయము నాయనారుకు అమృతమైంది.

ఇదిగూడ అతడు పూర్వము తమనుండి నేర్చుకొని ఉచ్చరించిన జైనమంత్రాల మహిమ అన్నారు. అందుకని నాయనారును ఏనుగులతో త్రొక్కించమన్నారు.

నాయనారు అమిత ప్రేమ దృక్కులు ఏనుగు సహజస్వభావాన్ని మార్చాయి. ఏనుగు నాయనారు చుట్టూ తిరిగి నాయనారుకు సాష్టాంగపడ్డది. ఏనుగును భయ పెట్టారు.ఏనుగు మదమెక్కి మావంటి వాళ్లమీదకి వెళ్లి వాళ్లని, కొంతమంది జైనులను కూడ చంపి వేసింది. పారిపోయినవారు రాజుగారి కాళ్లపైబడి జరిగింది చెప్పారు. ఇది జైనులకు పెద్ద అవమానము.

రాజుగారు భంగపడ్డారు. జైనులు నాయనారుకు పెద్ద బండరాయిని కట్టి సముద్ర ములో పడవేయుడని ఆజ్ఞ ఇచ్చారు. రాజుగారి ఆజ్ఞ ప్రకారము బండరాయికి కట్టి నాయ నారును సముద్రంలో కి తోశారు.

నాయనారు ధ్యాస శివునిమీదనే వుండినది. పంచాక్షరీని జపిస్తూనే వున్నారు. పంచాక్షరి మహోత్మము గూర్చి పాడాడు. పాట అవగానే ఆశ్చర్యకరంగా ఆ బండరాయి నాయనారుతో సహో బెండులా తేలి అతనిని తిరుప్పపులియూరు సముద్రపు ఒడ్డుకు సురక్షితంగా చేర్చింది.

తిరుప్పపులియూరులో శివభక్తులందరూ నాయనారుకు ఘనస్వాగతం చెప్పారు. నాయనారు శివుని అర్చించాడు. శివుని మీద పాటలు పాడాడు. “మహోదేవా ! అదృశ్య రక్షకా ! అపద్బాంధవా ! మీరేనా మార్గము. మీరే నా రక్షకులు. మీరే నాతల్లి, తండ్రి, సోదరి అంతా మీరే! ఓ కృపామయా ! అన్ని విపత్తులనుండి కాపాడారు. మీ కృపమూలాన్నే నేనింకా జీవించి వున్నాను.” “మనసా ! నీవు సంపూర్ణముగా శివుని అధీనంలో వున్నావు. ఇక ఆపదలన్న భయమెందులకు ? నిన్ను ఎవరును ఏమియు చేయజాలరు. భయపడకు” అని జాగృతము చేశాడు. శివుని దెస తిరిగి” కృపామయా ! ఇంక నాకు మరల పుట్టుకవద్దు. ఒక వేళ పూర్వ కర్మ విశేషముచే నేను తిరిగి పుట్టినయెడల మిమ్ములను ఆ జన్మలో మరిచిపోనీయ కండి. మీ నామము నే నాచే సదా ఉచ్ఛరింప జేయనీయండి మీ నామముచ్చరించుచు ఆనందాబ్ధిలో వుండనీయండి” అని మొర పెట్టుకున్నాడు.

తర్వాత త్రోవలో అన్ని దేవాలయాల్ని, పవిత్ర ప్రదేశాలను సందర్శిస్తూ తిరువాతికాయికి చేరాడు. ఇతనిని హింసింపచేసిన పల్లవరాజుకు తిరునవుక్కారుసు క్షేమంగా బ్రదికి వచ్చాడని తెలిసింది. ఇంత వరకు జరిగిన అద్భుతాలనన్నింటిని జ్ఞాపకం లోనికి తెచ్చుకున్నాడు. శైవమతాధిక్యతను గుర్తించాడు. తిరువాతికాయికి వెళ్లి తిరునవుక్కారసు పాదాలపైబడి తన తప్పిదమును క్షమించమని కోరాడు. పరమాదరంతో, వాత్సల్యంతో తిరునవుక్కారసు రాజుగారిని పరిష్వంగనం చేసికొన్నాడు. రాజుగారు శైవమతమవలంబించి తిరువత్తి కాయిలో శివునకు మహోవైభవోపేతమయిన ‘గుణభారవీచురము’ అను దేవాలయమును నిర్మించాడు.

నాయనారు శివునికి అనేక రకములయిన అర్చనలు గావించాడు. అందరు

మునులకు ఒక వరవడి చూపాడు. వారి నిరంతర ధ్యానము ఆగ కూడదు. వారు జాగరూకులై యుండాలి. లేని యెడల మాయ వారిని కప్పగలదు. అందుకని వారు నీతి మంతముగ నమ్రతతో ఒదిగి జీవించాలి. అందరకు వారు మార్గదర్శకులవ్వాలి అని చెప్పాడు.

చాల తీర్థములను సేవించాడు. అన్నిచోట్ల శివప్రాశస్త్యాన్ని వెల్లడిచేశాడు.

'తిరుత్తూంగానై మావడము' అను క్షేత్రమున కొలది కాలము జైనుల సాంగత్య ములో వున్నందులకు, వారితో భుజించినందుకు తన శరీరంలో అపవిత్రత ఇంకను వున్నదని ఈ అపవిత్రతతో శివార్చన కొన సాగించుట యుక్తము కాదని భావించి శివుని పరమశివా ! ఈ అపవిత్ర శరీరముతో నేను జీవించియుండుట కిచ్ఛగించను. కావున త్రిశూల వృషభాంకములను నాభుజములందుంచండి. అప్పుడు నేను పవిత్రుడనైనట్లు, మీ గూర్చి పూజకు అర్హుడ నని భావిస్తాను అని మొరపెట్టుకున్నాడు. పరమశివుడు అతని భక్తి జ్ఞాన వైరాగ్యములకు మెచ్చి ప్రమథులలో నగ్రేసరుని పంపి అతని కోరిక నెరవేర్చుము అని నియమించెను. అతడు నాయనారు భుజములపై త్రిశూలము, నంది గుర్తులను వేశాడు. నాయనారు పరమానంద భరితు డయ్యాడు. తాను పవిత్రుడనైనట్లుగా భావిం చాడు.

అక్కడనుండి నాయనారు తిరువరత్తర, కనకసభమున్నగు స్థలములకు పోయి చిదంబరము చేరుకొన్నాడు.

చిదంబరంలో  నటరాజస్వామి దేవాలయంచూడగానే సమాధిస్థితిలోకి జారుకు న్నాడు. తేరుకొని ఆనందోత్సాహముతో దేవునిపై పాటలు పాడాడు. మళ్లీ మహాదేవా ! మీకు సేవను జేయనీయండి. మీ భక్తులకు లేమి, కొరత, భయాలు వుండవు. యముడు కూడ శివభక్తులను సమీపించుటకు భయపడతాడు. మీ స్థానానికి వచ్చాను. ఇక్కడ పాపమనేది దగ్గరకు రాదు. నేను మిమ్ములను పూర్తిగా శరణు జొచ్చాను. మీ చరణ కమ లములను నా హృదయంలో పదిలపరచాను అని ప్రార్థించాడు.

అచ్చట తిరుజ్ఞాన సంబంధారు విశేషాల్ని విన్నాడు. పార్వతీదేవి ఆయనకు చూపిన కృప, అనుగ్రహాన్ని తెలిసికొన్నాడు. షియాలి లోవున్న అమహనీయుణ్ణి దర్శించాలని బయ లుదేరాడు. నాయనారు షియాలి వచ్చుచుండుట విని సంబంధారు గూడ తిరునవుక్క రుసును చూడ గాఢముగా తలచి తనూ ఎదురు వెళ్లాడు. షియాలి పొలిమేరకు నాయ నారు ఎదురు వస్తున్న సంబంధారుకు సాష్టాంగ పడ్డాడు. రెండు చేతులతోను అరుసు నెత్తి నమస్కరిస్తూ సంబంధారు నాయనారును అప్పారే (తండ్రీ) అని పిలిచాడు. అరసు సంబంధారునుద్దేశిస్తూ, మీ సేవకుణ్ణి అన్నాడు.

నటరాజస్వామి దేవాలయానికి అప్పారు సంబంధరులు ఇద్దరు వెళ్లి నటరాజ స్వామి నర్చించారు. సంబంధారు కోరికపై తిరునవుక్కరసారు శివునిపై పాట పాడాడు. "ప్రళయంలో ప్రపంచం మునిగి యుండినపుడు తోలియప్పారు దైవము తన సతి పార్వతితో పక్షులరూపంలో దేవత లందరు పర్యవేక్షించి యుండ, ప్రణవమనే నావలో (స్వామి) ఆసీనులై యున్నారు" అని పాడాడు.

ఈ రోజుకి తోనియప్పారు దేవుడు నావలోనే వున్నట్లుగా చూస్తాము.

నాయనారుసంబంధారు కలిసి తిరుక్కోలక దేవాలయాన్ని సందర్శించారు. అచ్చట సంబంధారుకు వీడ్కోలు పలికి - సంచారముసాగిస్తూ అనేకదేవాలయాల్ని సంద ర్శిస్తూ నాయనారు తిరువావదూతురై చేరుకున్నాడు. అక్కడ తీవ్ర వైరాగ్యంతో మహాదేవా జననమరణ వలయం లో చిక్కియున్నాను. నాకు బ్రదుకుమీద ఇచ్ఛలేదు. దీనినుండి బయట పడేత్రోవ చూపండి స్వామీ అని పాడాడు.

సత్తిమూలము చేరుకున్నాడు. అక్కడ దేవుని ఉద్దేశించి మహాదేవా ! నేను ఈ శరీరం త్యజించు లోపల మీ పాద కమలములు నాశిరసుపై నుంచండి స్వామీ ! అని ప్రార్థించాడు. మహాదేవుడు తిరునల్లూరుకు రమ్ము అచ్చట నీకోరిక తీరును అన్నాడు.

దానిమీదట నాయనారు తిరునల్లూరుకు చేరుకున్నాడు. అక్కడ దేవుని అర్చిం చాడు. అప్పారుతలపై పరమశివుడు పాదాలని వుంచాడు అప్పారు "మహాదేవా! మీ పాద కమలములను ఇచ్చట జ్ఞానులు, దేవతలు గూడ అర్చిస్తారు. మహాతపస్వినులు కూడ

వారి ఆర్తిలో ఏ కొరతవున్నా, నీ పాదకమలములు తాకలేరు. కాని నిజమైన భక్తుల కు నీవు సులభుడవు. నీ చరణములు లభ్యమవుతాయి. పామరులకు నీపాద కమల ముల మహిమ అర్థంకాదు. మీ దివ్యచరణములు సకల సంపదలనిస్తాయి. పరమా నందాన్ని కలిగిస్తాయి" అని పాడాడు.

మరికొన్ని దేవాలయాలను సందర్శించి తింగలూరు చేరి అచ్చట దేవుని మహిమ చూపాడు. తాగళూరు (తింగలూరు) లో అప్పూడి యడిగళ్‌నాయనారు (25) అనుమ హాత్ముడు ఉన్నాడు. అతడు (తిరునవుక్కరసు  వాగీశుడు) వాగీశుని యందున్న భక్తి వలన కుమారులకు అందరకును వాగీశులు అని పేర్లు పెట్టినాడు. అతడు త్రవ్వించిన నూతులకు, వేయించిన తోటలకు, నిర్మించిన తటాకములకు ఇంకను అటువంటి ధర్మ కార్యములన్నిటికిని వాగీశుని ధర్మము అని వ్రాయించాడు. ఆ అప్పడి యడిగళ నాయనా రును తన ఇంటికి విందునకు ఆహ్వానించాడు. కుమారులలో పెద్దవానిని పెద్దవాగీశుని తోటకుపోయి ఆకులను కోసుకురమ్మని పంపాడు. అతడు ఆకులను కోయుచుండగా పాము అతనిని కరిచింది. అతడు ఆకులను తల్లిదండ్రులకిచ్చి వారికి పాముకాటు సంగ తి చెప్పి మరణించాడు. ఆ దంపతులు దీనిని రహస్యముగా నుంచి అప్పారును భోజన మునకు లెమ్మని పిలిచారు. వాగీశుడు దివ్యదృష్టివలన జరిగినది గ్రహించి శవమును దేవాలయం ముందరకు గొని రండని ఆదేశించాడు. ఆ పిల్లవానిని బ్రదికించమని వృత్త జాలముతో పరమశివుని ప్రార్థించాడు. బాలునకు ప్రాణము వచ్చి నిదురనుండి లేచినట్లు లేచి కూర్చున్నాడు. అచ్చట విందారగించి వాగీశుడు అనేక ఆలయాల్ని సందర్శిస్తూ తిరు వారూరు కు చేరుకున్నాడు. (అచ్చట మునుపు నమినంది యడిగల్ నాయనారు (27) నీటితో దేవాలయంలో దీపాలు వెలిగించాడు. అచ్చట వాగీశుడు అతని ప్రభావమును వృత్తజాలముతో వినుతించాడు.)

తిరువావూరులో శివభక్తులు అప్పారుకు ఘనస్వాగతం పల్కారు. అక్కడి పరమ శివుడు అప్పారుకు దర్శనమిచ్చాడు. దేవుని మీద ప్రేమ నాయనారులో పెల్లుబికింది.

ఆనందభాష్పాలు రాలుస్తూ ఆనందంతో నృత్యము చేశాడు. పాటలు పాడాడు. ఒక పాటలో జైనమతం పుచ్చుకొని ఎంత తప్పిదం చేశాను ? నేను శివభక్తుడుగా ఆర్తితో ఆయనసేవ లో కొనసాగినచో ఈ వరకే నాకు శివదర్శనమయ్యేడిది గదా అని వాపోయాడు. ఇంకో గీతంలో నమినంది అడిగల్ (27) దీపారాధనకు నూనె ఎచ్చటను దొరకక పోగా దేవాల యంలో దీపాలను నీటితో వెలిగించిన విశేషణ ఆయన పరాభక్తిని గూర్చి కొనియా డాడు.

తర్వాత త్రోవలో దేవాలయాలు చూచుకుంటూ తిరుపూకలూరు చేరాడు. అక్కడ కు తిరుజ్ఞాన సంబంధారు వచ్చియున్నాడు. ఇద్దరు మహాభక్తులు రెండవసారి కలుసుకు న్నారు. అప్పారు కోరికపై సంబంధారు తిరువావూరు వెళ్లి అచ్చటి దైవాన్ని సందర్శించాడు. తిరుపూకలూరు లో ఇద్దరు కొంతకాలమున్నారు. చాలమంది భక్తులకు ఈ ఇద్దరి సమ యాచార్యులను ఒకేచోట దర్శించటానికి వీలయింది. తిరునీలకంఠనాయనారు, శిరు తొండారు, మురుగ నాయనారు ఇంకా చాలమంది తిరుపూకలూరు వచ్చారు. ఆ స్థాన ము మహా శివస్థానముగా రూపొందింది.

ఈ ఇద్దరు భక్తులు తర్వాత తిరునీజిమలై సందర్శించారు. అక్కడ అప్పుడు క్షామ ము (కఱువు) విజృంభించింది. అప్పారు సంబంధారులకు చాల బాధకలిగింది. ప్రజల ఆర్తిని భరించలేకపోయారు. ఆ ఇద్దరు దేవునిగూర్చి ఈ జనులవ్యధ తీర్చమని ప్రార్థిం చారు. పరమశివుడు ఇద్దరికి చెరిఒక సువర్ణనాణాన్ని ప్రతిరోజు ఇస్తానని దానితో ప్రజల వ్యథ తీర్చమని ఆదేశించాడు. శివుడు రెండు నాణాల్నుంచాడు. ఒక నాణాన్ని పశ్చిమ ద్వారము బలిపీఠముమీదను, రెండవ నాణాన్ని తూర్పు ద్వారపు బలిపీఠము మీదను ఉంచాడు. నాయనార్లు ఈ రెండు నాణెములను తీసికొని ప్రజల ఆకలి తీర్చారు. కరువు గూడ అంతమయింది.

ఈశ్వర కృపను ఈ ఇద్దరూ ప్రశంసిస్తూ ఆ ప్రదేశమును వీడారు.

ఇప్పటి వేదారణ్యమయిన తిరుమలైకాడుకు ఈ ఇద్దరు భక్తులు చేరుకున్నారు. ఇచ్చట పూర్వము వేదాలు దేవుని కొలిచేవట. ప్రజలు వేదములు చదువుట మానగానే

వేదాలు గూడ తమకొలువు మానివేసినవట. అప్పటి నుంచి వేదాల ప్రవేశద్వారము మూతబడింది. ఇంకోద్వారమునుండి భక్తులు దేవాలయ ప్రవేశమొనరించుచున్నారు. సంబంధారు మూతబడిన (మూసిన) ద్వారము గుండా లోనికి వెళ్లాలనుకున్నాడు. అప్పారును దీనినిగూర్చి దేవునిమీద పాడమన్నాడు. అప్పారు పాట పూర్తికాగానే ఆ ద్వారపు తలుపులు అవంతట అవే తెరచుకున్నాయి. లోనికి ఇద్దరు వెళ్లి శివుని అర్చించారు. ఆ ప్రవేశద్వారంద్వారా ఇద్దరూ వెలుపలికి వచ్చిన తర్వాత అప్పారు ఈతూరి సంబంధారును పాడమన్నాడు. సంబంధారు వృత్తజాలంతో నుతించగానే ఆ ద్వారము మూసుకు పోయింది.

ఒకరోజు రాత్రి శివుడు అప్పారు కలలోకనిపించి తిరువాయిమూరుకు రమ్మన్నాడు. అక్కడ శివుడు కనిపించి అప్పారు ముందర నడవటం మొదలు పెట్టాడు. అప్పారు శివుని అనుసరించాడుగాని, శివుని దగ్గరకు వెళ్లలేకపోయాడు. అకస్మాత్తుగా శివుడు ఆ ప్రదేశంలోవున్న ఒక దేవాలయంలో ప్రవేశించి అంతర్థాన మయ్యాడు. అప్పారులోనికి వెళ్లాడు. కాని శివుడు కన్పడలేదు. ఈ లోగా సంబంధార్ అప్పారు వెళ్లుచుండుట చూచి అతనిని అనుసరించి ఆ గుడి దగ్గరకువచ్చాడు. అప్పారు సంబంధారుకు తన దర్శనమిచ్చి అనుగ్రహించమని శివుని ప్రార్థించాడు. అప్పారు కోరికను శివుడు మన్నించాడు. ఇద్దరు అచ్చట నుంచి తిరువాయిమూరు వెళ్లి అక్కడనుంచి తిరుమరై కాడకు (వేదారణ్యంకు) తిరిగి వచ్చారు.

పాండ్యభూపతి దేవేరి రాణి మంగయార్ కారసియారున్ను, మంత్రి కులాచిరాయి నాయనారున్ను మధురనుండి సంబంధారుకు జైనుల దుష్కృత్యాలు తెలుపుతూ వార్తల నంపారు. వారిని మధురవచ్చి జైన ప్రాబల్యం తగ్గించ వినతిని పంపారు. సంబంధారు వెంటనే మధుర వెళ్లాలనుకున్నాడు. అప్పారు తన జైనచరిత్ర చెబుతూ అక్కడకు వెళ్లవద్దన్నాడు. సంబంధారు మనసు ఆగలేదు. మధుర వెళ్లాడు. (నాయనార్లు 49, 50 చరిత్రలో చూస్తాము). వెళ్లి మధురరాణి మంత్రులకు జైనుల బెడదను తొలగించి శైవమత వ్యాప్తికి దోహదం చేశాడు.

అప్పారు తర్వాత తిరువావదూతురాయి సందర్శించి అనంతరం పఙ్హైయరాయి కువచ్చాడు. ఇక్కడ వడతలాయి దేవళమును సందర్శించి బయటనుండే దేవుని అర్చన చేశాడు. ఇది శివాలయము. జైనులు దీనిని జైనదేవాలయము క్రింద మార్చారని, శివలింగమును అచటనుండి తీసి ఎవరికి తెలియని చోట పెట్టారని తెలిసింది. అప్పారు శివుని ప్రార్థించాడు. "మీ లింగము ఎచట దాచబడినదో తెలియుదుకనుక, ఆ లింగదర్శనము చేయుదాక ఇచ్చటనుండి ఒక అంగుళము కూడ కదలను అని భీష్మించి కూర్చున్నాడు. శివుడు రాజు కలలో కనబడి, "ఓ రాజా ! నా భక్తుడు, నాదర్శనంకొరకు నిరాహార దీక్ష లోవున్నాడు. వెంటనే వెళ్లి అక్కడనున్న జైనులను తరిమివేసి నా భక్తుని గుడిలోనికి వెళ్లునట్లు చేయి. నా దర్శనమునకు వీలుకల్పించు అని ఆదేశించాడు. ఆ లింగమెచట దాచ బడినదో గూడ రాజునకు శివుడు చెప్పాడు.

రాజు వెంటనే నిదురనుండి లేచి మంత్రులను పిలిచి గుడికి వెళ్లి జైనులను తరిమివేసి తిరునవుక్కరసు పాదాలపై బడ్డాడు. వెంటనే జైనదేవాలయమును శివాలయముగా మార్చివైచాడు. శివలింగాన్ని యధాస్థానాన నిలబెట్టారు. తిరునవుక్కరసు శివుని అర్చించి ధన్యుడునైతినని ఆనందభాష్పాలు రాల్చాడు.

ఇంకో తీర్థయాత్రలో తిరుపెయిన్‌జీలి సమీపిస్తుండగా అప్పారుకు ఆకలి వేసింది. పరమశివునికి అతని ఆకలి దప్పికలను తీర్చాలనిపించింది. త్రోవలో ఒక తోటను, చెరువును సృష్టించాడు. అప్పార్ దప్పికను తీర్చుకొని కొంచెం సేపు తోటలో విశ్రమించాడు. శివుడు ఒక బ్రాహ్మణ వేషంలో చేతిలో ఆహారపదార్థాలను పట్టుకొని అప్పారు కొరకే వేచియున్నాడు. అప్పారు రాగానే అప్పారుకు ఆహారపదార్థాలనిచ్చాడు. అప్పారు భుజించి, మంచి నీళ్లు త్రాగి, సేద దీర్చుకొని బ్రాహ్మణుని మీరెక్కడకు వెళ్తున్నారని ప్రశ్నించాడు. నేను తిరుపెయిన్ జీలి వెళ్తున్నాను అని బ్రాహ్మణుడు చెప్పాడు. ఇద్దరూ నడుచుట మొదలుపెట్టారు. ఆవూరు సమీపిస్తుండగా బ్రాహ్మణుడు ఆకస్మాత్తుగా మాయమయ్యాడు. అప్పారు ఆవచ్చినది పరమశివుడే అని గ్రహించాడు. పరమశివుని గుర్తించలేక పోయినందుకు దుఃఖము ముంచుకువచ్చింది. శివునికి దూరమైనందుకు ఏడుస్తూ నేలపై దొర్లాడు.

తిరువన్నామలై 'కంచి దర్శించాడు కాళహస్తిలో కన్నప్పార్ గూర్చిపాడాడు. ఇవి దర్శించిన తర్వాత అప్పారుకు ఇక కైలాసానికి వెళ్లాలని మనసైంది. కాశి వెళ్లి విశ్వనాధుని అర్చించాడు. ఉత్తర దెసతిరిగి అనేక క్రూర మృగ దుర్గమారణ్యాలను దాటి వెళ్లాడు. క్రూరమృగములపై అతని దృష్టిపడగానే అవన్ని సాధుజంతువులై పోయేవి. రాత్రింబగళ్లు నడిచాడు. కాళ్లు పుళ్లుబడ్డాయి. చేతులతో ప్రాకడం ప్రారంభించాడు. మోకాళ్లు , మోచేతులు అరిగి నెత్తురు కారటం ప్రారంభించింది. ఎముకలు విరిగాయి. అయినా కైలాస యాత్రమనోనిబ్బరంతో సాగించాడు. అప్పార్ కైలాసానికి చేరాలనుకున్నాడు. కాని శివుడు అతను ఇంకనుకొంత కాలం భూమిమీదనే ఉండాలనుకున్నాడు. తనమీద అప్పారుకీర్తనలను వినాలను కున్నాడు. అందుకని అచట ఒక చెరువును సృష్టించి ఒక జడలు కట్టిన మునిలాగ మెడలో రుద్రాక్షలతో, విభూతి పుండ్రములతో అప్పారు ముందర ప్రత్యక్షమయ్యాడు. అప్పారు కైలాసానికి వెళ్తున్నట్లుగా తెలిసి కొన్నాడు. ఆముని అన్నాడు ఓ స్నేహితుడా కైలాసం మానవమాత్రులకు కనిపించదు. అందుకని వెనుదిరిగిపో అన్నాడు.

అప్పారు ఈ శరీరమున్నంత కాలము కైలాసానికి వెళ్లాలనే కోరిక మానుకోను అని తిరిగి మునికి  నమస్కరించాడు. అచ్చట ఆముని కన్పడలేదు. అప్పారుకు మళ్లీ అర్థమైంది. ఆ వచ్చింది ఎవరో కాదు పరమశివుడేనని. ఆ క్షణం నుంచి అప్పారుకు కనబడకుండా శివుడు అతనిని అనుసరించాడు. అప్పుడప్పుడు ఉత్సాహ పూరితంగా వరాట్లాదేవాడు. అప్పారు మనసులో శివుని పరమశివా ! నా ప్రయాణము కొనసాగించుటకు నాకు నూతన శరీరము ఇవ్వుము! అని ప్రార్థించాడు. శివుడు దగ్గరనున్న చెరువులో స్నానము చేసి రమ్ము అని ఇలా చెప్పాడు. నువ్వు నానివాసమైన కైలాసాన్ని తిరువైయారు చూస్తావు అన్నాడు.

అప్పారు పంచాక్షరిని జపిస్తూ ఆ చెరువులో మునిగాడు మునిగిలేవగానే ఎక్కడో దక్షిణాదిన వందలమైళ్ల దూరములో నున్న తిరువయార్ సరస్సులో తానున్నట్లు గా గమనించాడు.చెరువునుంచి బయటకు వచ్చి అంతటా శివశక్తి స్వరూపములనే చూచాడు. గుళ్లోకి వెళ్లాడు. అచ్చట కైలాస పర్వతాన్ని చూచాడు. అచ్చట శివుడు అంబ పార్వతి

వుండగా దేవతలు ప్రమథగణాలు ఆయనను స్తుతిస్తున్నట్లు చూచాడు. అప్పారు తన్మయత్వము నొంది దేవుని నుతిస్తూ నృత్యము చేశాడు.

తిరువూనుతురాయిలో అప్పారు వుండుటకు ఒక మఠం నిర్మించ బడ్డది. సంబంధారు జైనులను మధురలో ఓడించి తిరుపూను తురాయికి తిరిగి వస్తున్నాడు. అప్పారు ఆయనకు స్వాగతమిచ్చుటకు వెళ్లాడు. సంబంధారును పల్లకిలో మోసుకొని వస్తున్నారు. సంబంధారుకు తెలియ నీయకుండా అప్పారు ఆ పల్లకి ఒక కొమ్మును తన భుజాలపై నుంచుకొని మోసాడు. తిరుపూనం తురాయి చేరగానే అప్పార్ ఎక్కడ అని ప్రశ్నించాడు. నేనిక్కడనే వున్నాను స్వామి అన్నాడు సంబంధారుపల్లకి నుండిదిగి అప్పారు కాళ్లమీద పడ్డాడు. అప్పారు చూపిన నమ్రతకు సంబంధారు చలించి పోయాడు. ఇద్దరు ఒకరి నొకరు పరిష్వంగనం చేసికొన్నారు.

తిరునవుక్కరసారు పాండ్యదేశంలో  శైవమతం ఎలావుందో స్వయంగా చూద్దామనుకొని మధుర వెళ్లాడు. రాజు నిన్రాషీర్ నెడుమారనాయనారు (49, 50) రాణి మంగయార్కార శియారు, మంత్రి కులాచిరాయినాయనారు (22) అత్యంత ఆదరంతో అప్పారుకు స్వాగతం చెప్పారు. అప్పారు దేవుని అర్చిస్తూ అక్కడ కొన్నాళ్లున్నాడు. అచ్చటనుంచి రామేశ్వరము, ఇతర ప్రదేశాలకు వెళ్లి తిరుపూకలూరుకు చేరుకున్నాడు.

అక్కడ శివుడు అప్పారును పరీక్షించదలచాడు. దేవాలయంలో అప్పారు సేవ చేస్తున్నప్పుడు ఆ ప్రదేశమంతా బంగారము, రత్నాలతో నిండి యున్నట్లనిపించింది. అప్పారుకు బంగారము, రత్నాలు గడ్డి పరికతో సమానము. అప్పారు అక్కడ నున్న బంగారము, రత్నాలనేరి ప్రక్కనున్న చెరువులో పడవేశాడు. శివుడు ఈసారి అందమైన భామల్ని అక్కడనుంచాడు. వారిని అప్పారుచూచాడు చలించలేదు. తన ధ్యాస అంతా శివుని పైనే నిలిచి వుంది.

అప్పారు అక్కడ కొంతకాలముండి తన 81 సంవత్సరము వయసులో శివైక్యము చెందాడు.

# 18. తిరునాళై పోవార్ నాయనారు

## (నందనారు)

నందనారు కులానికి అంటరాని వాడు. చోళరాజ్యంలో ఆదనూరులో జననము. నమ్రత, భక్తితత్వరత అతనిలో పుంజీభూతమయ్యాయి. పరమశివుడే అతని శరణాగతి. తీర్థయాత్రలు చేసి వివిధ శివస్థలాలను దర్శిస్తూ ఆయా దేవళములకు భేరి, మృదంగము వీణతీగెలు మొదలైన సంగీతోపకరణములను ఇచ్చేవాడు. అనేక శివస్థలములలో తోటలు పెంచాడు. తటాకములు త్రవ్వించాడు.

ఒకరోజున తిరుపున్కూరులోని శివుని చూడాలనుకున్నాడు. అక్కడ శివునికి కొంత సేవను చేద్దామని నిశ్చయించాడు. దేవుని చూడాలంటే నంది అడ్డము రావటంతో దుఃఖితుడయి దేవుని గూర్చి పరితపించాడు. మహాదేవుడు అతని భక్తికి మెచ్చి నందిని కొంత ప్రక్కకు తొలగుమని చెప్పి నందనారుకు దర్శనమిచ్చాడు. తిరుపున్కూరులో ఈ రోజుకి నంది ఒక ప్రక్కకు ఒదిగివుంది. ఆ దేవాలయమునకు ఓ చెఱువు త్రవ్వి పెట్టి ఆదనూరులోని తన నివాసానికి చేరాడు.

చిదంబరం వెళ్లి అచటగల నటరాజస్వామిని దర్శించాలని మనసా వాంఛించాడు. శివునియెడ భక్తి పెరిగిపోయింది. భాష్పాలు రాలుస్తూ, దేవునిమీద ప్రేమ చూపిస్తూ తోటివారికి - రేపు చిదంబరం వెళ్తానని చెబుతుండేవాడు. వెళ్లలేకపోయేవాడు. అందుకని అతనిని తిరునాళైపోనార్ (రేపు వెళ్లేవాడుగా) పేరు వాడుక అయింది.

ఒకరోజున నిజంగానే చిదంబరం వెళ్లాడు. ఆ గ్రామమంతా చుట్టాడు. తన నిమ్న బ్రదుకును తలచుకోగా - అతనిలో గుడిలోనికి వెళ్లాలనే కోరిక అంతరించింది. ఇలా దేముని ప్రార్థించాడు. "పరమశివా! నాట్యసభలో నీ నాట్యం దర్శించాలని వుంది. కాని ఎట్లా చూసేది? నేను నిమ్న జాతిలో పుట్టాను. అందుకని నన్ను లోనికి రానీయరు. నిన్ను ఎట్లా చూసేది?" ఈ విధంగా కొన్ని రోజులు ఏడవసాగాడు. శివునికి దయ కలిగింది. అందుకని నాయనారు కలలో కనిపించి " నీవు విచారించవద్దు నీవు నా దగ్గఱకు వస్తావు, అగ్నిస్నానము చేయి. చేసి నా కనకసభకు బ్రాహ్మణులతో రమ్ము" అని చెప్పాడు.

నందనారుకు మెలకువ వచ్చింది. సంతోష భరితుడయ్యాడు. తిల్లయి (చిదంబరం)లోని బ్రాహ్మణులకు కలలో శివుడు కనబడి "నా భక్తుడు తిరునాలాయిపోనార్ తిల్లయి వచ్చియున్నాడు. ఒక పవిత్రమైన అగ్నిని వ్రేల్చండి. నందనారు అగ్నిస్నానము చేసి నా దగ్గఱకు వస్తాడు" అని చెప్పాడు.

మరుసటిదినాన్నే బ్రాహ్మణులు అగ్నిని వుంచారు. నందనారు వద్దకు వెళ్లి అతనికి సాష్టాంగ నమస్కారము చేసి తమ కలను చెప్పారు. నందనారు అగ్ని చుట్టూ ప్రదక్షిణం చేసి శివుని పాద పద్మముల మీద దృష్టి సారిస్తూ, పరమశివుని నామాన్ని జపిస్తూ అగ్ని లోనికి దుమికాడు.

అందులోంచి వినూత్నమైన తేజంతో శరీరమంతా విభూతిరేఖలు నలుముకొని యజ్ఞోపవీతంతో జుట్టముడితో నందనారు బయటకు వచ్చాడు. నందనారును సగౌరవంగా దేవాలయంలోనికి తీసికొని వెళ్లారు. కనకసభలో నందనారు శివుని అర్చించాడు. నటరాజు నాట్య విన్యాసంలో తన్మయుడయ్యాడు. గదిలోంచి మిరుమిట్లు గొలుపు ఒక వెలుగురేఖ మెరిసింది. నందనారు అందులో అంతర్ధానమయ్యాడు. నటరాజస్వామిలో లీనమయ్యాడు.

****

# 19. తిరుకురిప్ప తొండనాయనారు

తొండైమండలం ఒక భాగ్యసీమ. దానికి కంచి ముఖ్యపట్టణము. ఆగమముల ప్రకారము ఇచ్చటనే పార్వతి శివుని గూర్చి తపమొనరించినది. ఇచ్చట శివుడు ఏకామ్ర నాథుడుగా పిలువబడుతాడు.

తిరుత్తొండారు ఇచ్చటనే జన్మించాడు. రజకుడుగా పుట్టాడు. శివధ్యానైక తత్పరుడు. శివభక్తులను ఆదరించేవాడు. సేవించేవాడు. వారి ముఖాల్ని చూచి, వారల అవసర ముల గుర్తెరిగి వాళ్లకు సహాయమందించేవాడు. అందుకని అతనికి తిరుకురిప్ప తొండ నాయనారు అని పేరు వచ్చింది. శివభక్తుల బట్టలనుతికేవాడు. శివుడు ఈతని భక్తికి మెచ్చి - అందరికి అతని విశేషము తెలియబరచాలనుకున్నాడు.

శివుడు ఒక పేదవానిగా రూపొంది, మెడకు రుద్రాక్షతో, దేహమంతా విభూతి పుండ్రములతో, చిరిగిపోయిన దుస్తులతో తిరుత్తొండారుకు ప్రత్యక్షమయ్యాడు. అతనిని చూడగానే తిరుత్తొండారుకు మైకం కమ్మింది. తేరుకొని, అతనిని కొలిచాడు. ఆగంత కుని ప్రశ్నించాడు. “స్వామీ! మా ఇల్లు, మీ రాకతో పావనమయింది. ఎందుకని మీరు చిక్కిపోయారు? మీ దుస్తులను ఉతికి పెట్టనీయండి. మీకు సేవ చేయనీయండి” అని అర్థించాడు. ఆ శివభక్తుడు ఒక షరతుతో ఆ బట్టలనుతుకుటకు అనుమతిచ్చాడు.
ఆ నిబంధన: ఆ బట్టలు ఉతికి, ఆరవేసి తనకు సూర్యాస్తమయంలోపల అందజేయాలి. లేనియెడల బక్కచిక్కిన తను, చలికి చనిపోతాడు అని”.

తొండారు ఇందుకు అంగీకరించాడు. అంగీకరించే సమయానికి ఎండ బాగానే వుంది. వెంటనే ఆ బట్టలనుదికాడు. ఆరవేసే సమయానికి పెద్దవాన మొదలిడింది. సూర్యుడస్తమించే సమయం వచ్చింది. ఆ బట్టలు ఆరే పరిస్థితి కనబడలేదు. తొండారు తబ్బిబ్బయ్యాడు. శివభక్తునికి తాను సహాయము చేసే బదులు అతనిని కష్టాలపాలు చేసే స్థితికి వచ్చింది. ఈ పాపాన్ని తలుస్తూ ఆ బట్టలుతికే రాయికి తన తలను వేసి కొట్టుకు న్నాడు. దేవుని ప్రార్థించాడు. పరిస్థితిని చూచి ఆక్రందించాడు.

శివుడు ఆ ఆక్రందనకి కరిగి ప్రత్యక్షమై తొండారును అభినందించి, భక్తికి మెచ్చుకొని - 'త్వరలో నన్ను చేరగలవు. నా దగ్గరే వుండగలవు' అని అనునయంగా పల్కాడు.

తిరుత్తొండారు పరవశించి, శివుని పాదములపైబడి తన్మయత్వంతో శివుని నుతించాడు.

## 22. కులాచిరాయి నాయనారు

శివభక్తి పారవశ్యంలో కులాచిరాయినాయనారు అందరిని మించి పోయారు. పాండ్యరాజ్యంలో మనమేల్ కుడి లో జన్మించారు. ఈ ప్రదేశమును శివభక్తులు తరచు సందర్శించేవారు. కులాచిరాయి నాయనారు వారికి నాయకుడు గాను ప్రజలకు మిక్కిలి సహాయకుడిగా ను వుండేవాడు. శివభక్తుల అర్చనయే శివార్చనగా భావించే వాడు. శివునికి భక్తులకు మధ్య ఆయనకు తేడా ఏమీ కన్పించేది కాదు.

ఈయన పాండ్యభూపతికి మంత్రి అయాడు. అయినా శివభక్తులకు తనను దాసుడుగా ఎంచుకునేవాడు. ఆ ప్రాంతంలో ఆయన అత్యంత ధనవంతుడు. భాగ్య మున్నదని గర్వపడలేదు. సంపదకు అతి విలువ చూపలేదు. సంపద తనది కానే కాదని అందరు శివభక్తులకు అవి చెందుతుందని భావించేవాడు. సంబంధారు ఈయన గుణవిశేషాలను తన వృత్తులతో శ్లాఘించాడు గూడ.

నాయనారు మంచి పాలనదక్షుడు. మంచి సేనాని అయినా తన ధ్యాస అంతా శివునిమీద శివభక్తులమీద యుండేది. రాణిగార్కి జైనమతవ్యాప్తి నిరోధించుటకు తోడ్ప డ్డాడు. జైనమతప్రాబల్యమును తగ్గించుటకు రాణి గారి కోర్కెపై తిరుజ్ఞాన సంబంధా రును మధుర కాహ్వానించాడు. సంబంధారు మధుర వచ్చాడు. జైనులు అది సహించ లేక సంబంధారు నివాసము కూలగొట్ట ప్రయత్నించి వీలుకాక ఆయన అనుయాయులు నివాసమునకు నిప్ప పెట్టారు. సంబంధారు వృత్తజాలములను పాడాడు. తన నివాసము తగులబడలేదు. అనుయాయుల నివాసమునకు పెట్టిన నిప్పు - మంటలయి - ఆ మం టలు రాజుగారి దేహములో మంటలయినాయి. జైనులు ఎంత ప్రయత్నించినను రాజు గారి దేహములో మంటలు చల్లారలేదు. జైనమతము గొప్పదా లేక శైవమతము గొప్పదా అని తేల్చుకొనుటకు గూడ రాజుగారి రుగ్మత ఒక పరీక్ష అయినది. జైనులు రాజుగారి బాధ తగ్గించలేకపోయారు. సంబంధారు రాజుదారి దేహమునకు విభూదినలమి శివు ని వృత్తజాలములతో కీర్తించినంతనే రాజుగారి బాధ నివారణమయినది. ఈ విషయంగా కులాచిరాయినాయనారు పాత్ర శ్లాఘనీయమయినది. పాండవ రాజ్యములో ఈయన రాణిగారి కృషి మూలమున శైవమతము బహుళవ్యాప్తి నందినది. అంత్యమున శివ సాయుజ్య మందినాడు.

# 20. చండీశ్వర నాయనారు

చండీశ్వర నాయనారు పూర్వ నామము విచారశర్మ. చోళదేశమున తిరుచాయి జ్ఞాన నల్లూరులో యజ్ఞశర్మ, పవిత్ర దంపతులకు జనన మందినాడు. ఆ గ్రామము వేద ఘోషలకు తపస్సులకు శివభక్తిపరులకు నిలయము. విచారశర్మ కారణజన్ముడగుటచే ఐదు సంవత్సరముల ప్రాయము నిండక పూర్వమే వేద వేదాంగములయందు, ఆగమ ములందు అసమాన పండితుడైనాడు. ఏడవ సంవత్సరమున ఉపనయనము పిదప గురువు వద్దకు విద్యాభ్యాసమునకు పంపగా ఈ విషయము గురువుగారికి తెలిసినది. గురువు సంత ప్రారంభింపగా విచారశర్మ వేదములను ఏకరువు పెట్టాడు. పాఠము చెప్ప మొదలిడినంతనే శాస్త్రములనన్నింటికి చింతచేశాడు. గురువు ఆశ్చర్యచకితుడయ్యాడు. ఇంతటి శిష్యునకు తాను గురువైనందుకు ఆనంద భాష్పాలతో గురువు విచారశర్మను కౌగలించుకున్నాడు.

గురువునకు సమిధలు తెచ్చుటకు వెళ్లుచుండగా, త్రోవలో ఒక ఆలమందను పశువుల కాపరిని చూచెను. ఒక ఆవు మంద నుండి విడిపోగా పశువుల కాపరి దానిని పట్టుకొని కర్రతో చావుమోది పశువుల మందలో కలిపాడు. విచారశర్మ అదిచూచి "శివుని కారణమున గోవులు భూలోకంలో అవతరించాయి. దాని సర్వాంగములందు దేవతలున్నారు. పంచగవ్యము శివునికి అభిషేక ద్రవ్యము. గోమయము ఈశ్వర చిహ్న మగు విభూతిమూలము. ఓ అవివేకీ! నీవు ఈరోజు చాలా పాపము చేశావు. నీవు ఇక నుంచి గోవులను మేపవద్దు. నీ బదులు నే నా పనిని చేస్తాను" అన్నాడు.

యజమానుల అనుజ్ఞ పొంది గోవులను తోలుకొనిపోయి ఏపుగా పెరిగిన పచ్చిక బయళ్లలో మేపసాగాడు. నిర్మలమైన ఏటినీళ్లను వాటిచే త్రాగించాడు. చెట్లనీడలలో వాటిని విశ్రమింపచేశాడు. ఆవులు చక్కగా మేసి మనోహరముగా బలిసి నాలుగురెట్లు పాలీయసాగాయి. బ్రాహ్మణులకు సమృద్ధిగా క్షీరముండుటచే విచారశర్మ సంరక్షణకు ఆనందించారు. శివునికి క్షీరాభిషేకము చేయ మొదలిడారు.

గోవులు పాలను చాలా అధికముగా ఇచ్చుటతో, శివుని అమితంగా ప్రేమించే విచారశర్మ శివునికి పాలాభిషేకము చేయ నిశ్చయించాడు. నది ఒడ్డున అత్తివృక్షము క్రింద కూర్చొని మట్టితో ఒక దేవాలయము నిర్మించి, అందులో మట్టితోనే శివలింగ మును ప్రతిష్ఠచేసి పాలతో అభిషేకము చేయమొదలిడాడు. అత్తిపూలతో పూజించేవాడు. విచారశర్మకు, బ్రాహ్మణులకు గోవులు సమృద్ధిగా క్షీరము నిచ్చుచున్నవి.

ఒకరోజున విచారశర్మ ఈ విధంగా పూజచేస్తుండగా, ఒక గ్రామస్తుడు ఆ దెస రావడం తటస్థించింది. విచారశర్మ గోక్షీరమును మట్టిలో పోయుట చూచాడు. విచార శర్మ పాలను మట్టిలో పోసి దుర్వినియోగము చేయుచున్నాడని అభియోగము మోపా డు. బ్రాహ్మణులు అధికారికి ఫిర్యాదు చేశారు. విచారశర్మ తండ్రిని ఏకదత్తుని బ్రాహ్మణు లు అందరు మందలించడం జరిగింది. తండ్రి యజ్ఞశర్మ (ఏకదత్తుడు) స్వయముగా త న తనయుని గురించి తెలిసికొందామని కుమారుడుండుచోటికి వెళ్లాడు. దూరము ను ంచి విచారశర్మ పాలను మట్టిలోపోయుచుండుట చూచాడు. కుమారుడు తన కడుపు నచెడబుట్టాడని - సరిగా ఏమి జరుగుచున్నది చూడక - విచారశర్మ ధ్యానములో నిమ గ్నుడైయుండగా విచారశర్మను కర్రతో మోదాడు. పాలకుండను తోశాడు. విచారశర్మ కళ్లు తెరచి తండ్రి శివాపరాధము చేశాడని ఒక కర్రను తీసికొని తన తండ్రి కాళ్లమీద కొట్టుటకు విసిరాడు. కర్రగొడ్డలయి ఆయన కాళ్లను నరికివేసింది. తండ్రి చనిపోయాడు. ఇదంతా శివలీల. విచారశర్మను పరీక్షించుటకు జరిగింది. విచారశర్మ ఏమి జరిగినది జరుగుచున్నది గమనించలేదు. మళ్లీ ధ్యానములో నిమగ్నుడైపోయాడు.

పరమేశ్వరుడు విచారశర్మ శివదీక్షకు అమితంగా సంతోషించి పార్వతీదేవితో ప్రత్యక్షమయ్యాడు. శివుడు విచారశర్మను కౌగిలించుకొని లాలించాడు. ఆ క్షణమే విచార శర్మ శివస్వరూపుడైనాడు. శివుడు తన మెడలోని హారమును తీసి విచారశర్మ మెడలో వేశాడు. విచారశర్మకు సారూప్యముక్తి లభించింది. శివుడు చెప్పాడు. "నీవు నీ తండ్రిగారి కాళ్లను నా కొఱకు నరికావు. నేను ఈ రోజునుంచి నీకు తండ్రిని. నీకు చండీశ్వరత త్వము నిచ్చుచున్నాను. నీవు నాకు ఆహారము, పూలమాలలు, వస్త్రములు ఇచ్చి నన్ను

అర్చించావు. ఈ రీతినే భక్తులు నిన్ను గూడ అర్చిస్తారు".

పరమశివునిపై అనితరభక్తిమూలాన్న తండ్రి హత్యాపాతకము అంటలేదు. శివుని మహాభక్తునిచే చంపబడ్డాడు కావున విచారశర్మ తండ్రికి గూడ శివసాయుజ్యమబ్బింది.

# 23. పెరుమిజహలాయి కురుంబనాయనారు

గురువు దేవుడే. సర్వము తానెయయిన వాడు. సర్వోపగతుండు. అందరిలో నీలో, నాలో తనలో వున్నవాడు, ఎప్పడును నినువిడిచి యుండనివాడు, మనల్ని పోషించువాడు. దేవుడు, మనకు గురువురూపంలో ప్రత్యక్షమవుతాడు. గురువును నమ్మి సేవించిన వానికి అష్టసిద్ధులు కరతలామలకము లవుతాయి. పెరుమిజహలాయి కురుంబ నాయనారు గురుభక్తిలో అందరిని మించిపోయాడు. ఆయనకు శివునిమీద, శివభక్తుల యెడ, అపార భక్తితత్పరత వుంది. సుందరమూర్తి నాయనారు గూర్చి విన్నాడు. మనసులో ఆయనే తన గురువు అని నిశ్చయించుకొన్నాడు. ఆయనే తన శరణాగతి మనస్సులో, ఆలోచనలలో, మాటలలో , చేతలలో అంతటా ఆయనకు సుందరారే. గురుకృపచే అన్ని సిద్ధులు ఆయనకు లభ్యమయాయి. అయినా శివభక్తిలో, గురుభక్తిలో లీనమై పోయేవాడు.

ఈలోగా సుందరారు తిరువంచైకలము వచ్చాడు. ఇచ్చటినుండే ఆయన శివసన్నిధికి చేరుకున్నాడు. కుటుంబనాయనారు యోగదృష్టిలో ఇది జరుగబోతుందని గమనించాడు. గురువు వెళ్లిపోయిన పిదప ఈ ప్రపంచంలో తానుండ దలచుకోలేదు. అందుకని శివయోగ ప్రక్రియలో నాయనారు తన దేహమును వీడి, సుందరారు నిష్క్రమణకు ఒక రోజు ముందరే తను శివసాన్నిధ్యము చేరుకున్నాడు.

# 24. కరైక్కల్ అమ్మయ్యారు

## (కారక్కాల్ అమ్మ)

చోళదేశంలో కరైకల్ అనుగ్రామములో, వైశ్యకులంలో ధన దత్తుడు మంచి వర్త కుడున్ను, ధనవంతుడున్ను. సంతానలేమిచే భగవంతుని గూర్చి ధనదత్తుడు, అతని భార్య ప్రార్థింపగా ఈశ్వర కృపచే ఒక కుమార్తె జన్మించింది. ఆమెకు పుణ్యవతి అని నామకరణం చేశారు. పుణ్యవతికి మొదటి నుంచి శివుడన్న, శివభక్తులన్న ప్రీతి మెం డుగా యుండేది. తండ్రి ఆమెను పరమదత్తునకు ఇచ్చి వివాహము చేసి, తమకు ఆమె ఒక్కతే పుత్రిక అగుటచే తమ ఇంటి ప్రక్కన ఒక మేడ కట్టించి ఆ దంపతులను ఆమేడ లో కాపురముంచారు. అల్లుడు పరమదత్తుడు గూడ మంచి వ్యాపారి. ఒక వ్యాపార మారంభించి విశేషధనము ఆర్జింప సాగాడు. పుణ్యవతి భర్త ఐశ్వర్యమునకు మిడిసి పడక, గర్వపడక శివుని పూజించుచును, శివభక్తులను ఆదరించుచును గడిపేది.

ఒక రోజున పరమదత్తుడు తమ ఇంటికి రెండు మామిడి పండ్లను పంపాడు. వానిని ఆమె జాగ్రత పరచుచుండగా ఒక శివభక్తుడు క్షుధార్తుడై డస్సి వచ్చాడు. అది భోజనమునకు వేళ. అందుచే పుణ్యవతి ఆయనను అర్చించి భిక్ష పెట్టినది. తన దగ్గర ఏమీలేక పోవుటచే భర్తపంపిన రెండు మామిడి పళ్లలో నొకదానిని ఆబిక్షకుని కిచ్చింది. మధ్యాహ్నవేళ అయింది. భర్త పరమదత్తుడు ఇంటికి భోజనానికి వచ్చాడు. పుణ్యవతి భర్త కు భోజనములో రెండవ మామిడి పండును వడ్డించింది. దానిని భుజించి ఇది చాల మధురంగా వుంది రెండవది గూడ వేయుము అని భర్త అడిగాడు. పుణ్యవతికి పాలు పోలేదు. లోనికి బోయి పరమ శివుని ధ్యానించుట మొదలిడింది. పరమేశ్వరుడు కరు ణించి ఆమె చేతిలో ఒక మామిడి పండును వచ్చునట్లు చేశాడు. ఆమె ఆశ్చర్యపడి, ఈశ్వ రుని కృప అని యెంచి భర్తకు ఆ మామిడి పండును వడ్డించింది. భర్త దానిని గూడ భుజించి - ఇది ఇంకను విశేషముగా మధురముగా నున్నది. ఈ లోకము నకు సంబం ధించినట్లుగా తోచదు. ఇది నీకు ఎట్లు వచ్చింది అని అడిగాడు. పుణ్యవతి జరిగినది నిజ

ము చెప్పినది. భర్తనమ్మక - నీవు చెప్పినది నిజమైతే - ఆ పరమేశ్వరునే అడిగి ఇంకొక పండు తెమ్మనెను. పుణ్యవతి శివుని ప్రార్థించింది. వెంటనే ఇంకో మామిడి పండు - భర్త చూచుచుండగా - ఆమె చేతిలోనికి వచ్చింది. దానిని భర్త చేతిలో పెట్టింది. భర్త చూచు చుండగా ఆ పండు మాయమైపోయింది. పరమదత్తుడు విస్మయుడై ఈ పుణ్యవతి సామాన్య స్త్రీ గాదు. ఈమె ఒక దేవత. ఈమెతో కాపురం చేయటం పాపం అవుతుంది అనుకొని - ఆమెతో నుండ నిచ్చగించక విదేశవ్యాపారానికి వెళ్తున్నానని పడవనిండా సరుకులతో, ఆ వూరువిడిచి, పాండ్య దేశంలో ఒక పెద్ద పట్టణానికి వెళ్లాడు. అక్కడ వేరొక వైశ్యస్త్రీని పెండ్లాడాడు. ఒక కూతురు పుట్టింది. కుమార్తెకు మొదటి భార్యపేరు పుణ్యవతి అనుపేరు పెట్టాడు.

పుణ్యవతి బంధువులు ఆమె భర్త వేరొక పట్టణంలో వుండుట చూచి - పుణ్యవతిని పల్లకిలో ఎక్కించుకొని పరమదత్తుని పట్టణమునకు తీసికొని వెళ్లి పరమదత్తుని ఇంటి కి చేర్చారు. పుణ్యవతిని చూడగానే పరమదత్తుడు, తను అతని రెండవ భార్య, తన కుమార్తె తోను పుణ్యవతి కాళ్లపై పడి నమస్కరించారు. భర్త భార్యకు నమస్కరించుట తప్పు అని అక్కడ పెద్దలు చెప్పారు. అతను ఆమెకు దూరముగానుండుటకు, ఇప్పుడు ఆమె కాళ్లపై బడుటకు కారణమేమని ప్రశ్నించారు. అతను ఆమెను నేను ఒక దేవతగా నెంచుచున్నాను. బార్యగా పరిగణించలేక పోతున్నాను. ఆమె సామాన్య స్త్రీ గాదు. ఆమె మహిమ మీకు తెలియదు అని చెప్పాడు.

భర్త మానసిక స్థితిని అర్థము చేసికొని పుణ్యవతి దేవుని పరమేశ్వరా నాభర్తగారి ఆనందము కొఱకై సుందరిగా నుండ కోరాను. భర్తనన్ను తిరస్కరించినారు గనుక నా అందమును తీసివేసి నాకు ప్రేత శరీరమును దయచేయుము అని ప్రార్థించింది. ఆమె అభ్యర్థన వెంటనే అనుగ్రహింపబడినది. ఆమె ప్రేత శరీరముతో అస్థి పంజరముతో నిలి చింది.

బంధువులందరు ఆమె దేవతా స్త్రీయే నని నిశ్చయించుకొని వెళ్లిపోయారు. పుణ్య వతి ఇక్కడ నేనెందుకు అని కైలాసానికి బయలు దేరింది. కైలాసము సమీపిస్తుండగా

ఈ కైలాస పర్వత భూమిమీద కాళ్లతో నడువరాదు అని శిరముతో నడిచి శివుని సన్నిధి చేరింది. మాతృమూర్తి పార్వతీ దేవి ఆమెను చూచి ఆశ్చర్యపడి - ఈ మహాత్మురాలి చరిత్రము విస్మయముగా నున్నది. ఆమెను గురించి చెప్పవలసినదిగా పరమేశ్వరుని ప్రార్థించింది. ఈమె మనలను రోజూ వినుతించు శీలవతి ఆమెకోరి ఇట్టి దేహమును పొందినది అని ఆమె గూర్చి చెప్పాడు. ఇంతలో పుణ్యవతి ఆది దంపతులను సమీపించి దేవా! నాకు పునర్జన్మ లేకుండునట్లు అనుగ్రహింపుము. ఒక వేళ పునర్జన్మ తప్పని సరి అయిన నాకు మీయెడల అచంచలమైన నిర్మలమైన, శాశ్వతమైన, ఒడలు ఉప్పొంగు గాఢమైన అనితరమైన భక్తి అనుగ్రహించండి. మిమ్ములను ఎన్నడు మరువకుండులాగున, మీరు నృత్యము చేయునప్పుడు మీ పాదముల చెంతనుండి మిమ్ములను కీర్తించుచుండు లాగున మీ అనుగ్రహము కృప నాపై నుంచండి అనివేడుకొన్నది.

పరమ శివుడు ఆమెకు ఆవరము ఇచ్చి దక్షిణ దేశంలో తిరువాలంగాడు వెళ్లి అక్కడ నివసించుచు నానృత్యమును చూడుము అని ఆదేశించాడు. ఆమె తిరువాలంగాడు చేరి శివుని సన్నిధిని శివుని కీర్తిస్తూ వుండినది.

# 25. అప్పడి నాయనారు

గురుభక్తి విషయంలో అప్పడి నాయనారును చెప్పి మరొకరి గూర్చి చెప్పాలి. ఆయన గురుభక్తి నిరుపమానము. గాఢ శివభక్తుడు. గృహస్తుగా తన ధర్మాన్ని జాగరూ కతతో నిర్వహించేవాడు. చోళదేశంలోని తింగలూరు బ్రాహ్మణుడాతడు.

అప్పడి అప్పారు ఖ్యాతి విన్నాడు. పల్లవరాజు అప్పారును శిక్షించి నట్లును, శిక్షగా అప్పారును బండరాయికి కట్టించి సముద్రములో పడవేస్తే దైవ కృపచే ఆ బండతేలి పోయి అప్పారును సురక్షితముగా తీరాన్ని చేర్చినదని మొదలైన కథలన్ని అప్పారు గురిం చి విన్నాడు. ఆయన పనులకు ముగ్దుడై అప్పారును చూడకపోయినా అప్పారును తన గురువుగా నెంచుకొని గురుపూజా దురంధరుడయ్యాడు. పరమశివుడు భక్తుల యెడ కృపతో  సాధకులకు గురువుగా భాసిస్తాడు. అప్పడి సదా గురుపాద కమలములను ధ్యానిస్తూ వుండేవాడు. తన కుమారులకు వాగీశులని పెద్దవాగీశుడు చిన్ని వాగీశుడని పేర్లు పెట్టాడు. గుహోపకరణములకు, త్రవ్వించిన నూతులను, తటాకములకు, వేయించి న తోటలకు అన్ని ధర్మకార్యములకు గురువు గారిపేరు వాగీశునిధర్మము అని వుంచాడు.

అప్పరు ఒక రోజున తింగలూరు మీదుగా ప్రయాణం చేస్తున్నాడు. ఒక జలా శయం దగ్గరకు వెళ్లాడు. తన పేరే అంతటా కన్పడింది. ఆశ్చర్యపోయాడు. బాటసారుల నుండి తీర్థయాత్రికుల నుండి ఇవన్నీ అప్పడి నాయనారు నిర్మించినవే నని తెలిసింది. విస్మయంతో అప్పడి దగ్గరకు వెళ్లాడు. అప్పడి ఈ శివభక్తుని సాదరంగా బహునమ్రత తో ఆహ్వానించాడు. అప్పారు అప్పడిని పలుకరించి మహాశయా ! మిమ్ములను గూర్చి, మీ మంచి పనులగూర్చి పెక్కుమంది నుంచి విన్నాను. మీకు నా జోహారులర్పించ వచ్చాను. నాకు దయ యుంచి తెలుపండి. ఈ ధర్మ కార్యాలన్నిటిపైనా మీ పేరుంచ కుండా ఎవరిపేరో ఎందుకు పెట్టారు ? అని అడిగాడు. ఈ విధంగా అతిసామాన్యంగా అప్పరు అడిగేటప్పటికి - అప్పడికి ఒకింత కోపమేకల్గింది. స్నేహితుడా! నీవు శివభక్తుడి

విగా కన్పట్టుతున్నప్పటికి వాగీశుని గూర్చి ఏమీ తెలియనట్లు కన్పడుతున్నావు. పల్లవరాజు ఆయనను ఎన్నిబాధలు పెట్టాడు. దైవకృపచే ఎలా రక్షింపబడి శైవమత వ్యాప్తికి తోడ్ప డ్డాడో తెలియదా ? రాజుగారు అతనిని బండకు కట్టించి సముద్రములో త్రోయించిన సంగతి, ఎలా బండ తేలిపోయి ఆయన సురక్షితంగా తీరము చేరాడో నీవు వినలేదా ? ఎవరు నువ్వు ? అనిఅడిగాడు.

అప్పడి గురుభక్తితత్పరతకు అప్పారు చలించిపోయాడు. అప్పడితో నేను తీవ్ర రుగ్మతకు లోనయి శివుని పాదాలనాశ్రయించిన దీనుడను. పరమశివుని కృపచే ఆ తీవ్రరుగ్మతనుండి బయటపడి శైవమతానికి తిరిగివచ్చిన అల్పుడను అని అప్పారు అన్నాడు.

అప్పారు గురించి రెండు రకముల చిత్రణలను చూడుడు. అప్పడి అప్పారు యొక్క ఘనతను ముచ్చటించాడు. అప్పారు తన లోసగుల గూర్చి చెప్పాడు.

ఈ పై మాటలు ఆ శివభక్తుని నోట వినగానే అప్పడికి అర్థమైంది. తన గురువైన అప్పారుతోనే తాను స్వయముగా మాట్లాడుతున్నదని. తన గురువే తనయెదుట సాక్షాత్క రించాడని. అప్పడి అప్పారుకు ప్రణతులనర్పించి తాను తన భార్యకలిసి అప్పారును అర్చిం చారు. తమ నుండి బిక్షను తీసికొనవలసినదిగా అర్థించాడు. అప్పారు బిక్షకు అంగీక రించాడు. అప్పడి తనయుడు తోటలోనికి అంటె ఆకులు కోసుకుని తీసికొని వచ్చుటకు వెళ్లగా పాము అతనిని కరిచింది. ఆ తనయుడు గూడ శివభక్తుడే. అమ్మ చేతిలో ఆకుల నుంచుతూ పాము సంగతి చెప్పి మరణించాడు.

అప్పడి ఇది గమనించి అతిథికి ఆతిధ్యానికి భంగము కాకుండా దుఃఖము దిగ మింగుకొని అప్పారును భోజనానికి రమ్మని పిలిచాడు. అప్పారు అప్పడికి, అప్పడి భార్యకు భస్మమిచ్చి మీ పిల్లవానిని పిలువమన్నాడు. అప్పడి - అతను రాలేని పరిస్థితిలో వున్నాడని బదులు ఇచ్చాడు. అప్పారు అప్పడిని నిజం చెప్పమని నిలవదీశాడు. అప్పడి -నిజం చెప్పాడు. అప్పారు వెంటనే అప్పడిని తన తనయుడి శవాన్ని దేవాలయం ముందరకు తెమ్మన్నాడు. అక్కడ అప్పార్ ఒక పాటలో దేవుని వినుతించాడు. ఒక అద్భుతం జరిగింది. పిల్లవాడు నిదుర నుంచి లేచినట్లుగా లేచాడు. తల్లిదండ్రులు తప్ప అందరూ సంతోషిం

చారు. తల్లి దండ్రులు అతిథి భోజనమునకు ఆలస్యమయినదని చింతించారు. అప్పారు వెంటనే కూర్చొని భోజనము చేశాడు. అప్పారు అప్పడితో కొంత కాలమున్నాడు. అప్పారు ఎడ గురు భక్తి మూలాన్ని అప్పడికి శివసాయుజ్యమొచ్చింది.

***

# 2. తిరునీలకంఠ నాయనారు

చిదంబరంలో నిరంతర శివధ్యాన తత్పరుడైన ఒక మహాభక్తు డుండేవాడు. కుమ్మరి కులంలో జన్మించాడు. అదే వృత్తిని చేబట్టి శివభక్తులను ఎంతో నమ్రతతో సేవించేవాడు. మంచి గృహస్తు. గృహస్తు ధర్మాన్ని యధావిధిగా పాటిస్తూ వచ్చిన శివభక్తులకు ఆనందముతో సేవ చేస్తూ తాను తయారుచేసిన బిక్షా (మృణ్మయ) పాత్రలను శివభక్తులకు ఉచితంగా ఇచ్చేవాడు. శివుని నీలకంఠునిగా భక్తి ప్రపత్తులతో కొలిచేవాడు. ప్రపంచం మనుటకు శివుడు హాలాహలంను మ్రింగిన వైనమును, ఆయనను కొలిచేవారికి రక్షకుడు పాపాల్నిబాపి తనలోకానికి తీసికొని వెళ్తాడని అందఱకు చెబుతూండేవాడు. సదా నీలకంఠుని నామము ఉచ్ఛరించేవాడుకాన అందఱూ అతనిని నీలకంఠనాయనారు అని పిలిచేవారు.

ఇన్ని మంచి గుణాలున్నా ఒకరోజున కామానికి వశుడై ఒక పడుపు కత్తె ఇంటికి వెళ్లాడు. ఇంటికి రాగానే అతని భార్య ఈ విషయాన్ని పసిగట్టింది. హృదయం వేధిస్తున్నా - దానిని బయటపడనీక - భర్తకు యోగ్యురాలయిన భార్యగా సేవచేస్తూనే - దాంపత్య సమాగమాన్ని మనసులోనే వెలివేసింది. నాయనారుకు ఆమె చర్యలు అర్థము కాలేదు. ఒక రోజున కోరికతో ఆమెను సమీపింపగా - ఆమె నీలకంఠుని పై ఆన పెట్టింది. "ఆయన పేరుతో మిమ్ములను అడుగుతున్నాను మమ్మల్ని తాకకండి"! . ఆమె మమ్మల్ని అని అంది కాబట్టి నీలకంఠనాయనారు లోకంలో ఏ స్త్రీని తాకకూడదని నిశ్చయించుకున్నాడు. పరమశివునిపై ఆయనకు అంత అనన్య ప్రేమ. ఈ విధంగా ఒకరినొకరు తాక కుండ జీవించటం మొదలుపెట్టారు. దీన్ని గూర్చి బయట ప్రపంచంలో ఎవరికిని తెలియ నీయలేదు. సంవత్సరాలు గడిచాయి. భార్యాభర్తలు వృద్ధులు గూడ అయ్యారు.

ఈశ్వరునికి వీరి ఔన్నత్యము లోకానికి చాటాలనిపించింది. అందుకని ఒక శివ యోగిగా రూపుదాల్చి - నీలకంఠనాయనారు ఇంటికి విచ్చేశాడు. నీలకంఠారు సాదరము గా తన వీటిలోనికి ఆహ్వానించాడు. సపర్యలు చేశాడు. యోగి ఒక బిక్షాపాత్రను నీలకం ఠనాయనారునకు ఇచ్చి "నేను మఱలి వచ్చువరకు దీన్ని సురక్షితంగా వుంచండి. నాకు ఇది అత్యంత విలువైనది.దీన్ని తగులటయే తరువాయి అన్ని వస్తువులు పవిత్రమవుతాయి. అందుకని జాగ్రత్తగా కాపాడవలసినది" అంటూ శివయోగి వెళ్లిపోయాడు. నీలకంఠారు దాన్ని జాగ్రత్తగా దాచాడు.

చాలకాలమైన తర్వాత ఒక రోజున శివయోగి తిరిగివచ్చి నీలకంఠారును ఆ భిక్షా పాత్ర గూర్చి అడిగాడు. శివయోగి దాన్ని మాయంచేసి ఆ పాత్రను తెచ్చి ఇమ్మని నీలకంఠా రును అడిగాడు. నీలకంఠార్ అంతా వెదికాడు. ఆ పాత్ర ఎచ్చటను కన్పింపలేదు. అది మా యగావుంది. సిగ్గుపడి పోయాడు. భయంతో వణకుతూ శివయోగి పాదాలపై బడ్డాడు. ఆ పాత్ర ఎచ్చటనూ కన్పింపలేదు అని వాపోయాడు.యోగికి విపరీతంగా కోపం వచ్చింది. నీలకంఠారును -నీవు దొంగవని, మోసకారివని నిందించాడు. నీలకంఠార్ ఆ పాత్ర కన్న విలువైన పాత్ర ఇస్తానన్నాడు. శివయోగి ఒప్పకొనలేదు.

పదే పదే శివయోగికి -"తాను ఆ పాత్ర ను దొంగి లించలేదని, ఏదోమాయగా అది కన్పించటం లేదని, అది ఎట్లా మాయమైందో తనకు అర్థం కావటం లేదని" చెప్పా డు. శివయోగి "నీవు చెప్పేది నిజమైతే నీభార్య చేయిపట్టుకొని ప్రమాణం చేయుమని" అడిగాడు. నీలకంఠునిపైన ఆనపెట్టాడుకాన నీలకంఠారుదానికి అంగీకరించలేదు. "అత ని అనంగీకారం నీలకంఠారు దోషాన్ని చూపుతున్నదని" శివయోగి అన్నాడు. అందుకని దొంగతనం నేరంపై న్యాయస్థానానికి తీసికొని వెళ్లాడు. శివయోగి చెప్పినట్లుగా ప్రమా ణం చేయవలసినదనిగా ఆజ్ఞాపించారు. నీలకంఠారు తను, తన భార్య ఒక కఱ్ఱను ఇద్ద రు చెరి యొక కొనను పట్టుకొని చెఱువులో మునుగబోయారు. యోగి వీరిరువురు చేయిని బట్టికాక కఱ్ఱను పట్టుకొని మునుగుటకు వీలులేదన్నాడు. నిజం నిరూపణ కొఱ కు ఒకరి చేయినొకరు పట్టుకొని నీటమునగాలని ఆదేశించారు. నీలకంఠారు తన ఆన గూర్చి ఇక నిజందాచ లేకపోయాడు. భార్యా భర్తల మధ్య జరిగినది, దేమునిమీద ఆన గూర్చి వెల్లడించి తాను తన భార్య చేయిని తాక జాలనని విన్నవించాడు. ఇలా చెప్పి ఇద్ద రు కఱ్ఱను చెరి ఒక కొనను పట్టుకొని నీటమునిగారు. ఒక విచిత్రం జర్గింది. ఇద్దరూ

నీటమునిగి బయటకు లేవగానే - వారిద్దరు రూపసులైన యవ్వన వంతులుగా మారి పోతారు. శివయోగి అంతర్ధాన మయ్యాడు. పార్వతీపరమేశ్వరులు అచట సాక్షాత్కరించారు. "మీరు అత్యంత సంయమనముతో, భక్తితో జీవనం జరిపిన పుణ్య విశేషంచే మీరిద్దరు నిరంతరం యవ్వన వంతులుగా నాలోకంలో శాశ్వతంగా నివసించండి" అని వారిని తమ లోకానికి తీసికొని పోయారు. శివభక్తి తత్పరత, సంయమము, నిర్మల జీవనము ఎలా, పరమశివుని యొక్క శాశ్వత స్థానానికి చేర్చగలవో పరమశివుడు లోకానికి వెల్లడించాడు. పరమశివునిపై అనన్య భక్తి నీలకంఠారును చెడుపనులనుండి చెడుతలపులనుండి వైముఖ్యత కల్గించి సచ్చరిత్రులుగా వారిని నిలబెట్టి అంత్యమున వారికి శివసాయుజ్యము కలుగుటకు కారణభూతమైంది.

****

## 30. తిరుమూలనాయనారు

శైవసిద్ధ పురుషులలో తిరుమూల నాయనారు ఒకరు. తిరునందిదేవారు ఎని మిది మంది శిష్యులలో ఈయనొకరు. వారందరు యోగులే. మూలాన్ శరీరములో పర కాయ ప్రవేశము చేసినందున తిరుమూలారు అయినాడు.

పోతియా పర్వపంక్తులలో వున్న అగస్త్య మహామునిని చూచుటకై కైలాసము నుండి తిరుమూలారు దక్షిణ దిశకు బయలుదేరాడు. త్రోవలో అనేక శివస్థలములను సందర్శించి తిరువాదూతురాయి చేరాడు. అక్కడ కావేరి నదిలో స్నానముచేసి దేవాల యమునకు వెళ్లాడు. దేవళము చుట్టూ రెండుసార్లు ప్రదక్షిణము చేసి, దేవునికొలిచాడు. కావేరీనది ఒడ్డున నడిచి వెళ్తుండగా అక్కడ ఆవులమంద విచారముగా కన్నులనీరు కారుస్తూ కనబడింది. దానికి కారణము తెలిసికొన్నాడు. ఆ ఆవులకాపరి చనిపోయియు న్నాడు. తిరుమూలారు ఆవులను దుఃఖవిముక్తులను చేయ తన శరీరమును ఒక చెట్టు తొర్రలో దాచి ఆ ఆవులకాపరి శరీరములో పరకాయ ప్రవేశము చేశాడు. జీవించియు న్నట్లు లేవగానే ఆవులు గంతులేశాయి. గ్రామంలోనికి వానిని తోలుకెళ్లాడు. మూలాను ఇంటికి చేరాడు కాని పశువుల కాపరి భార్యకు భర్త కాలేకపోయాడు."నేను నీ భర్తను కాను.శివుని ఆరాధించు. విముక్తిని పొందు" అని పశువుల కాపరి భార్యతో చెప్పాడు. భార్యకు ఇది విడ్డూరముగా తోచి పెద్దల ముందు ఈ విషయముంచింది. వారు ఆమె భర్త అనబడు తిరుమూలారును అనేక విధముల శోధించారు. అతనిలో ఆధ్యాత్మికముగ పెద్దమార్పు వచ్చింది - అందుకని భార్యను అతను దూరముగా వుండమన్నారు. మరు నాడు తిరుమూలారు ఆవులను తోలుకొనివెళ్లి తన శరీరానికై చూచాడు అది కనిపించ లేదు. ఇదంతా పరమేశ్వరుని లీల. తిరుమూలారు దైవ నిర్దేశాన్ని అర్థం చేసికొన్నాడు. తిరువాదూతురాయికి తిరిగి వచ్చాడు. దగ్గరవున్న రావి వృక్షము కింద తీవ్ర తపస్సు చేశాడు. సమాధి స్థితిలో 3వేల సంవత్సరములున్నాడు. ప్రతి సంవత్సరము సమాధి

నుండి బయటపడి ఒక పద్యాన్ని చెప్పేవాడు. అలా మూడు వేల సంవత్సరాలలో మూడు వేల పద్యాలు చెప్పాడు. ఈ గ్రంథాన్ని తిరుమందిరము అని పిలుస్తారు.

పరమేశ్వరుని సంకల్పము సిద్ధించింది. తిరుమూలారు తిరిగి కైలాసము చేరాడు.

***

# 27. నామినందిఅడిగళ్

చోళరాజ్యంలో ఏమాపెరూరు (ఇప్పుడు తిరుమప్పత్రు లేక నైప్పెరు) గ్రామంలో ఒక బ్రాహ్మణ కుటుంబములో నామినంది ఆడిగళ్ జనన మొందాడు. ఈవూరు నుంచి తిరువారూరునకు 2 గంటల నడకదూరముంది. పరమశివుడే నామినంది రక్షకుడు. ప్రతిదినము తిరువారూరు వెళ్లి శివుని అర్చించి వచ్చేవాడు. మనుష్యునకు పరమశివుని పాదకమలముల పూజయే సార్థకత నిస్తుందని తలచేవాడు. ఒక రోజున తిరువారూరు శివునికి ఏ విధమైన  అర్చన చేసిన బాగుండునో నని ఆలోచిస్తే దేవునికి దీపారాధన ఉత్కృష్టమైన దనిపించింది.

సూర్యుడస్తమించబోతున్నాడు. పట్టణంలోనికి వెళ్లి దీపారాధనకు నెయ్యి తీసుకు రావటానికి జాగవుతుందని తోచింది. అందుకని దగ్గరలో నున్న ఇంటికి వెళ్లి శివునికి దీపారాధనకు కొంచెం నేయి ఇమ్మని ప్రార్థించాడు. అతనికి తెలియదు అది శివారాధన కువ్యతిరేకులయిన జైనుల ఇల్లని. వారు ఇతనిని హేళన చేశారు. చేతిలో అగ్నివుంచు కొన్న పరమశివునికి దీపం సూర్యుని ముందు దివిటీ అని వెక్కిరించి, నీవు దీపాలు వెలిగించదలుచుకుంటే నీళ్లతో దీపాలను వెలిగించమని మొరటుగా జవాబిచ్చారు. ఈ మాటలువినగానే నంది అడిగళ్కు చిన్నతనమనిపించింది. హృదయావేదన కలి గింది. దుఃఖిస్తూ గుడిలోనికి వెళ్లి దేవుని పాదాలమీద పడ్డాడు. దేవుని హృదయ విదార కంగా ప్రార్థించాడు. ఇంతలో ఒక వాణి వినిపించింది. నీరు తెచ్చి ఆ నీటితో దీపాలు వెలి గించుఅన్న మాటలు వినబడ్డాయి. పరమానంద భరితుడై నామినంది అడిగళ్, నీళ్లతో దీపాలన్నీవెలిగించాడు.ఈ అద్భుతాన్ని చూచి వెక్కిరించిన జైనులందరూ ఆశ్చర్య చకితుల య్యారు.నంది అడికళ్ - ఇలా - చాలరోజులు దీపాలను వెలిగించాడు. ఈ అద్భుతాలతో చాలమంది జైనులు శైవులయ్యారు.

చోళరాజు నంది అదిగళ్ గూర్చి చాలగొప్పగా విన్నాడు. విని అతనిని ఆ ఆలయా

నికి అధికారిగా నియమించాడు. రాజు దేవునికి పంగుణి ఉత్తరం పండుగను ఘనంగా జరిపేవాడు. గంగ శిరసున ధరించిన శివుని మాటలుగ ఆపని చేయ నిశ్చయించి తన కలశంలో అంతటా నీరును నింపి దీపారాధన కుందిలో ఆ నీరు పోసి వత్తివేసి వెలిగించాడు. వత్తి దేదీప్యమానంగా వెలిగింది. అవిచూచి ఆ నీరుతో దేవాలయంలోని దీపాల నన్నిటిని వెలిగించాడు. జ్యోతులు ప్రజ్వరిల్లినవి. దేవుని వూరేగిస్తూ తిరుమనాలికి తీసి కొని వెళ్లేవారు. అక్కడ అన్ని కులాలవారు చుట్టూ మూగి ఆయనను అర్చించేవారు. అలాజరిగిన ఒక రోజున నామినంది దేవాలయం పనులన్నీ పూర్తయాక ఇంటికి వచ్చాడు. తిరుమనాలిలో అన్నికూలాల వారినిముట్టుకొని వచ్చానని. అందుచే అపవి త్రుడయిన ట్లుగా భావించి ఇంటిలోనికి వెళ్లి దేవుని అర్చింపకుండ నిద్రకుపక్రమించాడు. తన భార్యను  పిలిచి స్నానానికి నీళ్లు తెప్పించి  స్నానముచేసి ఇంట్లోకి వెళ్దా మనుకున్నాడు. కాని చాల అలసిపోవటంతో నిద్ర ముంచుకువచ్చింది. కలలో శివుడు కన్పించి అతనితోఇలా అన్నాడు. 'నందీ! తిరువావూరు లో పుట్టిన వాళ్లంతా నా గణాలే (నా సేవకులే)వాళ్లని నీవు అపవిత్రంగా భావించకూడదు ఇది నువ్వే నీకళ్లతో చూస్తావు అన్నాడు.నంది అడిగళ్ నిద్ర లేచాడు. ఇదంతా భార్యకు చెప్పాడు. తనలోని చెడ్డ తలంపుకు విచారించాడు. వెంటనే ఇంట్లోకి వెళ్లి దేవుని అర్చించాడు. మరునాటి వేకువన తిరువారూరువెళ్లాడు. అక్కడ అతనికి అంతా శివమయంగా కన్పించింది.అక్కడ పుట్టిన వాళ్లంతా శివులుగా కన్పట్టారు. అందరూ శివరూపంలోనే వున్నారు. ఇదంతా పరమేశ్వరుని లీల అని నంది గ్రహించాడు.

నంది అడిగళ్ తిరువావూరును స్థిరనివాసంచేసికొన్నాడు. అచ్చట శివుని, శివభక్తులను నిష్ఠతో కొలిచేవాడు. అతని భక్తి తత్పరతను చూచి అందరూ అనిపోన్ (మేలిమి బంగారము) అనిపిలిచేవారు. అంత్యమున శివసాయుజ్యమును పొందినాడు.

****

# 28. తిరుజ్ఞాన సంబంధారు

చోళదేశంలో సర్కాలి (శియ్యాళి) అను దివ్యదేశముంది. ఆ వూరిలో శివపాద హృదయుడు, భగవతి అనే నిష్ఠాగరిష్టులయిన శివభక్తులగు బ్రాహ్మణ దంపతులుండే వారు. జైనమత ప్రాబల్యం హెచ్చుగా నున్న ఆరోజుల్లో శివపాదదంపతులు మొక్కవోని ధైర్యముతో శైవ మతావలంబీకులు గానే వుండిపోయారు. వీరికి చాలకాలము సంతా నము కలుగలేదు. శైవుల బాధ భరించలేనిదయింది. అందుకని శివపాద దంపతులు వంశోద్ధరణకే కాకుండ జైనమత ప్రాబల్యమును అణచి, శైవమతవ్యాప్తికి తోడ్పడగల సమర్థుడైనపుత్రుని తమకు అనుగ్రహించమని ద్రోణేశ్వరుని బృహినాయుకను కొలువ సాగారు. పార్వతీ పరమేశ్వరుల పరమ అనుగ్రహఫలితముగా రవి, ఇతరతారలు ఉచ్ఛద శలో నుండగా ఒక మంచి శోభనముహూర్తమున కుమారుడు కలిగాడు.

ఆ శిశువు పరమశివుడు తనను భూలోకమున పుట్టించినందులకు మరల జన్మనుద్దేశించి నందులకు మిగులవగచువాడు. అందరూ ఆ ఏడుపును బాల్య చేష్టగా భావించెడివారు. ఇంకాపాలు త్రాగే వయసు మాటలుగూడ సరిగారాని వయసు. మూడేళ్ల వయస్కుడయిన బాలునితో ఒక రోజున తల్లిదండ్రులు తటాకమున స్నానము చేయుటకై వెళ్లారు. తీరమున బాలుడిని పరుండ బెట్టి వాళ్లు స్నానమునకు తటాక ములో దిగారు.

పూర్వజన్మజ్ఞాపకమో - బాలుడు పరుండి శిఖరమువంక చూస్తూ - శివవి యోగం భరించలేక ఏడ్వటం మొదలుపెట్టాడు. అవి చూచి సహించలేక పరమేశ్వ రుడు పార్వతీ దేవితో సహావచ్చి, పార్వతిని తన స్తన్యమును బంగారు కప్పలో నింపి బాలుని కీయమన్నాడు. పార్వతీదేవి శివకరుణను జ్ఞానమును తన పాలలో అమృతము రంగరించినట్లుగా జోడించి, బాలునికి కళ్లుతుడిచి పాలిచ్చినది.

శేక్కిజారు - ఈ బాలుడు కారణ జన్ముడుగా జన్మించాడని, ఈ విధంగా పేర్కొన్నాడు. శివభక్తుల హృదయములు - ఎనిమిది దిక్కులు సప్తసముద్రములు ఆనందముతో వెల్లి

విరియునట్లు, తమిళభాష దక్షిణదేశముమిగతాప్రాంతములభాషలకన్న ప్రపంచదేశాల భాషలకన్న మిన్నయౌనట్లుగా చేయుటకై తమిళవాఙ్మయము, సంస్కృతి వివిధ దేశ ముల భాషలవాఙ్మయముసంస్కృతిలకన్న మిన్నగా,అన్ని కళలు వృద్ధినొంది అన్ని వీధులు జవము, జీవముతో భాగ్యవంతమగునట్లుగా శైవమతము, వేదాంతము పరిఢవిల్లజేయ - శివకుమారుడు భువిని జన్మించి అలూదయై పిళ్లైయారు అయ్యాడు. శివజ్ఞానం పొం దినందున శివజ్ఞానసంబంధారుగూడ అయ్యాడు. ఈశ్వరకోటిఅయ్యాడు.

ఇంతలో శివపాదుడు బాలుని కడకు వచ్చాడు. బాలుని చేతిలో బంగారు కప్పను, శిశువు మూతిమీద పాలచారలను చూసి సహజముగా తాను సాంప్రదాయ బద్ధుడ గుటచే - పరులపాలను త్రాగుట అపవిత్రముగ తోచి బాలునిచూచి! నీకిప్పడు పాలనెవ రిచ్చారని ఓ విధంగా గద్దించాడు. బాలుడు వ్రేలితో పైకిజూపగా నచ్చట వేదములు పర్య వేక్షించి యుండగా పార్వతీపరమేశ్వరులు వృషభవాహనారూఢులై యున్నారు.

మాటలు గూడ సరిగారాని ఆ మూడేండ్ల బాలుడు జగత్తుకే తల్లిదండ్రులగు పార్వతీ పరమేశ్వరులను వేలెత్తి చూపుచూ ఒక కాలు నాట్య భంగిమన పైకి ఎత్తి ఇలా అన్నాడు.

ఒక చెవిన తాటంకము నుంచుకొని పార్వతితో వృషభారూఢుడై శీర్షమున చంద్రునితో , ఒడలు విభూతితో పరిఢవిల్లుతున్న ఆ పార్వతీపరమేశ్వరులను చూడండి. అని అనర్ఘకవితాధారలతో వృత్తరూపమున పార్వతీపరమేశ్వరుల గూర్చి పదకొండు వృత్త ములలో నుతించాడు. ఈ వృత్తములను తేవారములంటారు.

జగన్మాత క్షీరముత్రాగి పరమేశ్వరుని అపారకృపావిశేషము జ్ఞానము పొందినం దున మూడేండ్ల బాలుడు పుంభావ సరస్వతియైనాడు. జ్ఞానసంబంధారు అయ్యాడు.

పార్వతీపరమేశ్వరుల నుతితో దేవతలు పుష్పవృష్టి గురిపించారు. బాలునకు జ్ఞాన సంబంధమూర్తి అని పేరు వచ్చింది. పార్వతీపరమేశ్వరులు ద్రోణికి వెళ్లారు. శివపాదుడు పార్వతీపరమేశ్వరులను నుతిస్తూ జ్ఞాన సంబంధమూర్తి నాయనారును ఎత్తుకొని, ఆ

వెనుక బయలుదేరాడు.

బాలునెత్తుకొని తల్లిదండ్రులు ఆనందభరితులై ప్రజలందరితో వూరేగింపుగా వెళ్లారు. మరునాడు సంబంధారు తిరుక్కోలకలో ఒక వృత్తమును, మృదువైన చేతులతో తాళం వేస్తూ తాళమున కనుగుణముగా పాడాడు. పరమశివుడు ముచ్చటపడ్డాడు. సంబంధులు తమ కోమల కరములతో తాళము వేస్తుంటే అవి కమిలిపోవునని పరమ శివుడు చిన్నారి హస్తములలో బంగారు తాళద్వయమును ఉంచాడు. ఆ తాళములపై "ఓం నమః శ్శివాయ" అను అక్షరములు లిఖించబడ్డాయి. తన గానమునకు అనుకూల ముగా తాళము వేయుటకు పరమ శివుడు అనుగ్రహించిన స్వర్ణతాళములను బాలుడు భక్తితో తన శిరమున ధరించినట్లుగా ప్రణతుల నర్పించాడు. లయబద్ధముగా స్వర్ణతాళ ములతో జ్ఞానసంబంధారు శివసంకీర్తనకు నారదాది మహామునులు, దేవతలు సమ్మో హితులయ్యారు.

సంబంధారు తీర్థయాత్రకై బయలు దేరాడు. ఒక రోజున - తన యాజ్ (వీణ) పై శివుని ఎల్లప్పుడు నుతించుచుండు తిరునీలకంఠయాజ్ పనారు, సంబంధారును కలు సుకున్నాడు. ఇద్దరు దేవాలయములో ప్రవేశించారు. సంబంధారు యాజ్ పనారును తన యాజ్ పై పాడమని కోరాడు. అతను అద్భుతముగా యాజ్ పై పాడాడు. ఆ పాటకు సంబంధారు హృదయము ద్రవించింది. యాజ్ పనారు సంబంధారుతోనే ఉండి , తను యాజ్ వాయింస్తుండగా సంబంధారు పాటలు పాడవలయునని తన అభిలాషను యాజ్పనారు తెలిపాడు. సంబంధారు అంగీకరించాడు.

తీర్థ యాత్రలో సంబంధారు చిదంబరము చేరాడు. నటరాజస్వామిని చూడగానే పరవశించి పోయాడు. తిల్లై లోని (చిదంబరం) బ్రాహ్మణులు ఆ దేవుని గూర్చి ఘనంగా చెప్పారు. సంబంధారుకు ఆ బ్రాహ్మణులంతా శివగణాలుగా కన్పడ్డారు. ఈ దృశ్యము యాజ్ పనారుకు చూపాడు. ఇద్దరికి అద్భుతంగా తోచింది. బ్రాహ్మణులు సంబంధారు కాళ్లకు మ్రొక్కారు. వారు ఆపని చేయబోతుండగా తానే వాళ్ల కాళ్లకు మ్రొక్కాడు.

యాజ్ పనారు జన్మస్థలం చూచిన తర్వాత - సంబంధారుకు తిరు ఆరతూ రాయి వెళ్ళాలని కోర్కె కలిగింది. కొంత దూరము తన చిన్ని పాదాలతో నడిచేవాడు. కొంత దూరము తండ్రి సంబంధారును తన భుజంపై పెట్టుకుని నడిచేవాడు. ఈ విధంగా వారు మారన్‌పాడి చేరారు. ఎండకి , నడక ప్రయాణానికి అలసి పోయారు. ఆ రాత్రికి అచ్చట బస చేశారు.

పరమశివుడు శిశువుకు బాధ కలిగించకూడదనుకున్నాడు. తిరు ఆరతూరాయి బ్రాహ్మణులకు కలలో కన్పించి - వాళ్ళ కొక ముత్యాలపల్లకి,  ముత్యాల గొడుగు ఉన్నదని సంబంధారుకు ఆ ఛత్రమును బట్టి పల్లకిలో ఎక్కించుకొని రమ్మని ఆదేశించాడు. సం బంధారు కూడ అలాగే కనపడి ఆ ముత్యాల పల్లకి ఎక్కి తిరు ఆరతూరాయి రమ్మన్నాడు. సంబంధారు దగ్గరకు శివుడు అనుగ్రహించిన ముత్యాల పల్లకి, ఛత్రము తేబడినవి. సంబంధారు, ముందర పల్లకిని , ఛత్రమును అర్చించి తర్వాత పల్లకిని అధిరోహించాడు. దేవుని సందర్శించాడు. ఈ సంఘటనతో జ్ఞానసంబంధులవారు ఆచార్య పీఠము నధిరో హించిరని సర్వులు అంగీకరించిరి. ఆశ్రితులైరి.

త్రోవలో చాలా దేవళములను సందర్శిస్తూ, సంబంధారు తిరిగి తన పూరు సర్కా లికి చేరాడు. అచ్చట అతనికి తల్లిదండ్రులు ఉపనయనము చేశారు. బ్రాహ్మణులు పిల్లవా నికి వేదములు చెప్పటకు ఉపక్రమించారు. వారుచెప్పటకు ప్రారంభించగానే - వారికి ఆ వేదాలు అన్ని అప్ప జెప్పాడు.ఇదంతా పూర్వజన్మ కర్మ విశేషము. పార్వతీ పరమేశ్వరుల, పార్వతీ దేవి స్తన్యము అనుగ్రహము. సంబంధారు వాళ్ళకి పంచాక్షరీ సారాన్ని చెప్పి ఒక పదిగము పాడాడు.

నిదురకాని నిదురలో గూడ

అర్ధముతో హృదయము ద్రవింప

అనుదినము మననము

చేయుమది పంచాక్షరి

మార్కండేయుని ప్రాణము గొనవచ్చిన

జముని గూడ తన్నివైచినది.

అతనికి గూడ ఒణుకు గొల్పినది.

జముని , నమ్రతతో శివుని

పాదముల ప్రణమిల్ల జేసినది

ఈ సమయంలోనే తిరునవుకరసు గూడ సంబంధారును కలుసుకొనుట తటస్థించినది.

మళ్ళీ తీర్థయాత్రకు బయలుదేరి తిరుపచిలాశ్రమము చేరారు. అక్కడ పరమ శివ భక్తుడైన మాళవరాజతనయ - నయముకాని వ్యాధితో బాధపడుతోంది. రాజుగారు ఆశ వదులుకొని, ఆమెని తీసుకొనివెళ్ళి దేవుని ముందుంచాడు. ఆ సమయానికే సంబం ధారు అక్కడకు వచ్చి చేరాడు. రాజుగారి , అక్కడున్నవారి బెంబేలుతనము చూసి , ఆ రాజతనయ మగతగా నుండుట చూసి - ఆమెను రక్షించమని సంబంధారు ఒక పదిగమును పాడాడు. ఆమె వెంటనే అందరు ఆశ్చర్యపోవునట్లుగా , వ్యాధి నయమై లేచికూర్చుంది. ఈ అద్భుతానికి అందరూ మురిసిపోయారు.

సెంకున్రూరు లో (కొండమీద చెంగునూరు) ప్రజలందరు జ్వరముతో చలి ఎక్కు వగా నుండి బాధపడుచుండుట చూచి వాళ్ళ బాధ నివారణమునకు వృత్త జాలములతో శివుని నుతించి వారి బెడదను బాపినాడు.

ఈ యాత్రలో వారు తిరువాదూతురాయి చేరారు. తండ్రి ఒక మహా యజ్ఞము జరుప నిశ్చయించాడు. దానికి చాలా ధనము కావలసి వచ్చింది. దేవళమునకు వెళ్ళి దేవుని నుతింపగా శివగణములోని ఒకడు వచ్చి ఒక ధనపు సంచినిచ్చాడు. అందులో సహస్ర సువర్ణ నాణెములున్నాయి. పరమశివుడు దానిని యిచ్చినారు. సంబంధారు దేవుని నుతించి ఆ ధనపు సంచిని తండ్రికిచ్చాడు. దానిని తీసుకొని సర్కాలి వెళ్ళి ఆ యజ్ఞమును తండ్రి పూర్తిచేశాడు.

యజపనారు తల్లి పుట్టినిల్లయిన ధర్మ పురంలో యజపనారు వీణ వాయిద్యము గురించి అందరు పొగిడారు. యజపనారు ఇదంతా సంబంధారు కృపయే.ఆయనను అనుసరించి వెళ్లుట మూలాన అమృతమయంగా వీనుల విందుగా ఆ వాద్యము సాగి నదని , అంతా సంబంధారు పడిగముల మహిమేనని చెప్పాడు. ఈ మాటలు నిజమని నిరూపించటానికి సంబంధారు గణేషును గూర్చి పడిగమును పాడాడు. ఆ కృతిని యజ పనారు వీణమీద పలికించలేకపోయాడు. యజపనారుకు చిన్నతనముగా తోచి ఆ వీణి యను ముక్కలు చేయ ప్రయత్నించాడు. సంబంధారు అతనిని వారించి దేవుడు తనకి చ్చిన వైభవముతో సంతృప్తి నందమని బుజ్జగించాడు. మధుర దేవుడు భక్తుల కలలో కన్పించి యజపనారును గర్భగుడిలోనికి తీసుకొని వచ్చి పాడించమని నిర్దేశించడం, యజపనారు అటుల పాడుట పైగా (61) తడినేల తగిలితే యాజ్ పాడవుతుందని అం దుకని యజపనారుకు దేవుడు బంగారు ఆసనము వేయించి దానిమీద అతనిచేత పాడించుకోవటం అన్ని గుర్తుచేసి దేవుని కృపకు సంతృప్తి నొందమని యజపనారు వీణను భగ్నముచేయ తలంపు  నుండి విరమింపజేశాడు.

తర్వాత సత్తిమంగాయి వెళ్ళాడు. అక్కడ తిరునీలకంఠ నాయనారు ఈయనకు ఆప్యాయంగా భక్తితో స్వాగతం చెప్పాడు. సంబంధారు ఒక వృత్తమును పాడి నీలకంఠనా యనారును ఆహ్లాదపరిచాడు. ఉన్నతుల ప్రవర్తనే యిది. వారి శివభక్తుల మీద శివుని కన్న నెక్కువ భక్తి శ్రద్ధలు చూపుతారు. మానవులుగా గాక వారు కూడ అపరశివమూర్తు లను గానే ఎంచి వారి ఎడ భక్తి శ్రద్ధలు చూపుతారు.

అక్కడి వున్నని రోజులు - సంబంధారు ప్రతిదినము తిరుమరుగల్ దర్శించి అచ్చట దేవుని అర్చించేవాడు. ఒక రోజున ఒక వ్యాపారి తన భార్యతో గూడ అక్కడకు వచ్చాడు. దంపతులు నిదురపోతుండగా భర్తని ఒక పాము కాటువేసింది. అతను మృతి నొందాడు. వైద్యులు ఏమీ చేయలేకపోయారు. భార్య దేవుని గూర్చి ప్రార్థించింది. దేవుని కరుణ చూపుమని , భర్తకు బ్రతికించమని వేడుకొంది ఆ సమయాన్నే సంబంధారు

అచ్చటికి విచ్చేశాడు. సంబంధారు ఆమెను ఓదార్చి ఏడుపుకు కారణమడిగాడు. ఆయ నకు జరిగింది చెప్పింది. సంబంధారు ఒక వృత్తము పాడాడు. ఆ వణిజుడు వెంటనే బ్రతికాడు. అందరూ సంబంధారుకు మ్రొక్కి అర్చించారు.

సిరుతొండారు అభ్యర్థనపై చెంకటన్కుడి దేవుని చూచి ఆయన దర్శనాన్ని కోరాడు. అక్కడ దేవుని అర్చించి వెళుతుండగా దేవుడు అక్కడున్న రూపంలో నిజరూప దర్శనమిచ్చాడు. త్రోవలో తిరుపూకలూరు దర్శించి మురుగ నాయనారు అతిథిగా నుండి ఆయనను కొన్ని వృత్తములతో కీర్తించాడు.

అప్పరు సూచన మేరకు సంబంధారు తిరువావూరు వెళ్లి దైవమును త్యాగీశుని దర్శించాడు. మురుగ నాయనారుతో అప్పరు, సంబంధారు కొంత కాలము గడిపారు. అక్కడి నుండి కడవూరు వెళ్లి గుగ్గలు కలశ నాయనారు ను కలిసికొని - గుగ్గలు కలశ నాయనారు వైభవమును కీర్తించాడు. అక్కడి నుండి ఇద్దరు తిరువీలిమిళు గ్రామానికి వచ్చారు. అక్కడ సర్కాలి నుండి వచ్చిన బ్రాహ్మణులు, సంబంధారును సర్కాలి వచ్చి అక్కడ దైవము తోనియప్పారును చూడవలసినదని ప్రార్థించారు. మరునాడు ప్రొద్దున సంబంధారు దేవాలయమునకు అర్చనకు వెళ్ళగా అచ్చట తన ముందు తోనియ ప్పారే ఆసీనులై యున్నట్లుగా చూచాడు. ఆయనను కొన్ని పడిగములతో స్తుతించాడు. సర్కాలీ బ్రాహ్మణులకు తొలియప్పారును ఇక్కడనే చూసినట్లుగా తెల్పి వారిని పంపివే శాడు. ఈ గ్రామములోనే మరికొంత కాలము సంబంధారు , అప్పారు ఉండవలసిన అగత్య మేర్పడింది. అచ్చట ఘోరమైన క్షామము సంభవించింది.

జన సామాన్యమేగాక శివభక్తులు గూడ చనిపో సాగిరి. నాయనారు లిరువురు ఈ ఘోరకలి చూసి చలించిపోయి స్వామి సన్నిధికి పోయి ప్రార్థించిరి. శివుడు దర్శన మిచ్చి క్షామము పోవునంతవరకు నేను చెరిఒక సువర్ణ మిచ్చెదను పోయి వారి ఆర్తిని తీర్చండి అని చెప్పాడు. అప్పారుకు పడమటి బలిపీఠమునందు సంబంధారుకు తూర్పు బలిపీఠమునందు చెరి ఒక సువర్ణ నాణెము కనిపించింది. అప్పారు తనకు లభ్యమైన

నాణెముతో వస్తువులను కొనుగోలు చేసి భక్తులకు సహాయ భూతుడయ్యెను కాని సంబంధారు వెంటనే సాయము చేయలేకపోయాడు. సంబంధారు నాణెములో కొం చెము నాణ్యత తగ్గినట్లు కన్పించింది. సంబంధారు గాఢ భక్తి తన భక్తిని అతిక్రమిం చిందని భావించాడు. అందుకని దేవుని గూర్చి ఒక వృత్తము పాడాడు. సంబంధారు నాణెము గూడ మేలిమైనది. వస్తువులను కొని బాధార్తులను ఆదుకోగలిగాడు.

కొన్ని దినములకు క్షామము తొలగినది. నాయనారు లిరువురు వివిధ శివ క్షేత్ర ములను సందర్శించుచు తిరమరైక్కాడు ( వేదారణ్యము) నకు వచ్చారు. వేదారణ్య స్వామికి పూర్వము ప్రవేశద్వారమున వేదముల నర్చించెడి వారు. కాలవశమున ఆ అర్చన, పఠనము ఆగిపోయినది. ఆ ప్రవేశ ద్వారము మూసుకొని పోయినది. భక్తులు మరియొక ద్వారము నేర్పాటు చేసుకొన్నారు. సంబంధారు అది చూచి ఈ ద్వారము తెరువబడునట్లు వృత్తములను వినుతింపమని అప్పారును కోరెను. అప్పారు (వాగీశుడు) పాడగా పూర్వపు ప్రవేశద్వారము తలుపులు అవంతట తెరువబడినవి. సేవ ముగించి వారిరువురును ఈవలకు వచ్చిరి. ఇప్పుడు అప్పారు సంబంధారును తలుపులు మూయబడునట్లు ప్రార్థింపవలసినదిగా కోరెను. సంబంధుడు వృత్త జాలముతో విను తింపగా ద్వారము మూసికొనిపోయినది. అచ్చట నున్న భక్తులందరు వారిరువురు కైలాసమునుండి వచ్చిన మహానుభావులని తలచారు.

వాగీశుడు (అప్పారు) సంబంధారు ఒకరినొకరు పొగడు కొనుచు నిదురించారు. నిదురలో స్వప్నమున దేవుడు సాక్షాత్కరించి “నా దర్శనము తిరువామూరున నగును” అని చెప్పాడు. అప్పారు అట్లు కాదు ఆగుము అని ప్రార్థించాడు. స్వామి నిలిచి సేవనందు కున్నాడు. సంబంధుడు కూడా సేవలను చేశాడు. మరునాడు ఇరువురు తిరువామూరు వెళ్ళి అక్కడ దర్శనమంది మరల వేదారణ్యమునకు వచ్చారు.

మధురలో జైనుల ప్రాబల్యము అధికముగాజొచ్చింది. పాండ్య భూపతి జైనమ

తము స్వీకరించాడు. అందరూ జైనమతమును స్వీకరించాల్సిన పరిస్థితి ఏర్పడింది. రాణి మంగయార్ కరసియారు , మంత్రి కులాచ్చిరాయి నాయనారు ఈ ఇరువురు మాత్రమే జైనుల ప్రాబల్యమునకు లోనుగానిది. శైవ మత గుర్తులు బాహ్యమునకు చూపించక పోయినా, మనసా వారు స్థిరశివభక్తులు. రాజు మనసు త్రిప్పాలని తలచారు. సంబం ధారుగూర్చి విన్నారు. వారి శక్తులను వారు సాక్షాత్ శివస్వరూపులుగను , శివకుమారు లుగను తెలిసి కొన్నారు. వారొక్కరే మధురలోని బెడద నివారించగలరని వారు శైవమ తోద్ధరణకైఅవతరించారని - సంబంధారును ప్రార్థించి మధురకు తీసుకొని రావలసి నదిగా రాయబారులను పంపారు. వాగీశుడు, సంబంధారు ప్రయాణమైరి. కానీ వాగీ శుడు "మహాశయా మీరు వయసున బాలురవై యున్నారు. జైనులు కడు దుర్మార్గులు. మీకు అపకారము తలపెట్టెదరు. వారి వలన మీకు ఏమి కీడు మూడునో అని సంశ యించుచున్నాను. మీరు వెళ్ళ వలదు" అని ప్రాధేయపడెను. సంబంధుడు పరమ శివుని అనుగ్రహము ఉన్నంత వరకు ఎట్టి ఆపద మనలను సమీపించజాలదు. మీరు ఈ చోళ దేశమునందే యుండుడు. నేను అంతయు చక్కజేసి తిరిగి వచ్చెదను. అని చెప్పి వాగీశుని అచ్చటనే నిలిపివేసి వేదారణ్యేశ్వరుని ఒక మారుసేవించి పడిగములను పాడి - మధురకు బయలుదేరి వెళ్ళినాడు. అప్పారు సంబంధుని కారణజన్ముడుగా దైవాంశ సంభూతుడుగా నెఱిగి మధురకు వెళ్ళనిచ్చినాడు. సంబంధారు మధురకు బయలుదేరాడు.

ఇచ్చట మధురలో జైనులకు అన్ని దుశ్శకునములే కన్పించాయి. రాజుకు దుశ్శ కునముల గూర్చి చెప్పారు. రాణి, మంత్రికి మాత్రము అన్ని శుభశకునములే కన్పించినవి. అందుచే సంతోష భరితులైనారు.

సంబంధారు మధురకు వస్తున్నట్లు రాణికి, మంత్రికి తెలిసింది. రాణి మంత్రిని సంబంధారును గౌరవపురస్సరముగా ఆహ్వానించమని కోరింది. తానుగూడ సుంద రేశ్వరస్వామి సన్నిధికి పోయి సేవించి సంబంధుని రాకకు ఎదురుచూడసాగింది.

మంత్రి పొలిమేర సమీపిస్తుండగా సంబంధుని ఆగమన మేళతాళములు వేద ఘోషలు వినిపించాయి. ఆ దెస వెళ్లాడు. ఆ భక్తులను చూడగానే మనస్సు పరవళ్లు తొక్కింది. సంబంధారుకు సాగిలపడి లేవలేదు. భక్తులను ఇది దిగ్భ్రమ గొలిపింది. సంబంధారు తన పల్లకి నుండి దిగి మంత్రి కులాచిరాయిని లేవదీసి పరిష్వంగనం చేశాడు. దూరం నుండి దేవాలయ శిఖరం చూచి అక్కడి నుంచే సుందరేశ్వరుని అర్చించాడు. రాణి గూర్చి మంత్రి గూర్చి వృత్తములలో శ్లాఘించాడు. అందరు దేవాలయ ములో ప్రవేశించారు. రాణి ఒక ప్రక్క ఒదిగి మనసులోనే సంబంధారుకు ప్రణతులు తెల్పినది. తర్వాత ఆయన పాదములపై పడింది. సంబంధారు ఆమెను ఆశీర్వదించాడు.

జైనులకు సంబంధారు ఆగమన వార్త తెలిసింది. పంచాక్షర మంత్రఘోషలు ఎల్లెడల నిండినవి. వారిని ఆహ్వానించిన వారిని రాజుచే శిక్షింపజేయ తలచారు. రాజు గారికి శైవుల మూలమున మధుర అపవిత్రమైనదని, దీనికి కారణము ఒక చిన్న బ్రాహ్మణ బాలకుడని అతనికి శివానుగ్రహమున్నదని అందరూ చెపుతున్నారని, మంచి మతమేదో మనతో వాగ్వాదముతో తేల్చుకోటానికి వచ్చినట్లు గాను రాజు గారికి చెప్పారు.

రాజు సమాలోచన జరిపాడు. జైనులు ఆ వచ్చిన బ్రాహ్మణ బాలకుని శిబిరమును తగులబెట్టుటకు రాజుగారి అనుమతినడిగారు. రాజు గారు అనుమతినిచ్చారు. కాని అది ఫలించలేదు. రాజు మనస్సు ఆందోళనతో నుండుట చూచి రాణి కారణమడిగింది. “ఉభ యులను పిలిచి ఏది మంచి మతమో సభలో తేల్చుటయే మంచిది” అని రాజుకు సలహా ఇచ్చింది. రాజుగారు కూడా ఒప్పకున్నారు.

జైనులు సంబంధారు గుడారము తగుల బెట్టలేక పోయారు. కాని సంబంధారు అనుయాయుల గుడారాలకి నిప్పంటించ గలిగారు. అనుయాయులు సంబంధారు దగ్గరకు పరుగెత్తారు. గుడారాలకు నిప్పు పెట్టినట్లు చెప్పారు. సంబంధారు ఒక వృత్తము పడిగము, పాడాడు. రాజు గారి మూలమున ఈ పనిజరిగినది కాన ఆ మంటలు రాజు గారి దెసకు మళ్ల వలసిందిగా పాడాడు. సంబంధారు వృత్తము పాడగానే అనుయా

యుల గుడారముల అగ్ని ఆరిపోయింది. మహా భయంకరమైన రుగ్మతగా శరీరమున మంటలుగా రాజును చుట్టుముట్టాయి. రాజుగారు శరీరమున తీవ్రమంటలతో బాధపడడం మొదలుపెట్టాడు. వైద్యుల కృషి జైనమతాధికారుల మంత్రములు రాజుగారి దేహాగ్నిని చల్లార్చ లేకపోయాయి. రాణిగారికి, మంత్రికి అసలు కారణమర్థమయింది. సంబంధారును ఆహ్వానించి ఆయనను ప్రార్థిస్తే రోగము నయమవవచ్చునని రాజుగారికి రాణి చెప్పింది. రాజు సంబంధారుకు వెంటనే ఆహ్వానము పంపాడు. రాణి వెంటనే సంబంధారును ఆహ్వానించుటకు ఆయన కడకు చెలికత్తెలతో వెళ్లింది. కులాఛ్ఛిరాయిర్ ఆమె కంటే ముందుగా సంబంధారును చేరుకున్నాడు. ఇద్దరు సంబంధారు కాళ్ల మీద పడి, రాజుగారి దుస్థితి తెలియజేసి, జైనుల దుష్కృత్యముల ఫలము రాజుగారిని చుట్టుకున్నది, జైనులు రాజును ఆ దుస్థితి నుండి తొలగించ జాలరైరి. మీరు వచ్చి రాజును వ్యాధి నుండినయము చేసి శైవమత మహాప్రభావము సభలో వాదించి రాజుకు తెలియునట్లు చేయవలసిందిగా అభ్యర్థించారు. రాజును రక్షించవలసిందిగా ప్రార్థించారు. సంబంధారు అంగీకరించి - దేవాలయమునకు వెళ్లి సుందరేశ్వరుని ప్రార్థించి ఆయన అనుగ్రహము పొంది - రాణి, మంత్రులతో రాజమందిరము చేరాడు. రాజుగారు సకల మర్యాదలతో సంబంధారును ఆహ్వానించారు. ఒక అలంకరించిన సింహాసనముపై సంబంధారును కూర్చుండ బెట్టాడు. ఇది జైనులను అసహనానికి గురిచేసింది. జైనులతో సంబంధారును వాదించమన్నారు. జైనుల దౌర్జన్యము బాలకుని ఇబ్బందికి గురి చేస్తుందేమోనని భావించి తెలివిగా - సంబంధారు రాజుగారిని రుగ్మత నుండి తొలగించిన తర్వాత వాదనలో జైనుల ఓడించమని రాణి సంబంధుని అభ్యర్థించింది. రాజుగారు దీనికి అంగీకరించారు. సంబంధారు తాను దీనికి అసలు భయపడనే భయపడనని చెప్పాడు.

రాజుగారు ఉభయులను తన వ్యాధి కుదుర్చుడని ఆదేశించాడు. జైనులు రాజుగారి దేహమునకు ఎడమ పార్శ్వమును కుదుర్చుదుము, సంబంధారుని రాజు గారి

కుడిప్రక్కన కుదుర్చవలసినదిగా చెప్పిరి. రాజు అంగీకరించాడు. జైనులు రాజుగారి శరీర మును నెమలి ఈకలతో ఎడమ పార్శ్వమంతా నిమిరారు. మంత్రాలు చదివారు. వ్యాధి నిమ్మళించుటకు బదులు ఎడమ పార్శ్వమున మంటలు అధికము కాజొచ్చాయి. రాజు గారు చాల దయనీయముగా సంబంధారు వంక జూచాడు. సంబంధారు విభూతి మహిమను గూర్చి ఒక పడిగమును పాడి రాజుగారి దేహానికి కుడి ప్రక్క అంతా తన చేతితో విభూతి భస్మమును అలదాడు. ఆ దెస వెంటనే మంటలు చల్లారాయి. రాజు చాలచల్లని అనుభూతి పొందాడు. రాజుగారు జైనుల దెస తిరిగి మీరు ఓడిపోయి నారనిచెప్పి సంబంధారు దెస తిరిగి, తన ఎడమ పార్శ్వమును గూడ మంటల నుండి విముక్తిచేయమని అభ్యర్థించాడు. సంబంధారు ఎడమ పార్శ్వమున గూడ విభూతి నలిమాడు. వ్యాధి సంపూర్ణముగా నయమైనది.

రాణి, మంత్రి సంబంధారు కాళ్లమీద పడ్డారు. రాజు కూడా ఆయన పాదాలకు నమస్కరించి ప్రశంసించాడు. జైనులు ఇదంతా సంబంధుని కవితాశక్తని, తమతో మత పరంగా వాదన సల్పునట్లు చేయవలసినదిగా రాజును కోరారు. వాదనలో తాము తప్పక విజేతలమవుతామని చెప్పారు.

సంబంధారు వాదన కంగీకరించాడు. జైనులు సూత్రపరంగా కాక ప్రత్యక్ష ప్రమాణపూర్వకంగా పోటీ జరుగాలన్నారు. సంబంధులు అంగీకరించారు.

జైనులు "మేము మా దైవము యొక్క గుణగణములను ఒక పత్రమున వ్రాసె దము. మీ దైవము గుణగణములను మీరువ్రాయుడు. రెండు పత్రములను అగ్నిలో పడ వేయుదము. ఎవరి పత్రము మండిపోకుండునో వారి మతము ఉత్కృష్టము" అని జైను లు చెప్పిరి. సంబందార్ అందులకు అంగీకరించాడు. ఉభయులు అట్లు వ్రాసిరి. వానిని రాజు అగ్నిలో పడవైచెను. చూచుచుండగానే జైనుల పత్రము బూడిదైపోయెను. సంబం ధుని పత్రము చెక్కుచెదరలేదు. అట్లే వుండెను. రాణి, మంత్రి ఆనందించిరి. రాజు గారికి శైవమతమందు భక్తి అధికమైంది.

జైనులంతటితో వూరుకోలేదు. “మేము ఇంకో పరీక్ష పెట్టెదము, మరల ఉభయులు చెరియొక పత్రము వ్రాసెదము, వానిని వైఘనదిలో విడువవలెను. ఎవరి పత్రము నీటి వాలునకు ఎదురు ఈదునో వారి మతము శ్రేష్టము” అన్నారు. సంబంధుడు దీనికిని అంగీకరించెను. ఉభయులు పత్రములు వ్రాసి రాజునకిచ్చిరి. ఓడిపోయినవారికి శిక్ష ఏమిటి అని అడుగగా “ ఓడిన వారిని కొరత వేయుడు” అని జైనులు పలికిరి. అందరును వైఘనదికి పోయినారు. రాజు రెండు పత్రములను నదిలో వేసెను. జైనుల పత్రము నదివేగమున వాలునకు కొట్టుకుపోయింది. శైవుల పత్రము చాల అందముగా ఠీవిగా మునిగిపోకుండా నదీ ప్రవాహమునకు ఎదురు ఈదింది. ఈ పరీక్ష జరుగుతున్నప్పుడు సంబంధారు రాజు మీద దైవకృప ప్రసరించాలని పదిగము పాడాడు. ఈ పదిగము మూలాన్ని శైవులు గెలవడమే కాకుండా - రాజుగారికి అంతకు మునుపువున్న గూను కూడా తొలగిపోయినది. నీటిలో వేసిన పత్రము తిరువెడగడము చేరింది. మంత్రి ఆ పత్రమును తిరిగి తీసికోవాలని దాని వెంట వెళ్లాడు. ఈ విషయము గ్రహించి సంబంధారు ఇంకోపాట పాడి ఆ పత్రమును నిలుపుదల చేశాడు. మంత్రి ఆ పత్రమును చేతిలో తీసికొని గుడికి వెళ్లి సుందరేశ్వరుని అర్చించాడు. సంబంధారు రాజదంపతులతో దేవాలయమునకు వెళ్లి నిష్టగా పూజ చేశారు. జైనులకు వారు చెప్పినట్లుగానే కొరత వేశారు. ప్రజలు రాజునునుసరించి శైవమతస్థులయ్యారు. ఈ విధంగా శైవమతం మధురలో తిరిగి ప్రతిష్ఠింపబడ్డది.

రాజు నాయనారును సగౌరవముగా తిరిగి ఆయన మఠములో ప్రవేశపెట్టెను. సంబంధారు తండ్రి శివపాదుడు తన కుమారుడు పాండ్య రాజ్యమున జైనులనోడించి శైవమతమును ప్రతిష్ఠించెనని విని వచ్చి తన కుమారుని జూచి పరమానంద భరితుడయ్యెను. ఆ కార్యమున కృతార్థుడగుటకేకద శివపాదుడు భార్యను శివుని తాము కుమారునికై అర్థించినది?.

మధురలో కొంతకాలముండి సంబంధారు మరల తీర్థయాత్రకు, ఈసారి రాజ

దంపతులను వెంట నిడుకొని బయలుదేరెను. రామేశ్వరములో అచ్చట నుండియే లంకలోని తిరుకోనమలై, తిరుకేతీశ్వరములో దైవాన్ని అర్చించాడు. మంత్రి జన్మస్థలము గూడసందర్శించారు. తర్వాత రాజు నుండి సెలవు పొంది సంబంధారు చోళ దేశానికి మరలాడు.

త్రోవలో ముల్లివాయికారైకి చేరాడు. అక్కడ నది వరదలో నున్నది. పడవవాండ్రు పడవలను చెట్టుకు కట్టివేసి వెళ్లిపోయారు. సంబంధారు నది ఆవలి ఒడ్డుననున్న తిరు కొల్లమ్‌పుత్తూరు దేవుని కొలవాలనుకున్నాడు. ఒక పడవత్రాడు విప్పమని అందులో ఎక్కాడు. దేవుని గూర్చి పాడాడు. ఈ పాటే తెడ్డయింది. వారంతా సురక్షితంగా ఆవలి ఒడ్డు చేరి దైవాన్ని అర్చించారు.

ఇక్కడినుంచి సంబంధారు బృందము బోధిమంగల్ చేరింది. అది ఒక బౌద్ధ కేంద్రము. సంబంధారు బృందము మేళతాళాలతో సంబంధారును కీర్తిస్తూ పాడుతూ వూరులో ప్రవేశించారు. బౌద్ధులకు ఈ విషయమై ఆగ్రహము కల్గింది. వాయిద్యాలని ఆపుమని బౌద్ధులు ఆదేశించారు. ఈ విషయం సంబంధారుకు చెప్పబడింది. సంబం ధారు పాటలన్నింటిని పదిలపరచు సాంబశరణాలయార్ అనే అతను, ఈసారి తనే ఒక పడిగమును బుద్ధనందితల మీద పిడుగు పడాలని పాడాడు. బుద్ధనంది బౌద్ధులలో పెద్ద వాడు. బుద్ధనంది పిడుగుతో గతించాడు. మిగతా బౌద్ధులు పారిపోయారు. కాని మళ్లీ వారు శారిబుద్ధన్ నాయకత్వంతో తిరిగి వచ్చారు. శారిబుద్ధన్ శైవులను వాదనలో గెలవ మన్నాడు. సంబంధార్ ఆశీస్సులతో సాంబశరణాలయార్ వారితో వాదన చేసి బౌద్ధులను ఓడించాడు. శారిబుద్ధన్ తనే శైవమతావలంబి అయ్యాడు. ఆయన అనుచరులు గూడ శైవమతమవలంబించారు. సంబంధార్ అందరిని ఆశీర్వదించాడు. సంబంధార్ అక్కడి నుండి తిరుకడవూరు చేరాడు. అప్పారు తిరుపూంతురితిలో వున్నట్లు తెలిసికొని సంబం ధారు అప్పార్‌ను కలుసుకొనుటకు వెళ్లాడు. అప్పుడే అప్పార్ గూడ సంబంధారు విజయ

వార్తలను విని సంబంధారును కలుసుకోవడానికి వస్తున్నాడు. నిశ్శబ్దముగా ఎవరికి తెలియకుండ సంబంధార్ బృందములో చేరి - సంబంధారును తెస్తున్న పల్లకి ఒక కొమ్మును అప్పార్ తన భుజాలపై పెట్టుకొని మోస్తూవెళ్లాడు. సంబంధార్ అప్పార్ ఎక్కడ అని అడుగగా - "ఇక్కడనే వున్నాను నా పూర్వజన్మ పుణ్యవిశేషముచే మీ పల్లకిని మోస్తూ వున్నాను" అని జవాబిచ్చాడు. సంబంధారు ఆశ్చర్యచకితుడై పల్లకిని దిగి అప్పారును కౌగలించుకున్నాడు.

ఇంకా కొన్ని దివ్యదేశాలని సందర్శించి సంబంధారు సర్కాలి చేరాడు. తిరునీలకంఠ యాజ్‌పనార్, అతని భార్య సంబంధారు నుండి వీడ్కోలు పొంది తమ గృహమునకు చేరుకొన్నారు.

సంబంధారు తొండైనాడు వెళ్లాలనుకొన్నాడు. సర్కాలి దైవము తోనియప్పారు నుండి సెలవు పొంది త్రోవలో చాలా క్షేత్రములను చూస్తూ తిరుఅన్నామలై చేరాడు. ఆ గిరిని చూడగానే సంబంధారులో తన్మయత్వము వచ్చింది. నేల మీద దొర్లాడు. ఆనందభాష్పాలు రాలాయి. అక్కడ నుంచి తొండైనాడు చేరి తిరువొత్తూరు వెళ్లాడు. అక్కడ సంబంధారును ఒక భక్తుడు సమీపించి నేను బోలెడు తాళ వృక్షములను నాటినాను. కాని అవన్నీ మగ చెట్లయినవి. పళ్లనిచ్చుట లేదు. నన్ను జైనులు ఈ విషయమై ఎగతాళి చేయుచున్నారు.  నన్ను ఈ అవహేళన నుండి రక్షించండి అని వాపోయాడు. సంబంధారు గుడిలోనికివెళ్లి అతని దుస్థితిని నివారించమని దేవునికి ఒక పదిగము పాడాడు. తక్షణమే ఆ మగ తాడిచెట్లన్నీ ఆడ చెట్లుగా ఫలవంతమయ్యాయి. ఈ అద్భుతంతో ఇంకా కొంతమంది జైనులు శైవులయ్యారు. సంబంధారు ప్రత్యేకంగా తాడి చెట్లను పేర్కొనుట చేత వాటిలో గూడ సృష్టిక్రమములో మార్పు వచ్చింది.

అంచెలంచెలుగా సంబంధారు తిరువాలంకాడు చేరాడు. ఇచ్చటనే కారక్కాలమ్మ ఆ ప్రదేశము అపవిత్రమగునేమోనని తల క్రింద పెట్టి నడిచింది. తను గూడ ఆ ప్రదేశ

మునకు నడిచి వెళ్లదలచలేదు. రాత్రి అచ్చట పరమశివుడు సంబంధునకు స్వప్నమున సాక్షాత్కరించి నన్ను వృత్తములతో వినుతింపవా? అని అడిగాడు. సంబంధారు వెంటనే మేల్కొని అనేక వృత్తజాలములతో అక్కడనున్న పరమశివుని వినుతించాడు. అక్కడ నుండి బయలుదేరి కాళహస్తి చేరి కన్నప్పనాయనారును దృశ్యరూపముగా చూచి, ఉత్తర కైలాసము, కేదారము, గోకర్ణము, తిరుపతి, ఇంద్రనీల పర్వతము మున్నగునవి చూచి తిరువొత్రియూరు చేరాడు.

మైలాపూరులో శివనేశార్ అనే వణిజుడున్నాడు. అతను మంచి శివభక్తుడు. ఆయనకు సకల సౌభాగ్యాలున్నాయి గాని సంతతి లేదు. కాని తన ప్రార్థనలకను గ్రహించి పరమశివుడు అతనికి ఒక పుత్రికను ప్రసాదించాడు. ఆమె చక్కని చుక్క. సంబంధారు గూర్చిన విశేషాలు విని తన కూతురుని అతనికిచ్చి వివాహము చేయ సంకల్పించాడు. మానసికముగా సంబంధారుకు తన కుమార్తెను సంబంధారుకిచ్చు టకు నిశ్చయించాడు. ఆ అమ్మాయి పేరు పూంపవాయి. తోటలో పూలను కోస్తుండగా పాము కరచి ఆమె చనిపోయింది. శివనేశార్ తన కూతురిని బ్రదికించిన వానికి అనంత ధనరాసులనిస్తానని ప్రకటించాడు. ఎవ్వరూ రాలేదు. అప్పుడు అతనికి జ్ఞాప కము వచ్చింది. తను మానసికంగా తన కూతురును సంబంధారుకిచ్చి వేసితినని, అందుకని ఆ అమ్మాయి దహన సంస్కారములు చేసి, అమ్మాయి భస్మమును సేకరించి ఒక పాత్రలో నిక్షిప్తము చేసి రోజూ పూలతో ఆ పాత్రకు పూజ చేయువాడు. సంబంధారు గూర్చి ధ్యానముచేసేవాడు. సంబంధారు తిరువొత్తియూరు వచ్చియున్నాడని తెలిసింది. వెంటనే ఒక పందిరిని మైలాపూర్ నుంచి తిరువొత్తియూరు వరకు వేయించాడు. భక్తు లను వెంట బెట్టుకొని సంబంధారును కలుసుకొనుటకు తిరువొత్తియూరు బయలు దేరాడు. సంబంధారుగూడ భక్తులతో మైలాపూర్ వస్తున్నాడు. ఇద్దరూ త్రోవలో మధ్యలో కలుసుకున్నారు. సంబంధారు శివనేశన్ గూర్చి, అతని కుమార్తె గూర్చి, ఆమె అస్తికలను పాత్రలో నుంచి పూజిస్తున్నట్లు విన్నాడు.శివనేశన్ కుమార్తెను బ్రదికించి ఆనందింప

జేయాలనుకొన్నాడు. ఇద్దరూ మైలాపూరు చేరారు. సంబంధార్ కపాలేశ్వరస్వామిని అర్చించి శివనేశార్‌ను ఆ అస్తికల పాత్రను తెమ్మన్నాడు. సంబంధారు ఆ పాత్రను ఉద్దే శించి ఒక పాటను పాడాడు. ఓ పూంపావాయి మనుష్యుడుగా ఈ భూమిపై జనన మందుట దైవసేవకొరకునున్ను అతని భక్తుల సేవ కొరకున్ను, భగవంతునికి చేయు పండుగలను వీక్షించుటకునున్ను, ఇది నిజమైతే - అందరి ఎదుటకు లేచి రమ్ము, పండుగ చూడకుండా వెళ్లిపోతావా అని పాడాడు. ఒక వృత్తమవగానే పూంపావాయికి తొలి రూపము వచ్చింది. ఎనిమిది వృత్తాలు పూర్తవగానే ఆమెకు జీవము వచ్చి పన్నెండు సంవత్సరముల బాలిక అయింది. పదవ వృత్తము పూర్తవగానే లక్ష్మీదేవి కమలము నుండి ఉద్భవించినట్లు, ఆమె గూడ ఆ పాత్ర నుండి ఉద్భవించింది. అందరూ ఈ అద్భుతాన్ని చూచి ఆశ్చర్య చకితులైనారు. సంబంధారు శివనేశన్ కుమార్తె చనిపోయినదని, ఇప్పడు బ్రదికి వచ్చినామె తన కుమార్తెగపరిగణించవలెనని చెప్పాడు. సంబంధార్ చెప్పిన దానికి శివనేశన్ అంగీకరించాడు. ఆ కన్యకు ఒక ఆశ్రమము నిర్మించాడు. ఆమె ఆ ఆశ్రమములో వుంటూ  దేవుని అర్చిస్తూ శివసాయుజ్యమందినది.

సంబంధుడు మైలాపూరునందు కొంతకాలముండి అక్కడనుంచి బయలుదేరి - తిరువామూరు అచ్చరపాకము, పక్షితీర్థము, మొదలగు దివ్యస్థలములలు జూచి చిదంబ రమునకు బోయి శియ్యాళికి తండ్రితో చేరాడు.

వయస్సులో సంబంధారుకు పదహారవ సంవత్సరము వచ్చింది. తండ్రి సంబం ధారును పెండ్లి చేసుకొనమని కోరాడు. సంబంధారు అంగీకరించలేదు. వివాహము వేదవిధియని దానికి అంగీకరించమని తండ్రి అడిగాడు. సంబంధుడు అందుకు అడ్డము చెప్పలేదు. శివపాదహృదయారు నల్లూరు పెరుమానము వాస్తవ్యుడు, నంబి యాండార్ నంబి తనయను నిశ్చయించాడు. సంబంధార్ దేవుని సందర్శించి స్వామి ఆశీస్సులనుపొందాడు. దగ్గరలోనున్న మఠానికి పెళ్లి కూతురు బృందము వారు వచ్చారు. సంబంధారు తన వివాహ దుస్తులలో ముత్యాల పల్లకిలో వివాహ స్థలమునకు వూరే

గుతూచేరాడు. సంబంధారు తన భార్య చేతిని పట్టుకొని అగ్ని చుట్టూ ప్రదక్షిణ చేశారు. శివస్వరూపము అగ్నియే కద. భక్తులతో భార్యతో దేవళమునకు వెళ్లి సంపూర్ణ శరణాగతితో దేవుని అర్చించాడు. సంబంధార్ - తనకు ఇహబంధాల నుండి విముక్తిని ప్రసాదించమని ఒక వృత్తమును పాడాడు. తోడనే - భగవంతుడు అంగీకరిస్తూ - సంబంధార్! నీవు, నీభార్య నీ వివాహమును చూసిన అందరు మీ ఎదురుగానున్న శివ జ్యోతులలో లీనమై నా దగ్గరకు రండి అని ఆనతిచ్చాడు. చూడగా ఎదుట శివసన్నిధి నుండి ఆకాశము వరకు జ్యోతి కన్పడింది. అపుడు భార్యతో గూడ తిరుశ్రీజ్ఞానసంబంధారు ముందుండగా అచ్చటగల భక్తులందరూ ఆ జ్యోతిలో ప్రవేశించి శివసాయుజ్యమందారు. ఆ జ్యోతిలో లీనమగుటకు ముందు సంబంధార్ పంచాక్షరపడిగను పాడారు. ఈ జ్యోతిలోనే తిరునీలకంఠనాయనారు, మురుగనాయనారు, తిరునీలకంఠ యాజ్పనారు, చిరుతొండార్, గుగ్గలుకలశనాయనారు, సంబంధారు తల్లిదండ్రులు, పెళ్లికూతురు చెల్లికత్తెలు అందరూ గూడ ఆ వివాహమునకు వచ్చి సంబంధారుతో ఆ జ్యోతిలోనే లీనమైనారు.

ఈ ద్రవిడ శిశువు శంకరాచార్యుల కన్నివిధముల పోలినవాడు. అద్వైతప్రతిష్ఠ చేసిన శంకరాచార్యునివలె, సబంధార్ శైవమత స్థాపనకు, ఉద్ధరణకు పాటుపడ్డాడు.

****

# 31. దండి ఆదిగల్ నాయనారు

చోళదేశములో తిరువావూరులో దండిఆదిగళ్ అనే శివభక్తుడుండేవాడు. అతను పుట్టుగ్రుడ్డి. అయినను పంచాక్షరిని జపించాడు. పరమశివుని అంతర్ దృష్టిలో చూచేవాడు. ప్రతిరోజు శివాలయానికి వెళ్లి స్వామిని వినుతించుచు క్రింద బడుచు లేచాడు. వెళ్లి తిరిగి వచ్చేవాడు. ఆ దేవాలయమునకు పడమటి దెసను ఒక తటాకముంది. ఆడిగళ్ దానిని పెద్దది చేయ నిశ్చయించాడు. గ్రుడ్డి వాడు ఎట్లు చేయగలడు. కాని ఎన్ని అవధులు వచ్చినను పెద్ద తటాకముగ చేయ నిశ్చయించాడు. చెరువు మధ్యలో ఒక కర్రను పాతాడు. దానికి ఒకతాడు కట్టాడు. రెండవ చివరను ఒడ్డున వున్న ఇంకొక స్తంభానికి దానిని కట్టాడు. ఆ త్రాడు పుచ్చు కొని చెరువులో దిగేవాడు. త్రవ్వడము మొదలు పెట్టేవాడు. త్రవ్వి ఆ మన్నును గంపలో పెట్టు కొని త్రాడు సాయమున తీరమునకు వచ్చి ఆ గంప మట్టిని బయట పోసేవాడు.

అక్కడనున్న జైనులు గ్రుడ్డివాడా నీకు ప్రాణములపై ఆశ లేదా, ప్రాణాపాయ కరమైన పనిని ఎందుకు చేస్తున్నావు మానేయి అని మందలించారు. "ఇది పరమేశ్వ రునికి ప్రీతిని గలిగించు కార్యము. నేను ఎట్లు మానేది?' అని సమాధానము చెప్పే వాడు. జైనులు వీనికి కన్నులు లేనట్లే చెవులు గూడ లేవు. ఎవరు చెప్పిన వినడు అనే వారు. నాకు కన్నులున్నవి చెవులున్నవి మీకే లేవు అని నాయనారు పలికాడు. 'నీకు కనుక కన్నులుండుటయే నిజమైన, మేము ఈ వూరిలో వుండము' అని జైనులు పలికారు.

ఆ రాత్రి ఆడిగాళ్‌కు స్వప్నమున పరమేశ్వరుడు సాక్షాత్కరించి 'నీకు కనులు ఇచ్చుచున్నాను, జైనులను అంధులనుగా జేసితిని' అని చెప్పాడు. రాజునకు గూడ కనబడి - జైనులు నాయనారుకు అడ్డము తగులకుండ చూడవలసినది' అని ఆదే

శించారు. మరునాడు రాజు నాయనారు వద్దకు వచ్చి 'ఏమికావాలి' అని అడిగాడు. నాయనారు రాజును చెరువు వద్దకు తీసికొని వెళ్లి జైనులను అక్కడికి రప్పించాడు. జైనులు అందరు అంధులై యున్నారు. రాజాజ్ఞ ప్రకారం వారు పడుచు లేచుచు ఎట్లో వచ్చారు. 'నాకు కన్నులు వచ్చినవి' మీరు పలికిన శపధము ప్రకారము ఈ వూరు విడిచిపెట్టి వెళ్లుడు అని నాయనారు వారినాదేశించాడు. జైనులలో కొంత మంది అందత్వముతో బాధపడలేక నాయనారును శరణుజొచ్చారు. వారు శైవు లయిన వెంటనే వారి అంధత్వము తొలగినది.

దండి ఆదిగాళ్ జీవించి యున్నంతకాలము శివపూజ, శివభక్తులకు సేవను చేస్తూ అంత్యమున శివసాయుజ్యము నొందినాడు.

# 29. ఇయర్‌కాన్ కలికామ నాయనారు

పొన్నినాడులోని తిరుపెరుమంగళంలో ఇయర్‌కాన్ కలికామ నాయనారు వుండే వాడు. వెల్లాల కులస్తుడు. ఆ కుటుంబమును ఇయర్‌కుడి అని పిలిచేవారు. చోళ రాజులకు సేనాధిపతులనిచ్చిన కుటుంబమది. కలికామనాయనారు మహాశివభక్తుడు.

సుందరమూర్తినాయనారు పరమశివుని వరవయారు అను వారకాంత వద్దకు దౌత్యమునకు పంపినాడని తెలిసింది. కలికామనాయనారు మహోగ్రుడైనాడు. పరమశివుని నంతటివానిని తుచ్ఛుని ఇంటికి దౌత్యమునకు పంపుతాడా? వీనినేమి చేసినా పాపములేదు. వీని మొగము చూచిన పాపమగును" అని కోపించి - పరమశివునుద్దేశించి "నీవు వెలయాలి ఇంటికి ఎట్లా వెళ్లావు?" అని బాధపడుట మొదలుపెట్టాడు.

ఈ సంగతి సుందరమూర్తినాయనారుకు తెలిసింది. పరమశివుని అతని కోపము మాన్పమని కోరెను. పరమశివుడు వారిరువురుకు సఖ్యము చేయ నిశ్చయించి కలికామనాయనారుకు శూల వ్యాధి కలిగించెను. బాధకు తట్టుకోలేక కలికామ నాయనారు పరమశివుని ప్రార్థించాడు. పరమశివుడు అతనికి కన్పించి నీకు సుందర మూర్తినాయనారు ఉపశమనము కలిగించగలడు అని చెప్పాడు. నాయనారు అది విని - 'వానిచే నా బాధను తొలగించుకొనుటకన్న నాకు చావే మంచిది' అని శివునికి చెప్పాడు. శివుడు సుందరమూర్తినాయనారునకు స్వప్నమున కనబడి కలికామనాయనారు శూలరోగమును నీవుపోయి తొలగింపుమని ఆదేశించాడు.

సుందరమూర్తినాయనారు కలికామనాయనారు ఇంటికి వస్తున్నానని వార్త పంపాడు. ఆ దురాత్ముని చూచుటకన్న నాకు మరణము మేలు అనుకొని, కత్తితో పొడుచుకొని ప్రాణము విడిచాడు. ఇంతలో సుందరమూర్తి నాయనారు అక్కడికి వచ్చాడు. అందరను నిశ్శబ్దముగా వుండమని కలికామనాయనారు భార్య సుందరమూర్తినాయనారును ఆహ్వానించి - ఆదరించినది. సుందరమూర్తినాయనారు నేను కలికామనాయనారును చూడవలయునని చెప్పాడు. వారు  నిద్రించుచున్నారని చెప్పారు. అయినా చూస్తానన్నాడు. ఇక చేయునది లేక కలికామనాయనారును చూపారు. కలికామనాయనారు లేని ఈ భూమిపై నేనుగూడ నుండనని తాను గూడ పొడుచుకొనబోయెను.

శివుడు సాక్షాత్కరించి కలికామనాయనారును పురరుజ్జీవింప జేసినాడు. నాయనారు లిరువురు ఒకరినొకరు పరిష్వంగనము చేసికొన్నారు. కలికామనాయనారు శేష జీవిత మును శివుని సేవలోను, శివభక్తుల సేవలోను నిమగ్నుడై అంత్యమున శివసాయుజ్య మందినాడు.

****

# 32. మూర్ఖ నాయనారు

మూర్ఖనాయనారు తొండైనాడులోని తిరువెర్కటో కు చెందిన వెల్లాల పరమ శివభక్తుడు. ప్రతిరోజున మహేశ్వరపూజ చేసి భక్తులకు అన్నము పెట్టేవాడు. ఎన్ని అవాంతరములు వచ్చినను భక్తులకు తప్పనిసరిగా అన్నము పెట్టేవాడు. ఆ ఆతిథ్యముతో అతని సంపత్తు కరిగిపోయింది. ఆతిథ్యము కొనసాగింప కష్టమయింది.

అందుచే ఒక విచిత్ర పద్ధతి కనిపెట్టాడు. ప్రతివారిని పిలిచి జూడమాడేవాడు. దాని మీద వచ్చిన డబ్బుతో శివభక్తులకు భోజనము పెట్టేవాడు. అందుకని తనతో జూదము ఆడేవాళ్లకై వెదికేవాడు. ఎవరినీ విడిచిపెట్టేవాడు కాదు. ఎవరైన జూదమాడుటకు నిరాకరిస్తే పోరుకి సిద్ధమయ్యేవాడు. అవసరమైతే వారిని హింసించేవాడు. ఈ హింసాప్రవృత్తిని చూచి అతనిని అందరు మూర్ఖనాయనారు అని పేరు పెట్టారు. కాని సంపాదించిన ధనము యావత్తు తను దాచుకొనేవాడు కాదు. తనకు స్వంతానికివాడు కొనేవాడు కాదు. తన ఖర్చులకు గూడ ఆ ధనము ముట్టుకొనేవాడు కాదు. హృదయములో వున్న దేవుడు. ఈతని ఆతిథ్య విశేషము చూచి తన కృపను ఈతనిపై ప్రసరింపజేశాడు.

ఇది ఒక విపరీతమైన విషయము. మూర్ఖనాయనారు తీవ్ర శివభక్తి పరాభక్తిని చూపేవాడు. దాని న్యాయము దానిదే. శివభక్తునకు దేవుడు తప్ప లోకము, లోకములోని కట్టడులు తెలియవు. దేవునిలో నివశిస్తాడు. దేవుని కొరకు జీవిస్తాడు. దేవునికే చెందినవాడు. ఇటువంటి పరిస్థితలో పరమశివుడే సారధ్యము వహిస్తాడు. పూర్ణశరణాగతిని కఠిన పరీక్ష పెడతాడు.

ఇది చాల కష్టమైన బాట. నారమ మహర్షి - "యోగి ఋజుమార్గము తప్ప

రాదు. నీతి నియమములను ఉల్లంఘించరాదు. నీ వ్యక్తిత్వము నీకు తెలిసినంతకాలము నీ ఋజువర్తనకే కట్టుబడియుండు. మూర్ఖముగా ఇతర యోగులను అనుకరించకు - ఏలనన - వారుండే మానసిక పరిస్థితికి, నీ మానసిక పరిస్థితికి చాలా అంతరాయముండవచ్చు. అందుకని నీ ఋజుమార్గమునే నీవు అనుసరించమని" చెప్పాడు.

# 33. సోమశిర నాయనారు

సోమశిరనాయనారు తిరువాంబూరులో నివసించే బ్రాహ్మణుడు. శివభక్తిపరుడు. శివభక్తులను సేవించేవాడు. శివభక్తులు ఏకులాల వారైనా సరే - వారిని ఆదరించే వాడు. యాగాలు చేసాడు. ఫలితము నాశింపకయే శివుని కొలిచేవాడు. శివుడికి సం పూర్ణ శరణాగతుడు. ఈ కారణముచే అతనికి శివానుగ్రహము లభించింది.

ఇది ఒక పవిత్రుని జీవితము. ఇందులోపైకి ప్రత్యేకత ఏమియు కనిపించదు. ఆ రోజుల్లో దక్షిణాదిన వున్న పరిస్థితులను మనము గమనించాలి. ఆ రోజుల్లో బ్రాహ్మణు డెవడు ఇతర కులస్థులతో కలిసి తిరుగలేని పరిస్థితి. బ్రాహ్మణుడు వానికి సేవ చేయు టము, ఆలోచనలో కూడా వూహించలేము. ఎంత మహాశివభక్తులైనా సరే. బ్రాహ్మణు డెవడు ఇతర కులస్థులకు సేవ చేయుట కుదరదు. దేవుని భక్తులకు సేవ చేయుటకు చాలా మనోనిబ్బరముండాలి. పట్టుదల వుండాలి.

ఇంక యాగములు ఫలితమాసించక ఎవరునూ తలపెట్టరు. ఒక కోరికతో స్వార్థ మునకై యజ్ఞమును చేయ సంకల్పిస్తారు.

నాయనారు యాగాలను నిస్వార్థముగా చేశాడు. తనకై ఏమీ ఆశించలేదు. ఆధ్యాత్మికతతో ఎంతో ఎత్తుకు ఎదిగిపోయినట్లుగా గమనిస్తాము. జ్ఞానపరిధిలో, ఆధ్యా త్మిక దృష్టితో నిజమైన జ్ఞాని అతడు. కర్మయోగి అతడు.

ఇవన్నియుగాక అతనికి గురువు యెడ అప్రతిమాన భక్తి యుంది. సుందరమూర్తి నాయనారు ఈతనికి గురువు. గురుభక్తి మూలాన్ని సాధించలేని దేముంది? అయినా మూర్ఖులు, గర్విష్టులు గురుశక్తి గూర్చి చులకనగా మాట్లాడుతారు. గురు భక్తిని హేళన చేస్తారు.

ఎవరు ఎంత హేళన చేసినా నాయనారు తనదైన పద్ధతిని వీడలేదు. పరమ శివుడు సంతసించి నాయనారుకు అంత్యమున సాయుజ్యమనుగ్రహించాడు.

# 34. సక్కియ నాయనారు

సక్కియనాయనారు తిరుచంగమంగయిలోని వెల్లాల కులజుడు. ఆయనకు ఇహలోక వ్యాపకాలన్న అయిష్టత ఏర్పడింది. మోక్షమును పొందదలచాడు. మోక్షము నకు ఉత్తమమైన మంచి మార్గ మభిలషించాడు. బౌద్ధుల ప్రచారము వలలోపడి బౌద్ధ మతావలంబి అయ్యాడు. బౌద్ధమును స్వీకరించినా అది ఈయనకు ఎక్కువ కాలము సంతృప్తి నీయలేదు.

శైవమతమునకు ఆకర్షితుడయ్యాడు. బాహ్య చిహ్నములేవైనా బాహ్య ప్రవర్తనమే దైనా దేవునియందు అచంచల భక్తి ప్రపత్తులున్నచో మోక్షమునందగలడు అని నాయ నారు మనస్సుకు గాఢంగా తట్టింది. బాహ్యంగా బౌద్ధమత చిహ్నాలు వీడకపోయినా ఆయన మనస్సులో శివునియందు అచంచలమైన భక్తి ప్రపత్తులు నెలకొన్నవి. శివుని గాఢంగా ప్రేమించాడు.

ఒకరోజున శివాలయములో బయట కూర్చొని శివలింగము గూర్చిన తలంపుతో మైమరిచిపోయాడు. ఆ స్థితిలో శివలింగంపై తాను రాయిని వుంచుట తటస్థించింది. మరునాడు దేవాలయమునకు వెళ్లి వెనుకటి దినమున తానేమి చేసాడో ఒక్కసారి జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. భక్తుడు భక్తితో ఏమి సమర్పించినా దేవుడు స్వీకరిస్తాడు. ఈరోజు గూడ శివునిపై రాయిని వేశాడు. రోజూ ఈ విధమైన పూజ జరిగింది. ఈ పనిచేయనిదే ఆహారము గూడ తీసికొనే బుద్ధయ్యేదికాదు. ఒకరోజున భోజనానికి కూర్చోగానే తాను రోజూ చేసే పూజ చేయలేదని జ్ఞాపకానికి వచ్చింది. ఆకలిని గూడ మరచి దేవాలయ మును దర్శించి భక్తితో శివునిపై రాయి నుంచాడు. తక్షణమే పరమశివుడు ప్రత్యక్షమై ఆశీర్వదించి కైలాసానికి తీసికొని వెళ్లాడు.

# 35. శిరప్పలి నాయనారు

చోళదేశంలో తిరువాకూరులో నివసించే బ్రాహ్మణ కులజుడు శిరప్పలి నాయనారు. శివునియందు శివభక్తులయందు గాఢమైన భక్తి ప్రపత్తులు కలవాడు. వారిని పూజించి, చిత్తశుద్ధితో వారల సేవలు చేసేవాడు. పంచాక్షరీ మంత్రముతో భావయుక్తంగా పగలు రాత్రి నిరంతరము జపించేవాడు. పరమశివునికి యజ్ఞయాగాదులు గూడ చేశాడు. ఈ చేష్టలు శివుని మురిపించినవి. శిరప్పలినాయనారుకు శివానుగ్రహము పూర్తిగా లభించింది.

ఈ నాయనారు భక్తి నిరంతర ఓమ్ నమఃశివాయ పంచాక్షరి జపంలో కన్పిస్తుంది. అత్యంత సులభమైన ఈ నిత్యపంచాక్షరీ జపము అనంతమైన ఫలితానిస్తుంది. అయినా అజ్ఞానంతో, మాయలో కష్టబడి మానవులు ఈ ప్రక్రియనవలంభించరు. మనసు అలా చేయనీయదు.

ఈ మంత్రానుష్టానము నిరంతర ప్రక్రియగా కొనసాగినచో అది మానసిక ప్రవృత్తినే తత్వాన్నే మార్చి వేయగలదు. ఆ జపము దివ్యచలన తరంగాలకు కారణమవుతాయి. ఆధునిక శాస్త్ర పరిజ్ఞానము సమూహానికి సంఖ్యామానానికి విలువ నీయటంలేదు. శాస్త్ర జ్ఞానము ఏమీలేని పామరుడు గూడ అణువులోని, కణములోని మహత్యము గుర్తెరుగుతున్నాడు. శబ్దతరంగాల విశిష్టత మానసిక ఆలోచనా తరంగాలు తెలిసికొనలేకపోయినచో అది బుద్ధిహీనతే అవుతుంది. అవి మనుజునిలో భౌతికంగా, మానసికంగా ఆధ్యాత్మికంగాను విశిష్టమైన మార్పులు తెస్తాయి.

ప్రతిక్షణము దేవుని జ్ఞాపకముంచుకొని - నిరంతరం ఆయన నామము జపించుట ఉత్తమమైన యోగ ప్రక్రియ.

# 36. శిరుతొండ నాయనారు

చోళ దేశంలో తంజావూరు జిల్లాలో తిరుచ్చెంగాట్టంగుడి పేరుతో ఒక గ్రామముంది. ఇది తిరుప్పుకలూరుకు 3 కిలోమీటర్ల దూరంలో వుంది. ఆ గ్రామంలో పరంజ్యోతి, అతని భార్య తిరువెంగాడునంగై అను మహాశివభక్తులుండేవారు. వారికి గణపతి ప్రసాదమున శ్రీయాళుడు అనే కుమారుడు కలిగాడు. అతనికి అయిదవ ఏట అక్షరాభ్యాసము చేయించారు. ఆ సమయమునకు మార్గవశమున తిరుజ్ఞానసంబంధనాయనారు గూడ వీరింటికి విచ్చేయుట సంభవించింది. ఆయన బాలుని ఆశీర్వదించి శ్రీయాళుని వృత్తములతో వినితించాడు.

పరంజ్యోతి అశ్వ విద్యయందును, శస్త్ర విద్యయందును, ఆయుర్వేదమునందును మహానిపుణుడు.

పరంజ్యోతి కుటుంబము సేవాధిపతుల కుటుంబము. పరంజ్యోతి - తనే చోళ రాజ్యానికి ప్రధాన సేనాధిపతి. ఒకసారి రాజుగారి ఆదేశము ప్రకారము ఉత్తర దేశపు రాజునొకనితో యుద్ధము చేసి, ఆ రాజును జయించి - ఆ రాజ్యము నుండి అనంత ధన రాశులను, రధగజఅశ్వములను తెచ్చి పరంజ్యోతి చోళరాజు గారికి సమర్పించాడు. రాజు ఈ విజయానికి పరమానంద భరితుడయ్యాడు. రాజునకు పరంజ్యోతి విజయమునకు కారణము - అతనికి శివునిపై గల అనన్య భక్తి కారణమని చెప్పారు. పైగా అతను సాధారణ మానవుడు కాదని గూడ చెప్పారు. రాజు సహజముగా అచంచల శివభక్తుడు. తను ఒక మహా శివభక్తుని యుద్ధమునకు పంపి రుధిర ప్రవాహమునకు కారణభూతుడనైనానని రాజు మిక్కిలి విచారించి పరంజ్యోతిని పిలిచి తన అపరాధమును క్షమింప వేడెను. అనంత ద్రవ్యరాశులను పరంజ్యోతికిచ్చి - మీరు మీ గ్రామమునకు వెళ్లి శివపూజను నిరాఘాటముగా చేసికొనుడు అని చెప్పెను. పరంజ్యోతి అంగీకరించి తన గ్రామమునకు వచ్చి అనన్య భక్తితో శివపూజ చేస్తూ శివభక్తుల సేవలో నిష్ఠాగరిష్టుడుగా కాలము వెళ్లబుచ్చు చుండెను. ప్రతిదినము ఒక శివభక్తునికి భోజనమిడిగాని తాను

భుజించువాడు కాదు. తాను పరమశివుని చిన్ని సేవకుడు (చిరుతొండడు) నని పిలుచుకొనేవాడు.

పరమశివునికి పరంజ్యోతి భక్తి విశేషాలను లోకానికి వెల్లడి చేయాలనిపించింది. ఒకనాడు శివుడు జంగమదేవర వేషముతో పరంజ్యోతి ఇంటికి వచ్చాడు. ఇంటిదాసి " యజమాని ఆరాధనకై జంగముల కొరకు బయటికి వెళ్లినారు. ఇప్పుడే వచ్చెదరు లోనికి రండని" పిలిచింది. జంగమదేవరలోన ప్రవేశించ లేదు. పరంజ్యోతి భార్య వచ్చి "స్వామీ నా భర్త వచ్చుదనుక లోన వేచియుండు" డని పిలిచింది. జంగమ "నేను పురుషులు లేని చోట ఉండను అందుకని మీ భర్త వచ్చుదనుక గణపతి దేవాలయములో అత్తిచెట్టు క్రింద నుండెదను మీ భర్త రాగానే నన్ను పిలువనంపుడు" అని చెప్పి ఆ జంగమ వెళ్లిపోయాడు.

జంగమ వెడలిన కొద్దిసేపటికే పరంజ్యోతి బిక్షకు ఎక్కడా జంగమను పిలుచుటకు కానక - ఇంటికి తిరిగి వచ్చాడు. భార్య ఆగంతకుని జంగమ గూర్చి చెప్పింది. చిరుతొండడు వెంటనే పరుగుని గణపతి ఆలయమున జంగమ దగ్గరకు వెళ్లాడు. తనకు ఎవరూ ఏ జంగమ, బిక్షకు కనిపించలేదు. దేముడు పంపినట్లుగా ఈ జంగమ లభించాడు అని మురిసిపోయాడు. జంగమ దేవరను సవినయముగా తన ఇంటికి బిక్షకు ఆహ్వానించాడు. జంగమ దేవర 'మీరేనా పెద్ద చిరుతొంగార్' అని తిరిగి కొంత సందేహిస్తూ - ' మీ ఇంటికి వచ్చుటకు నాకు సమ్మతమే. కాని నాకు కొన్ని నియమములున్నవి. అవి మీరు తీర్చగలిగినట్లయితే నేను మీ ఇంటికి రాగలను. మీరు ఆ నియమములు నెరవేర్చలేరేమో అని సందేహముగా వున్నది అందుచే నన్ను విడువుడు' అని పలికాడు. తనను పరీక్షించుటకే దేవుడు ఈ జంగమ దేవరను పంపినట్లుగా భావించి నియమములను తెలుప కోరినాడు. 'ఆరునెలలకొకసారి నేను పశువును వండించుకొని తినెదను, నేడు ఆ దినము అయినది. మీరు పశువును వండించి పెట్టగలరా?'అని జంగమ దేవర నాయనారును ప్రశ్నించినాడు. నాయనారు అట్లే చేయించెదను అన్నాడు. జం

గమ ' నా అభిప్రాయము మీకవగతమైనట్లు లేదు. పశువునకు జంతువు మనిషి అని రెండర్థాలున్నాయి. జంతువు మనిషి అని నా అభిప్రాయము. పశువు అనగా నాలుగు కాళ్ల జంతువుకాదు. రెండు కాళ్ల నరపశువు'అని చెప్పాడు. 'నియమమింతటితో పూర్తి కాలేదు. ఆ నరపశువు కుటుంబమునకు ఆధారభూతుడై యుండాలి. అతనికి అయిదేళ్ల ప్రాయముండాలి. తల్లి పట్టుకొని యుండగా తండ్రి ఆ శరీరాన్ని ముక్కలు చేయాలి. అతను ఆరోగ్యవంతుడై యుండాలి. ఆ మాంసమును చక్కగా వండి నాకు పెట్టాలి. తిను వారిని ఎవరూ తిట్టరాదు, ఈ నియమములను మీరు పాటించగల్గినచో మీ ఇంటికి బిక్షకు వస్తాను' అని జంగమ చెప్పాడు.

పరంజ్యోతి ఈ నిబందనలకు ఒప్పుకున్నాడు. జంగమను తన ఇంటికి బిక్షకు ఆహ్వానించాడు. ఇంటికి వచ్చి పరంజ్యోతి భార్యకు విషయమంతా చెప్పాడు. భార్య అట్టి బాలుడు ఎక్కడ దొరుకును? అనగా 'మన పిల్లవాడే అన్నింటికి తగియున్నా'డని నుడి వాడు.

భార్య ఆనందముతో అంగీకరించి బాలుని బడి నుండి తెప్పించి స్నానము చేయించి పట్టుకొన్నది. పరంజ్యోతి శస్త్ర వైద్యుడగుటచే తేలికగా బాలుని ఖండించాడు. శిరస్సు పనికి రాదని దానికి దాసికిచ్చి భార్య తక్కిన అవయవములనన్నింటిని వండినది. 'ఇందు తల మాంసము కనబడలేదన్నాడు' జంగమ. 'శిరసు పనికిరాదని మానినాను' అని చెప్పింది భార్య. దాసి ' అవి చాలకేమోనని శిరసు గూడ వండినాను' అని శిరసును తెచ్చి వడ్డించింది. జంగమ 'నేను తోడు లేకుండా భోజనము చేయన' న్నాడు. 'ఇవ్వాళ గ్రామమంతా వెదికినా ఒక్క జంగమ దేవర కన్పడలేదు'అన్నాడు పరంజ్యోతి. 'అలా అయితే మీరే తోడుగా నాతో భోజనము చేయడు'అని పరంజ్యోతిని ఉద్దేశించి జంగమ అన్నాడు. పరంజ్యోతి తోడు కూర్చున్నాడు. 'మీ కుమారుని తీసికొనిరండి' అతను గూడ మాతో భోజనము చేయును అని జంగమ అన్నాడు. 'వాడు వచ్చుటకు ఇప్పుడు వీలుగా లేదు' అనగా - 'వీధిలోనికి బోయి రమ్మని పిలువుడు' అని జంగమ సలహా ఇచ్చాడు.

చేయునది లేక తల్లి 'శ్రీయాళా' జంగమదేవర నీతో భోజనము చేయదలిచారు రమ్ము' అని బిగ్గరగా పిలిచినది. శ్రీయాళుడు పరుగున వచ్చాడు. తల్లి పిల్లవానిని పరంజ్యోతి దెసకు తెచ్చింది. పరంజ్యోతి ఆనందముతో 'జంగమ దేవర! సెలవైనది భోజనమునకుప క్రమింపుడు' అన్నాడు. జంగమ దేవర మాయమవుతున్నాడు. వడ్డించిన మాంసము గూడ మాయమైపోయింది.

పరంజ్యోతికి జరిగిన దానికి ఆశ్చర్యమేసింది. కుమారుడు మరల బ్రతికినందుకు ఆనందమైనది. కాని జంగమదేవర భుజింపకుండ అదృశ్యడైనందుకు విచారము కల్గి నది.

ఆ క్షణంలో పార్వతీపరమేశ్వరులు వృషభారూఢుడై ఆకాశమున దర్శనమొసగి పరంజ్యోతిని, అతని ధర్మపత్నిని, శ్రీయాళుని, దాసిని గూడ కైలాసానికి గొనిపోయారు.

# 37. చేరమాన్ పెరుమాళ్ నాయనారు

ఇప్పటి కేరళ రాష్ట్రమయిన మలైనాడులో చేరమాన్ పెరుమాళ్నాయనారు కోడు న్కోలూరులో (మలైనాడు రాజధాని. మహోదయం అనిపేరు గూడ వుంది) - ఉత్తియన్ కుటుంబము కొత్తయార్ల రాజ వంశములో జన్మించాడు. చేర వంశస్తులందరికి చేరమా ను అనునది సాధారణ నామము. పట్టాభిషిక్తుడైన తర్వాత పెరుమాళ్ అని పిలిచేవారు. అసలు పేరు - పెరుమ్ - ము - కొత్తయారు. మంచి సంస్కార వంతుడు. బాల్యము నుంచి దైవభక్తి తత్వరతతో నుండెడివాడు. వయస్సు పెరిగిన (వచ్చిన) కొలది దైవభక్తి గూడ పెరుగుతూ వచ్చింది. విచక్షత, నిష్పక్షపాతము ఆయనలో మూర్తీభవించాయి. పరి పాలకుడుగా నుండాలన్న ఇచ్ఛ ఆయనకు లేనేలేదు. అందుకని వయస్సురాగానే సన్యసిం చి తిరువంజక్కళముకు చేరి అచ్చట శివపూజాదురంధరుడై యుండెను. దేశాన్ని సెన్ గోల్ పోరయాను (చెంగప్పరుడు) పరిపాలించేవాడు. ఆయన గూడ నిత్యానిత్య వివేక ము నెఱిగి మోక్షమునకై ప్రపంచ సంబంధాల నుండి వైదొలగి వెళ్లిపోయాడు. ఆయ నకు సంతతి లేదు. సింహాసనం ఖాళీగా వుంది. అందుకని ప్రజలు తిరువంజక్కళము నకు వెళ్లి పెరుమ్ - మ - కొత్తయారును సింహాసనమధిష్ఠించి రాజ్యాన్ని కాపాడమని అర్థించాడు. తన దైవ ఉపాసనకు అడ్డంకియని ముందర రాజ్యమధిష్ఠించుటకు అంగీక రించలేదు. కాని దైవాజ్ఞ - అతను పరిపాలకుడవాలని. దేవళమునకు వెళ్లి దేవుని ప్రార్థిం చాడు. పరమాత్మ అతనిని రాజువు కమ్మని ఆదేశించాడు. నీవు రాజువయితే ప్రజలు నిన్ను అనుసరిస్తారు. రాజువై నీవు శైవాగమమును వ్యాపింపజేయవచ్చును. అందుకని రాజువుకా అని పరమాత్మ ఆదేశించాడు. దైవాజ్ఞ మూలాన్ని సింహాసన మధిష్ఠించి న్యాయవంతముగా బుద్ధికుశలతతో పరిపాలన చేశాడు. ఆయనకు అన్ని భాషలు, చివ రకు పక్షుల భాష గూడ తెలుసును. దేవుడు అష్టైశ్వర్యాలు, బలం, రాజవాహనాలు అన్ని ఆయనకు ప్రసాదించాడు.

పట్టాభిషిక్తుడైన పిదప దేవాలయమునకు వెళ్లి అర్చించి తిరిగి వస్తుంటే ఒక చాకలివాడు దేహమంతా విభూతితో కనిపించాడు. ఆ దృశ్యము చేరమానుకు సాక్షాత్తు పరమ శివుని చూస్తున్నట్లు అన్పించింది. అందుకని ఏనుగు దిగి చాకలిని అతను వారి స్తున్నా వినకుండ మ్రొక్కాడు. చేరమాను యొక్క అనితర భక్తి అందరకు గోచరమైంది.

చేరమాను పవిత్ర జీవనము, భక్తి ప్రపత్తులు పరమ శివుని ముగ్ధణ్ణి చేశాయి. పెరుమాళ్ళు అనేక శివాలయములను దర్శించి పరమ శివుని సేవించి స్వస్థలముకు చేరుకున్నాడు. మధుర సోమసుందరేశ్వరుడు తన భక్తుడైన బాణాపతిరారు (బారాభ ద్రుడు) నకు సకలైశ్వర్యములు ఒసగదలచితిని. చేరమాను పెరుమాళ్ పేరున ఒక చీటీ నిచ్చెదను. దానిని తీసికొనిపోయి అతనికిమ్ము. అతను సకలము నెరవేర్చును ' అని చెప్పి చీటిఇచ్చెను. ఆ చీటి (తాళపత్రము)లో దైవము సోమసుందరారు రచించిన గీతము న్నది. దాని అర్ధము ఇలా వుంది. 'కవులను పండితులను సమాదరించే, ప్రజలను న్యాయ వంతముగా పరిపాలించే ఓ మహారాజా! నీకు జయము, జయము నీ భక్తి తత్పరత, దయార్ద్ర హృదయత, దాతృత్వము నన్ను ఆకట్టుకున్నాయి. ఈ తాళపత్రము గొని తెచ్చునా తని పేరు బాణపతిరారు. గొప్ప సంగీత విద్వాంసుడు. నీలీతి పరమ దైవభక్తి తత్పరుడు. నన్ను గూర్చి అతనికి ఇష్టమైన 'యాజు' (వీణ) మీద నన్ను కీర్తిస్తూ పాడుతూ వుంటాడు. నిన్ను చూడాలని అభిలషిస్తున్నాడు. అతనిని సాదరంగా గౌరవపురస్సరంగా ఆహ్వానించి అనంత పురస్కారములనిచ్చి గౌరవించవలసినది" అని వుంది.

చేరమాను ఆ విద్వాంసుని ప్రేమతో, గౌరవంతో ఆహ్వానించాడు. "సోమసుందరే శ్వరస్వామికి నేటికి నా మీద అనుగ్రహము కలిగినదా" యనికొని యాడుచు చీటి (తాళపత్రము) సంగతి మంత్రులకు తెలియజేసి "కోశమున సకలమును బాణాపతిరారు ఇంటికి తరలించుడు" అని ఆజ్ఞాపించి బాణాపతిరారు దెసతిరిగి"స్వామీ ఈ రాజ్యమును గూడ స్వీకరించి మీసేవ చేయ నంగీకరింపవలయు"నని ప్రార్ధించాడు. అందులకు బాణాపతిరారు నిర్ఘాంతపోయాడు.

రాజుగారి పరమ భక్తితత్వరత అర్థమైంది. "ఓ రాజా! మీ దర్శనంతో నా జీవితము ధన్యమైంది. నాకు వలసినంత మాత్రమే మీ దగ్గర నుంచి తీసికొనగలను. అది దేవుని ఆజ్ఞ గూడ " అని చెప్పి తనకు వలసినది తీసికొని రాజుకు వందన మాచరించి తిరిగి వెళ్లాడు. చేరమాను ఆయనను ఏనుగు మీద ఎక్కించి పంపాడు. తన రాజ్యము పొలి మేర దాక ఆయనతో వెళ్లి ఆయనను సాగ నంపాడు.

చేరమానుకు నటరాజస్వామి యెడ బహు ప్రీతివుంది. తన శరీరము, మనస్సు, ఆత్మను గూడ ఆయనకే అర్పణ మొసగాడు. ప్రతిరోజు ఆయనను అర్చించేవాడు. ఆయన అర్చించే సమయములో నటరాజస్వామి (కనకసభాపతి) మూపుర ధ్వనులు (కాలిఅం దెల) స్వామి నృత్యము చేస్తున్నట్లు వినిపించేది. ఒక రోజున అర్చన సమయంలో కాలి అందెల ధ్వని వినపడలేదు. చేరమాను తాను మహాపరాధము చేసితినని భావించి తన ఖడ్గముతో మరణమునకు ఉద్యుక్తుడయ్యాడు. వెంటనే మూపురధ్వని వినపడింది. ఆకా శము నుండి ఒక వాణి వినిపించింది. ' నా మిత్రుడు నంబిఅరూరారు తిల్లై వచ్చాడు. ఆయన మధురమైన పాటలను వింటూ తన్మయుడనైనాను. అందుకని నా మూపురధ్వ నులలో నిన్ను ఆశీర్వదించుటకు ఆలస్యమైంది." పరమ శివుడు - సుందరారు, చేరమా ను ఇరువురు మిత్రులవాలని వాంఛించాడు. అందుకని సుందరార్ గూర్చి గొప్పగా చెప్పా డు. చేరమాను నటరాజును అర్చించుటకును సుందరారును దర్శించుటకును తిల్లైకు వెంటనే బయలుదేరాడు. చేరమాను తిల్లైచేరే సరికే సుందరారు ఆ స్థలము వదిలి వెళ్లి పోయాడు. అందుకని చేరమాను తిరువారూరు వెళ్లి అచ్చట సుందరారును కలిసికొన్నా డు. ఒకరినొకరు సాష్టాంగ ప్రణామములు చేసికొన్నారు. ఒకరినొకరు భక్తితో పరిష్వంగ నం చేసికొన్నారు. తిరువావూరులో చేరమాను విఖ్యాతినందిన "తిరుమమ్మనికోవై" కృతి ని దేవదేవుడైన త్యాగరాజు మీద రచించి పాడాడు.

ఇద్దరు కలిసి వేదారణ్యం వెళ్లారు. అక్కడ చేరమాను 'తిరుఅంతాది' కృతిని దేవుని మీద పాడాడు. చాల దేవళములను సందర్శిస్తూ ఇద్దరు మధుర చేరుకొన్నారు. పాండ్యరాజు సాదరముగా వాళ్లని ఆహ్వానించాడు.

ఆ సమయంలో అక్కడ యున్న చోళ యువరాజుగూడ గౌరవించాడు. వాళ్లతో కలిసి చాలా దేవాలయములను ఇద్దరూ సందర్శించారు. వారి దగ్గర నుండి సెలవు తీసికొని చేరమాను, సుందరారు తిరువారూరునకు చేరారు. చేరమాను కోరికపై సుందరారు కొడున్‌కోలూరు దనుక చేరమాను వెంట వెళ్లాడు. అచ్చట చేరమాను సుందరారును ఏనుగుపై వూరేగించి సత్కరించాడు. సుందరారు తిరిగి వెళ్తూ చేరమానును - రాజ్యమును న్యాయవంతముగ నేర్పుతో పరిపాలించ వలసినదిగా చెప్పాడు. భక్తుని కోరికను చేరమాను తూచాతప్పక పాటించసాగాడు.

మరి ఒకసారి చేరమానుతో సుందరారు కొడున్‌కోలూరులో వున్నప్పుడు - సుందరారు వంటరిగా తిరు అంచైకాలము కోవెలను సందర్శించాడు. అచ్చట తనను సంసార ఇహలోక బాధ్యతలనుండి తప్పించి కైలాసమునకు తీసికొనిపొమ్మని శివుని అర్థించాడు. మహాదేవుడు అతని అభ్యర్థనను మన్నించి తెల్ల ఏనుగుపై కైలాసానికి సుందరారును తెచ్చుటకు ప్రమధగణాన్ని పంపాడు. చేరమానుకు సుందరారు కైలాసానికి చేరుతున్నట్లు తట్టింది. తాను గూడ తన భద్రాశ్వమును అధిరోహించి దాని చెవిలో పంచాక్షరి మంత్రమునుచ్ఛరింపగా అది చేరమానును సుందరారు వద్దకు తృటిలో చేర్చింది. సుందరారును కలిసికొన్నాడు. ఇద్దరు కలిసి కైలాసంకు చేరుకొన్నారు.

కైలాసంలో ద్వారపాలకులు ఒక్క సుందరారునే లోనికి ఆహ్వానించారు. సుందరారు దేవుని దగ్గరకు వెళ్లి నుతించాడు. నుతించి, చేరమాను గేటు బయటయున్నాడని చెప్పాడు. తన స్నేహితుని మురిపించుటకు పరమశివుడు తన వాహనమైన నందికేశ్వరుని పిలిచి చేరమానును తీసికొనిరమ్మని పంపాడు. శివుడు చేరమానును తన అనుమతిలేనిదే కైలాసానికి ఎలా రాగలిగావు' అని ప్రశ్నించాడు. "సుందరారు కైలాసమునకు

బయలుదేరుట చూచాను. అతని వియోగము భరించలేక అతనితో వచ్చాను" అని చేర మాను బదులు చెప్పాడు. శివుడు చేరమానును వాత్సల్యంతో కైలాసానికి ఆహ్వానించాడు.

ఈ సంఘటనలో చేరమాను ఒక మహాసత్యాన్ని వెల్లడించాడు. ఒకడు అనర్హుడైనను గురువు (ఋషికి)కు ఆత్మీయుడవగలిగినచో గురువు తనతోబాటు తన శిష్యునికి గూడ భగవత్ సాన్నిధ్యము ఇప్పించ గలడన్న సత్యము ప్రస్ఫుటమైంది.

పరమశివుడు చేరమానును తన ప్రధమ గణాధిపతిగా చేసికొన్నాడు.

****

## 38. గణనాథ నాయనారు

గణనాథార్ సర్కాలిలో నున్న పవిత్ర బ్రాహ్మణుడు. పరమ శివభక్తుడు. అందరూ ఆయన విశిష్ట జీవనమును కొనియాడేవారు. భక్తితో ఆయన దగ్గరకు సలహాల నిమిత్తము వచ్చేవారు. వచ్చిన ప్రతివానికి వారు జాపిన కొలది చేయగల దేవాలయ పనిని ఒక దానిని అప్పజెప్పేవాడు. ఒకరు దేవాలయమును పరిశుభ్రముగా వుంచేవారు. ఒకరు పూలమాలలు దేవునికి గ్రుచ్చి ఇచ్చేవారు. ఒకరు తోటపని చేసేవారు. ఒకరు దేవునికి దీపములు అమర్చేవారు.

వారికి భక్తి ప్రపత్తులు నేర్పి వారిని మంచి శివభక్తులనుగా చేసేవాడు. జ్ఞాన సంబంధార్ యెడ బహుప్రీతి. ఈ పనుల మూలాన్ని పరమ శివునికి గణనాథార్‌పై మంచి కృప గల్గింది.

భక్తి విషయంలో ఇంకో సులభమైన ప్రక్రియ వుంది.

దేవుని గూర్చి, దైవలీలలను గురించి, భక్తిని గూర్చి ఇతరులతో సంభాషించడం. ఈ పని మూలాన్ని నీ ఆధ్యాత్మిక వికాసము వెల్లివిరుస్తుంది. ఎవరు అనవసర ప్రసంగము చేయరు. నీవు చేయనీయవు. నీ వర్తన కొందరికి ముందర రుచింపకపోవచ్చు. కాని త్వరలో వారంతటవారే నిన్ను అవగాహన చేసికొని నీకాలము వృథా చేయరు. అప్పుడు చాలామందిని దైవము, ధర్మముల యెడ ఆకర్షితులనుగా చేసి వారి మనస్సును దైవము మీద కేంద్రీకృతము చేయవచ్చును. ఈ యోగ ప్రక్రియ మీకు గూడ ఉపయోగపడుతుంది. కృషి చేయండి. అద్భుతమైన పరిణతను విశేషాల్ని చూడండి!.

****

## 39. కూట్రువ నాయనారు

ఈ యోగి కాలంద్రై ప్రధానాధికారి. మహాశివభక్తి దురంధరుడు. ప్రతిరోజు పం చాక్షరిని జపిస్తూ భక్తుల సేవ చేసేవాడు. దేవుడు ఆయనను సమర్ధవంతుడుగ, శక్తి మంతుడిగ, మహాధనవంతుడుగ చేశాడు. చోళ పాండ్య రాజ్యములలోని ప్రదేశములను చాల స్వాధీనము చేసికొన్నాడు. మూడువేల మంది బ్రాహ్మణులను తిల్లైలో (చిదంబర ములో) తనను మూర్ధాభిషిక్తునిగా చేయనభిలషించాడు. వారలు చోళరాజు అధీన ములో నున్నందున అంగీకరించలేదు. ఆయన ఆగ్రహముకు వెరచి - ఒక్కడు తప్ప అం దరూ ఆ రాజ్యము వీడి వెళ్లిపోయారు. ఒక్కడే పూజకు మిగిలాడు. అతను కూడా నాయ నారు కోరికను మన్నించలేదు. అందుకని ఒకరోజున నాయనారు దేవుని ప్రార్ధించాడు. ఆ ప్రార్ధన ఫలము అన్నట్లు దేవదేవుడే ప్రత్యక్షమయి తన కాళ్లను అతని తలపై పెట్టి అత నిని మూర్ధాభిషిక్తునిగా చేశాడు. నాయనారు శివుని నిరంతరము కీర్తిస్తూ అంత్యమున పరమ శివుని సాన్నిధ్యము చేరుకున్నాడు.

నాయనారు కోరికను … మనలోనే వున్న దేవుడు అర్ధము చేసికొన్నాడు. మూడు వేల మందిని తనను మూర్ధాభిషిక్తునిగా చేయుమనుటలో - అతని ఉద్దేశ్యము కిరీట ము దేవుని పాదల చిహ్నమని. బ్రాహ్మణులు భయపడగా దేవదేవుడు నిజముగా తన పాదాల్నే అతని శిరమున పెట్టాడు. నాయనారు కోరికను నెరవేర్చాడు.

***

# 42. ఆదిపత్తనాయనారు

ఆదిపత్తనారు ఒకయోగి. నాగపట్టణము దగ్గర నున్న నూలైపాడిలో జన్మించిన ఒక మత్స్యకారి. ప్రతిరోజు చేపటు పడుతూ - పట్టిన చేపలలో ఒక చేపను నిష్టగా పరమేశ్వరునికి నైవేద్యముగా నీటిలో వదిలి వ్రేసేవాడు. శివుడు ఆతని గొప్పదనమును ఆవిష్కరింపదలచాడు.

వరుసగా కొన్ని రోజులు ఒకటే చేప వలలో పడుట తటస్థించింది. శివుని పేరుతో ఆ అన్ని రోజులు వలలో పడిన ఆ ఒక్క చేపను నీటిలో వదిలేశాడు. అతనికి ఆహారము లేకపోయేది. అయినా తన నిష్ట తప్పలేదు. ఒకరోజున వింతగా ఒక్కటే చేప బంగారు చేప వలలో పడింది. తన వ్రతాన్ని అనుసరించి మరువక, ప్రలోభపడక అది బంగారు చేప అయినా సరే - ఆ ఒక్క బంగారు చేపను శివునికి నైవేద్యముగా నీటిలో వదిలేశాడు.

శివుడు ప్రత్యక్షమయి నిరక్షరకుక్షి అయిన ఆ మత్స్యకారి శివయోగిని ఆశీర్వదించాడు.

విద్వత్తుతోగాని, ప్రాణాయామ విధులతోగాని, వినుటచేగాని, ఎక్కువగా అనుచటే గాని - కాక - ఒక్క నిశ్చల భక్తితోనే భగవంతుడు భక్తసులభుడవుతాడు. నమ్రత స్వభావుడు, మనం తక్కువగా నెంచే మత్స్యకారి యోగి దారి చూపాడు. నిష్ట అనేది వెంటనే పొందలేము. దేవుని యందు నిరతిశయమైన భక్తి, గాఢ నమ్మకముతోనే నిజమైన జ్ఞాన లబ్ధి లభిస్తుంది. జీవుడు శివుడు కాగలడు. మనసు అనేక ప్రలోభాలతో మనలను మార్చేస్తుంది. నిష్ట నుండి తప్పిస్తుంది. అజ్ఞానులు పుస్తకాలపై ఆధారపడతారు. మంచి పండితునికి వ్యాకరణంతో పనేముంది. దేవుని ప్రత్యక్ష స్వరూపునిగా చూడగలవానికి పద సౌలభ్యత పరిజ్ఞానము ఎందులకు? వైదుష్యము నిరతిశయ భక్తికి తోడ్పడిననే ఉపకరిస్తుంది. లేనిచో ప్రతిబంధకమవుతుంది. గాఢమైన భక్తే అచంచల భక్తే మనను దరిచేర్చగలదు.

****

# 40. పూగల్ చోళనాయనారు

పూగల్ చోళనాయనారు చోళదేశములో ఉరైయూరు రాజు. శివునిని, ఆయన భక్తులను భక్తితో అభిమానించేవాడు. ఆయన తన రాజ ధర్మములను చక్కగా నిర్వర్తిం చేవాడు. మంచిరాజుగా ప్రఖ్యాతినొందాడు. ప్రజలు ఆయన్ను అభిమానించి అనుసరించే వారు.

ఒకనాడు కుడనాడు రాజుల నుంచి కప్పమును వసూలు చేయుటకు కరూరు వెళ్లాడు. అందరూ కప్పమును వెంటనే చెల్లించేసారు, ఒక ఆదిగన్ అనే చిన్నరాజు మాత్ర ము కప్పమును చెల్లించలేదు. నాయనారు వెంటనే ఆదిగన్ కోటమీద తన అనుచరు లను దండుకు సిద్ధంకమ్మన్నాడు. ఈలోగా ఒక శివాపరాధిని రాజుగారి ఏనుగను ఎరి పాత నాయనారు చంపాడు. ఏనుగును చంపిన వానిని శిక్షింప తలపుతో వెళ్లినరాజు - ఏనుగు శివాపరాధానికి ఎరిపాత నాయనారుచే చంపబడినదని తెలుసుకొని, అటు వంటి ఏనుగును, మావటీండ్రను తాను పెట్టుకున్నందుకు ఈ అపరాధము జరిగిందని ఎరిపాతనాయనారు విధించిన శిక్ష అల్పమని, అందుకని తన ప్రాణాన్ని గూడ ఒడ్డబోగా, రాజుగారి ఔన్నత్యము చూచి పరవశము చెంది రాజుగారికి బాధ కలిగించినందుకు ఆ కత్తిలాక్కొని తన కంఠం ఉత్తరించుకోబోగా - ఇదంతా పరమేశ్వరుని లీల అని అశరీ రవాణి చెప్పింది. ఏనుగు మావటీండ్రు అంతా బ్రదికారు. చివరకు ఎరిపాతనాయనా రుకు రాజుగార్కి పరమశివుని దర్శనమయినది.

ఇక్కడ ఇది జరుగుతూంటూ రాజు గారి సైన్యము ఆదిగన్ కోటను ధ్వంసము చేశారు. ఆదిగన్ మనుజులను చాలామందిని చంపారు. ఆదిగన్ పారిపోయాడు. పూగ ల్ చోళుల సైన్యము బోలెడు ధనరాశులతో, చంపిన వారి తలలను తీసుకు వచ్చారు. ఇవన్నీ రాజుగారి కాళ్ల ముందు పెట్టారు. ఆ ఉత్తరింపబడిన తలలలో ఒక శివభక్తుని తల గన్పించింది. రాజు విపరీత దుఃఖమునకు లోనైనాడు. పాపవిముక్తుడగుటకు ఆ శివభ క్తుని తలను ఒక బంగారము పెళ్లెరమున నుంచి తన చేతితో ఆ పళ్లెమును పట్టుకొని పంచాక్షరి మంత్రమును జపిస్తూ అగ్ని ప్రవేశమును చేసి దేవదేవుని సాన్నిధ్యమునకు చేరినాడు.

## 43. కలికాంబ నాయనారు

కలికాంబ నాయనారు వైశ్యకులంలో జన్మించాడు. మంచి శివభక్తుడు. పెన్నగడం లో నివాసము. ప్రతిరోజు శివాలయంలో ఏదో ఒక రకం సేవ చేస్తుండేవాడు. శివభక్తు లలో ఎల్లప్పుడు అతను శివునే చూచేవాడు. వారి యందు విధేయుడుగా వుండేవాడు. అతని భార్య గూడ అతనికి అన్ని విషయాలలోనూ సహాయకారిగా నుండేది.

ఒకరోజున కలికాంబ నాయనారు దగ్గర లోగడ పనిచేసిన సేవకుడొకడు శివ భక్తుడుగా నాయనారు ఇంటికి విచ్చేశాడు. నాయనారు యథావిధిని అతనిని ఆహ్వా నించి, కాళ్లను కడిగి శివభక్తులను పూజించే రీతిని పూజించాడు. అతని భార్య వచ్చి నతను తమ పూర్వపు సేవకుడే అని గ్రహించి, చిన్నతనముగా భావించి భర్త శివభక్త పూజలో పాల్గొనలేదు. నాయనారు భార్య అవిధేయత గమనించాడు. అందుచే ఆమె చేతిని ఖండించి - ఆ వచ్చిన భక్తుని సేవలో నిమగ్నుడయ్యాడు. ఈ రకమైన తారతమ్య మెరుగని నిరతిశయభక్తియోగ సాధనకు మురిసి శివుడు నాయనారుకి సాయుజ్యా నిచ్చాడు.

నారద మహాముని ప్రవచించిన నారద భక్తి సూత్రాల్లోని సత్యాన్ని కలికాంబ నాయనారు అనుష్ఠించి చూపాడు. దేవుని భక్తులలో కులము, వర్ణము, పదవి, నమ్మ కము, తారతమ్యమును మనము చూడరాదు. ఆ విభేదాల్ని ఎన్నడు తలచకూడదు. చూచినచో అది దైవాపరాధమే అవుతుంది. ఆయన యెడ అందరూ సమానులే. భక్తులు దైవముతో సమానము. భక్తుడు దేవుడే. వారి గత జీవితము అసలే మన కక్కర లేదు.

## 41. నరసింగ మునియారయ్యరు

నరసింగముని యారయ్యరు తిరుమునైపాడిలో వుండే యోగి. ప్రధానాధికారి. శివపూజాదురంధరుడు. శైవమతవ్యాప్తికి ప్రధానుడు. ప్రతి తిరువాతిరాయి దినమున ప్రత్యేక శివపూజను గావించి తారతమ్యము లేకుండ అందరు శివభక్తులకు భోజనమిడి 100 సువర్ణనాణెములు నిచ్చువాడు. ఒకరోజున అలా చేస్తుంటే, ఒక శివభక్తుడు దిస మొలతో ఒడలంతా బూది పూసుకొని వచ్చాడు. అతనిని చూచి మిగతా భక్తులు చీద రించుకొన్నారు. నాయనారు ఇది గమనించాడు. ఆగంతకుని కాళ్లకు మొక్కి అందరి కన్న గౌరవముతో ఆహ్వానించి చక్కని విందు ఇచ్చి 200 సువర్ణ నాణెములు ఇచ్చి అత నిని సత్కరించాడు. పరమ శివుడు ఇదిచూచి చాలా సంతసించి తన అపార కృపను నరసింగమునియారయ్యరు పై జూపాడు.

ఇది ఒక మంచి ఉదాహరణ. యోగులు భవ్య జీవితమును సౌమ్యంగా ఆవిష్కరి స్తారు. మనుజులలో దృక్పథంలో మార్పును బహుసున్నితంగా తెస్తారు. నాయనారుకు అం దరు శివభక్తులు పరమశివరూపములే. దిసమొలతోనున్న భక్తుడికి వేరొక భక్తునికి తార తమ్యము లేదు. నాయనారుకు వారియెడ ఎటువంటి జుగుప్స, దురభిప్రాయము లేదు. తాను స్వయంగా చేసి చూపి మిగతా వారల మనస్సులలో మంచి మార్పును తేగలి గాడు. తారతమ్యతను వాళ్ల దృక్పథంలో నుంచి తొలగించగలిగాడు.

***

# 44. కాలియ నాయనారు

కాలియ నాయనారు తిరువొత్రియూరులో నూనె వ్యాపారి. అతని శివభక్తి అపురూపము. శివైక ధ్యాన తత్పరముతో ప్రతిరోజూ నిష్టగా దేవళము నందు జ్యోతులు ప్రజ్వలనములో నిమగ్నుడయేవాడు. సహజముగా ధనవంతుడు. అతని భక్తిని లోకము నకు వెల్లడి చేయదలంచి మహాదేవుడు అతని ధనమంతయు కరిగించి వేసి పేదవా నిగా ఒనర్చాడు. అతని కుటుంబీకులు గూడ అతనికి సహాయము చేయ నిరాకరిం చారు. అందుకని దీపారాధన చేయుటకు కూలివానిగా గూడ అతడు పని చేయవలసి వచ్చింది. ఇది కూడా కుదరనీయలేదు. ధనము కోసము హరిశ్చంద్రుడులా తన భార్యను గూడ అమ్మ ప్రయత్నించాడు. ఎవ్వరును కొనుటకు ముందుకు రాలేదు. మూర్ఛవచ్చే పర్యంతమయి దరిగానక తన కంఠము నుత్తరించుకొని నూనెబదులు ఆ రక్తముతో దీపారాధన చేయ ప్రయత్నించాడు. శివుడు ప్రత్యక్షమై అతని చేతిని పట్టుకొని ఆ ప్రయ త్నము నుండి విముక్తిణ్ణి చేసి కాలియనాయనారుకు సాయుజ్యమను గ్రహించాడు.

ఇందులో కాలియనాయనారు నిరతిశయభక్తి - భక్తి విషయములో తన స్వకీ య మాన ప్రాణాన్ని గూడ విస్మరించి దైవ కర్తవ్యమునకు అతని నిరంతర శ్రమను మన ము చూస్తాము. దైవ కర్తవ్యతాచరణమే అతని ఏకైక లక్ష్యము. అతను ఇంకే విషయము లు ఆలోచించలేదు. ఆచరణయే పరమావధి. ఎన్ని అడ్డంకులు వచ్చినా లెక్క చేయలేదు. ప్రలోభాలు గాని, వేరొక ఆలోచనలు గాని అతను తన మది దరికి రానీయలేదు. కష్టాల్లో, అడ్డంకులు దాటుటకు మార్గాల నన్వేషించాడు. తొణకలేదు. బెణకలేదు. ఇదే శివుని చేరుటకు మార్గసోపానమయింది.

# 45. సత్తి నాయనారు

సత్తి నాయనారు వెల్లాల కులస్తుడు. వరింజియూరులో జననము. ఇది చోళదేశ ము లోనిది. నిరంతర శివధ్యానైక తత్పరుడు. శివుణ్ణి అర్చించేవాడు, శివభక్తులను సత్క రించేవాడు. శివునిగాని, శివభక్తులనుగాని - దూషణ సహించేవాడు కాదు. ఎవరైనా దూషణకుపక్రమిస్తే, వాని నాలుకను కోసేవాడు. పరమశివుడు ఇతని అచంచల భక్తికి ముగ్ధుడై అతనికి ముక్తినిచ్చి తనలోకానికి గొంపోయాడు.

ఈతని జీవితంలో నాయనారు యొక్క అచంచల భక్తి ఒక్కటే కాదు మనకు గోచరమయ్యేది. ఎన్నడూ మునులను, శివభక్తులను దూషింపరాదు. వారు- దైవము ఒక్కరే. వారిని దూషించితే దైవమును దూషించినట్లవుతుంది. దైవదూషణ చాలపెద్ద తప్పు. శివభక్తులతో తర్కించరాదు. వారు పరమాత్ముని దెసలో ప్రయత్నిస్తున్న వారలు. వారి మనోస్థానము ఇంకో పరిధిలో వుంటుంది. యోగుల ప్రవర్తనము మనకు కొన్ని సం దర్భములలో ఎబ్బెట్టుగా కన్పడవచ్చు. ఒక్కోసారి వారు చిన్నపిల్లలుగా ప్రవర్తిస్తారు. ఒక్కప్పు డు పిచ్చివాళ్లలా కనిపిస్తారు. ఒక్కక్కప్పుడు వట్టి చిల్లర మనుష్యులుగా గూడ గోచరి స్తారు. అయినా మనం వాళ్లను పూజించాలి. వారిని గూర్చి చెడు అనరాదు. వినరాదు. వాళ్ల తప్పులు వెదుకరాదు. మన పురాణాలు చెబుతాయి : 'యోగులను గాని ఎవరైనా నిందిస్తే యోగుల పాపకర్మలు నిందించిన వారికంటుకుంటాయి' అని. మన బుద్ధిపెడ బుద్ధికారాదు. తస్మాత్ జాగ్రత్త! యోగులనుగాని, భక్తులను కాని, నీ సమక్షంలో నింది స్తుంటే ఆ స్థలమును విడిచి వెంటనే వెళ్లిపో. లేని ఎడల నీ ఆధ్యాత్మికస్థితి దిగజారు తుంది.

# 46. అయ్యాదిగళ్ కడవరకోన్ నాయనారు

అయ్యాదిగళ్ కడవరకోన్ నాయనారు పల్లవ రాజేంద్రుడు. కంచిని పరిపాలించాడు. తన ప్రజలలో శైవమతమును ఉద్దీపింపజేశాడు.

ఆయనకు ప్రపంచముపై విరక్తి కలిగింది. తన కుమారునకు పట్టము గట్టి వివిధ దివ్య శివస్థలముల దర్శించుటకు తీర్థయాత్రకు పయనమయ్యాడు. త్రోవలో అన్ని దేవళములలోను దేవుని సంకీర్తిస్తూ కొలిచాడు. ఈయన భక్తి ప్రపత్తులకు పరమశివుడు అలరి - అతనికి సాక్షాత్కరించాడు.

అందరు రాజులకు సంఘసేవకులకు ఈయన వరవడి చూపాడు. ఆచరణలోనే నేతను గౌరవిస్తారు. పవిత్రత, నిరతిశయభక్తి పుణికి పుచ్చుకోవాలి. దైవత్వము వెల్లి విరియాలి. తన ప్రజలు తన మార్గంలోనే నడుస్తారు. అందుచే - వాళ్లందరికి సన్మార్గమే చూపాలి. తాను ఆ మార్గంలో నడుస్తూ అందరకు ఆ మార్గమందు అభినివేశులనుగా చేయాలి. లేని యెడల వాళ్ల చెడుకర్మలు, పాపము నేతకు అంటుకుంటుంది.

నాయనారు అందరి హృదయాల్లో, ఈనాటికి ఉండుటకు కారణము ఆయన నుడివినది తాను ఆచరించి చూపారు. ఆయన జీవితమే సోదాహరణము. ఈయన భక్తి తత్పరత, నిరతిశయభక్తి, పరమేశ్వర ధ్యాస అందరిని ఆకట్టుకుంది. ఆయనను అమరులుగా చేసింది.

## 47. కానమ పుల్ల నాయనారు

కానమ పుల్లనాయనారు చరిత్ర కొంతవఱకు కాలియనాయనారు చరిత్రను పోలివుంటుంది.

కానమ పుల్లనాయనారు తిరుక్కువేలూరులోని భాగ్యవంతుడు. ఈయన మహా శివ భక్తుడు. తన భాగ్యమును శివుని సేవలోనే ఉపయోగించాలని తలచేవాడు. నిరతిశయ భక్తితో శివాలయాల్లోజ్యోతులను వెలగించుచు పరమశివుని కీర్తిస్తూ ఉండేవాడు. పరమశివుడు ఈయన భక్తి ప్రపత్తిని అందరకు తెలియ పరచాలనుకున్నాడు.

శివ సంకల్పముతో నాయనారు ఆస్తి హరించి పోయింది. నాయనారు చిదంబరము చేరాడు. అక్కడి తనకు మిగిలిన ఆస్తులను అమ్ముచు ఆ వచ్చిన ధనముతో తన దీప సేవ కొనసాగించాడు. ఈ కాస్త డబ్బుకూడా కరిగిపోయింది. గడ్డికోసి ఆ గడ్డిని అమ్మి, ఆ డబ్బుతో దేవునికి నేతి దీపారాధన చేయుటకు పూనుకున్నాడు. గడ్డి కోసే పని చేస్తున్నందుకు కానంపూల్ అనే పేరుతో నాయనారును పిలిచేవారు. ఒకరోజున ఆ గడ్డి కూడా అమ్మలేక పోయాడు. అయినా తన నిష్ఠ నుండి తొలగిపోలేదు. అయినా దీపారాధన విరమించటం ఇష్టం లేక తన తలవెండ్రుకలనే పరచి వాటితో దీపారాధన చేయ బోయాడు. పరమశివుడు తన భక్తుని రక్షించటానికి వెంటనే ప్రత్యక్షమయి అతనిని సేదదీర్చి ముక్తిని ప్రసాదించాడు.

# 52. మునైయడువార్ నాయనారు

మునైయడువార్ నాయనారు ఋషి వెల్లాల కులస్తుడు. చోళ రాజ్యములోని తిరునిడూరు వాసి. శివభక్తులన్నా, శివుడన్నా విపరీతంగా ప్రేమించేవాడు. నిరాశాపరులకు, బలహీనులకు, అణగద్రొక్కబడ్డవారికి - పెద్ద అండగా, వారికి ఆశాజ్యోతిగా వుండేవాడు. ఆయనను ఆశ్రయించి, వారు, వారి ఓటమి నుండి తప్పించుకొనేవారు. ఎవరినైనా రక్షించుటకు పోరాటమునకు సిద్ధపడేవాడు. వారిని రక్షించటానికి మూల్యము తీసికొని ఆ మూల్యమును శివభక్తులకే వెచ్చించేవాడు. శివభక్తులను పరమాదరించేవాడు. ఈ విధంగా మూల్యమును సంపాదించి శివభక్తులను కొలుచుటచే ఆయనని మునైయడువారు అని పిలిచేవారు. శివుడు ఈతని పరమ భక్తితత్త్వమున కాకర్షింపబడి సాయుజ్యమొసగినాడు.

ఈతని జీవితము నుండి రెండు పాఠాలు మనము గమనించి తీరాలి. మొదటిది ఈయనకు భగవంతుడు - ఇతరులను రక్షించేందుకు బలము, శక్తియుక్తులు ఇచ్చియున్నాడు. నాయనారు ఆ శక్తులను నిరాశాపరులైనవారిని, బలహీనులను, అణగద్రొక్కబడినవారిని రక్షించేందుకు మాత్రము ఉపయోగించాడు.శక్తిబలము గూడ దైవ నిదర్శనము. వాటిని న్యాయంగా ఉపయోగించాలి. రెండవది. అలా న్యాయంగా ఉపయోగించటంలోని ఫలము శివార్పణము చేయాలి. భగవద్గీత,ఋషులు మునులు ఇదే చెబుతున్నవి. నీవునీ పని చేయాలి. ఫలితము దేవునికి అర్పణ చేయి. మంచిదైన నడవడి ఫలితము దైవార్పణతో స్వార్థం లేనిదై వుండాలి. స్వార్థము అన్ని దోషములకు, వాని మూలమున వచ్చు కష్టాలకు మూలకారణమవుతుంది.

## 48. కరినాయనారు

కరినాయనారు అత్యంత శివభక్తులలో ఒకడు. తిరుకడవూరు వాసి. తమిళంలో మహాపండితుడు. ముగ్గురు రాజుల వద్దకు వెళ్లి తమిళకోవైలను పాడి ఆ పాటలకు రాజు లిచ్చిన అనంత ధనరాసులతో గుళ్లు కట్టించేవాడు. ఈ విధంగా శైవమతాన్ని వ్యాప్తి నొన రించాడు. శివభక్తులను గూడ చక్కగా ఆదరించేవాడు. ఈ విధంగా శివునికి అత్యంత ఇష్టుడైనాడు.

నిజమైన భక్తుడు దేవుని కొఱకే జీవిస్తాడు. నాయనార్ తనకున్నదంతా శివార్చన కొఱకై వినియోగించాడు. నీ జన్మ భగవంతుని సృష్టి. నీ తల్లి, తండ్రి ఆయనే. నీ గురువు, స్నేహితుడు గూడ భగవంతుడే. నీకు బహుధా శక్తియుక్తుల ప్రసాదించాడు. నీకు వివిద వనరుల ననుగ్రహించాడు. ఇదంతా భగవదనుగ్రహమే. అంతా భగవంతునికి చెందినదే. భగవంతుడు సర్వాంతర్యామి. అందరిలో వున్నాడు. భక్తులు వారి సహాయ సంపత్తులు భగవదర్పితంగా అందరిసేవలో వినియోగించాలని అభిలషిస్తాడు. ఇది ధర్మపరులు ప్రవ చించిన ధర్మ సూక్ష్మము. అందరిలోను భగవంతుని చూడు. అందరిలోని భగవంతు నకు సేవలనర్పించు. నిస్వార్థముగా ప్రేమిస్తూ వితరణశీలిగా ధర్మమార్గములో నడుస్తూ నీ మార్గమునకు అవరోధము గల్పించు అహంకార మమకారములను తొలగించుకొని ఈ జన్మలోనే - కాదు ఈ క్షణమే భగవంతుని పొందుము.

# 49. నిన్రాఋషి నెడుమరనాయనారు

# 50. మంగయార్ కరశియార్

నిన్రా ఋషి నెడుమరనాయనారు మధుర రాజ్యాన్ని పాలించిన పాండ్యరాజు. ఆయనకు గూనువుండేది. అందుచేత ఆయనను అందరూ కూన్‌పాండ్యన్ అని పిలిచే వారు. ఆయన సహజంగా కవి. మంచి పండితుడు. తమిళనాడులోని కవులను పండితు లను సమాదరించాడు. తమిళ సంగమును ఏర్పరచినది కూడ ఆయనే.

ఆయన భార్య మంగయార్‌కరిశియార్. ఆమె చోళరాజు కుమార్తె. శివారాధన పరురాలు. శివుడంటే చాల ఇష్టమామెకు. ఆయన మంత్రి కులచ్చిరాయి నాయనారు. ఆ మంత్రి గూడ పరమ శివభక్తుడు. తిరుజ్ఞాన సంబంధార్ ఈ ఇరువురు మంచిత నము గూర్చి పడిగములను పాడాడు.

కూన్‌పాండ్యన్ - జైన మతప్రాబల్యంతో జైనుడయ్యాడు. రాణి, మంత్రి - ఏదో ఒక పని చేయకపోతే - రాజుగారి మూలాన్ని - శైవ మత మంతరించునేమోనని భయ పడ్డారు. ఇలా వుండగా పరమ శివభక్తుడు జ్ఞాన సంబంధనాయనారు మధురకు వచ్చు చున్నట్లు, పోలిమేరలోనున్నట్లు తెలిసి - వానిని పట్టణములోనికి రాణి, మంత్రి ఆహ్వానిం చారు. జైనులు జ్ఞాన సంబంధనాయనారును చంపింప జూచారు. మహాభక్తుడు జ్ఞాన సంబంధనాయనారు ఒక పడిగము పాడగానే - రాజుగారి గూను, విపరీతమైన నొప్పి మాయమయ్యాయి. దీని మూలంగా శైవమతమంటే రాజుగారికి ఇష్టమేర్పడింది. శివభక్తి లో పరాకాష్ట నందుకొన్నాడు. ఆ శివ భక్తి తత్పరతలో నిన్రాఋషి - నెడుమరనాయనారు గా ప్రసిద్ధికెక్కాడు. గూనుపోయి నిటారుగా ఎత్తుగా నిలిచాడుకాన ఆ పేరు వచ్చింది.

ఈ మధురరాజు ఉత్తరదెసనున్న తిరునల్వేలి రాజులను జయించి శైవమత వ్యాప్తికి బహుధా తోడ్పడ్డాడు. గురువుఎడ వారి ప్రేమ, అనన్య భక్తి, సేవలు పరమ శివుని ఆకట్టుకున్నాయి. దంపతులకు శివుడు ముక్తి నొసగాడు.

# 51. వాయిలారు నాయనారు

వెల్లాల కులస్తుడయిన వాయిలారునాయనారు మద్రాసు మైలాపూరువాసి. నిరుపమాన అచంచల శివభక్తి తత్పరుడు. మనుసు దైవమందిరాలు నిర్మించి మానసిక ఆరాధన చేసేవాడు. ఆ దైవం - దైవమందిరం క్షణం గూడ మరువజాలనవి. ఆయన ఆత్మజ్యోతి దేవునికి ఉజ్వలజ్యోతి. మానసికారాధన దైవతత్వరత నిత్యానందఝురిలో దేవదేవునికి ప్రేమానురాగామృతము అభిషేకము చేసేవాడు. ఈ అసమాన దైవభక్తికి మెచ్చి శివుడు పరమ ప్రేమాభిమానముతో అతనికి శివసాయుజ్యమొసగాడు. వాయిలార్ - వాయిలార్ నాయనారు అయ్యాడు.

ఈయన జీవితము భక్తుని పరాభక్తి పరాకాష్టను చాటుతుంది. విగ్రహారాధన, చిహ్నాలు వరుస కర్మకాండల అర్చనస్థితిని దాటి దేవదేవుని ప్రస్ఫుటంగా తనలోనే తన గుండెలోనే పదిలపరచుకొని, మమైక్య మమతలతో నిరాకర నిరంజనుని సేవించి మహోన్నతుడుగా భాసింప జేయగల భక్తి తత్త్వమీయనిది.

వాయిలార్‌ను నాయనారు వరుసలో చేర్చటంతో భక్తిమార్గం తెరగులను చూస్తాము. వారి వారి మనోస్థితిని బట్టి భక్తుల భక్తి తెరగు రూపొందుతుంది. ఏ మార్గము ననుసరించినా అందరూ పరమావధినందుకుంటారు. అది శివునితో మమైక్యత. హైందవ ఋషి సాంప్రదాయంలో దైవమార్గము మూసలో చూపేదిగాదు. అన్నిరోగాలకి ఒకే ఔషధం కాదు, అన్ని వయసులవారికి ఒకే ఆహారం కాదు. సువిశాల పరిధులలో వ్యక్తి అవసరానికి, శక్తికి అనుగుణంగా తనదైన దైవమార్గమెంచుకొని, వ్యక్తి భగవంతుని చేరగలడు. ఆ వరవడిలో అతని అంచంచలత్వము - భక్తుడు చివరకు భగవంతుని చేరుటకు దోహదం చేస్తుంది.

# 49. నిన్రాబుషి నెడుమరనాయనారు

# 50. మంగయార్ కరశియార్

నిన్రా బుషి నెడుమరనాయనారు మధుర రాజ్యాన్ని పాలించిన పాండ్యరాజు. ఆయనకు గూనువుండేది. అందుచేత ఆయనను అందరూ కూన్‌పాండ్యన్ అని పిలిచే వారు. ఆయన సహజంగా కవి. మంచి పండితుడు. తమిళనాడులోని కవులను పండితు లను సమాదరించాడు. తమిళ సంగమును ఏర్పరచినది కూడ ఆయనే.

ఆయన భార్య మంగయార్‌కరిశియార్. ఆమె చోళరాజు కుమార్తె. శివారాధన పరురాలు. శివుడంటే చాల ఇష్టమామెకు. ఆయన మంత్రి కులచ్చిరాయి నాయనారు. ఆ మంత్రి గూడ పరమ శివభక్తుడు. తిరుజ్ఞాన సంబంధార్ ఈ ఇరువురు మంచిత నము గూర్చి పడిగములను పాడాడు.

కూన్‌పాండ్యన్ - జైన మతప్రాబల్యంతో జైనుడయ్యాడు. రాణి, మంత్రి - ఏదో ఒక పని చేయకపోతే - రాజుగారి మూలాన్ని - శైవ మత మంతరించునేమోనని భయ పడ్డారు. ఇలా వుండగా పరమ శివభక్తుడు జ్ఞాన సంబంధనాయనారు మధురకు వచ్చు చున్నట్లు, పోలిమేరలోనున్నట్లు తెలిసి - వానిని పట్టణములోనికి రాణి, మంత్రి ఆహ్వానిం చారు. జైనులు జ్ఞాన సంబంధనాయనారును చంపింప జూచారు. మహాభక్తుడు జ్ఞాన సంబంధనాయనారు ఒక పడిగము పాడగానే - రాజుగారి గూను, విపరీతమైన నొప్పి మాయమయ్యాయి. దీని మూలంగా శైవమతమంటే రాజుగారికి ఇష్టమేర్పడింది. శివభక్తి లో పరాకాష్ట నందుకొన్నాడు. ఆ శివ భక్తి తత్పరతలో నిన్రాబుషి - నెడుమరనాయనారు గా ప్రసిద్ధికెక్కాడు. గూనుపోయి నిటారుగా ఎత్తుగా నిలిచాడుకాన ఆ పేరు వచ్చింది.

ఈ మధురరాజు ఉత్తరదెసనున్న తిరునల్వేలి రాజులను జయించి శైవమత వ్యాప్తికి బహుధా తోడ్పడ్డాడు. గురువుఎడ వారి ప్రేమ, అనన్య భక్తి, సేవలు పరమ శివుని ఆకట్టుకున్నాయి. దంపతులకు శివుడు ముక్తి నొసగాడు.

## 53 కజ్జార్‌సింగ నాయనారు మఱియు

## 54. శేరుతునాయి నాయనారు

కజ్జార్‌సింగ్ నాయనారు కడవార్ కుటుంబమునకు చెందిన పల్లవ చక్రవర్తి. దైవకృపచే ఉత్తర దేశపు రాజులను జయించి శైవమతమును అచ్చట సుస్థిరము చేయ గలిగాడు. అనేక తీర్థయాత్రలు చేశాడు.

ఒకరోజున తన రాణితో తిరువారూరు దేవాలయానికి వెళ్లాడు. రాణి దేవాలయా నికి ప్రదక్షిణ చేస్తూ, శివుని అర్చనకై నిర్దేశింపబడిన ఒక క్రింద పడిన పువ్వును తీసికొని ఆఘ్రాణించింది. తంజావూరుకు చెందిన శేరుతునాయి నాయనారు వెల్లాల కులస్తుడు, చాలా పవిత్ర హృదయుడు - ఆ సమయంలో దైవ సేవలో వున్నాడు. ఆయనకు రాణి పూవును ఆఘ్రాణిస్తూ కనబడింది. ఆయన ఆగ్రహము చెంది రాణిగారి వాసన చూసిన ముక్కును కత్తిరించారు.

రాజుగారు, రాణిగారి ఆక్రందనను విని ఆ ప్రదేశానికి వెంటనే వచ్చాడు. ఆ కర్కోట కునిపై ఆగ్రహము చెందాడు. శేరుతునాయి నాయనారు - రాణిగారు చేసిన ఆ పనిని తాను శివాపరాధముగా నెంచానని, ఆ శిక్ష విధించానని చెప్పాడు. రాజుగారు ఇది విన గానే - ఆయన కోపము రాణిపై మరలి, ఆమె చేసినది తీవ్రాపరాధమేనని శేరుతునాయి నాయనారు విధించిన శిక్ష సరిపోదని అందుకని అదనముగా రాణిగారి పూవును తీసి న చేతిని గూడ ఖండించాడు.

యావత్ ప్రజ వారిని, వారి న్యాయ శీలత్వమునకు జోహారులర్పించారు. దేవతలు వారిపై పుష్పవృష్టి కురిపించారు. పరమశివుడు వారిద్దరకు ముక్తినొసగాడు.

## 53 కజ్జార్‌సింగ నాయనారు మఱియు

## 54. శేరుతునాయి నాయనారు

కజ్జార్‌సింగ్ నాయనారు కడవార్ కుటుంబమునకు చెందిన పల్లవ చక్రవర్తి. దైవకృపచే ఉత్తర దేశపు రాజులను జయించి శైవమతమును అచ్చట సుస్థిరము చేయ గలిగాడు. అనేక తీర్థయాత్రలు చేశాడు.

ఒకరోజున తన రాణితో తిరువారూరు దేవాలయానికి వెళ్లాడు. రాణి దేవాలయా నికి ప్రదక్షిణ చేస్తూ, శివుని అర్చనకై నిర్దేశింపబడిన ఒక క్రింద పడిన పువ్వును తీసికొని ఆఘ్రాణించింది. తంజావూరుకు చెందిన శేరుతునాయి నాయనారు వెల్లాల కులస్తుడు, చాలా పవిత్ర హృదయుడు - ఆ సమయంలో దైవ సేవలో వున్నాడు. ఆయనకు రాణి పూవును ఆఘ్రాణిస్తూ కనబడింది. ఆయన ఆగ్రహము చెంది రాణిగారి వాసన చూసిన ముక్కును కత్తిరించారు.

రాజుగారు, రాణిగారి ఆక్రందనను విని ఆ ప్రదేశానికి వెంటనే వచ్చాడు. ఆ కర్కోట కునిపై ఆగ్రహము చెందాడు. శేరుతునాయి నాయనారు - రాణిగారు చేసిన ఆ పనిని తాను శివాపరాధముగా నెంచానని, ఆ శిక్ష విధించానని చెప్పాడు. రాజుగారు ఇది విన గానే - ఆయన కోపము రాణిపై మరలి, ఆమె చేసినది తీవ్రాపరాధమేనని శేరుతునాయి నాయనారు విధించిన శిక్ష సరిపోదని అందుకని అదనముగా రాణిగారి పూవును తీసి న చేతిని గూడ ఖండించాడు.

యావత్ ప్రజ వారిని, వారి న్యాయ శీలత్వమునకు జోహారులర్పించారు. దేవతలు వారిపై పుష్పవృష్టి కురిపించారు. పరమశివుడు వారిద్దరకు ముక్తినొసగాడు.

# 55. ఇడన్‌గాజి నాయనారు

ఇడన్ గాజినాయనారు ఒక ఋషి. కొడుమ్బలూరులో వేలాల రాజుగా ప్రసిద్ధి నొందాడు. అప్రతిమానమైన శివభక్తుడు. అన్ని దేవాలయాలలోను శైవ ఆగమాల ప్రకారము పూజలు జరుగాలని నిర్దేశించాడు. ఆ వూళ్లోనే శివపూజాదురంధరుడైన - మహేశ్వరపూజ చేయు ఇంకొక భక్తుడున్నాడు. అతను పేదవాడయి పూజను కొనసాగింపలేక, శివభక్తులను ఆదరింపలేక, శక్తిలేనయిన వాడయ్యాడు. అందుకని ఇడన్ గాజినాయనారు ధాన్యాగారంలో రాత్రిన దొంగతనము చేయ సంసిద్ధుడయ్యాడు. అక్కడ కాపలాదారు దొంగని పట్టుకొని రాజు వద్దకు తీసికొని వెళ్లాడు. రాజుగారు భోగట్టా చేయగా ఈ దొంగతనము శివభక్తుల సేవకై, వారి ఆహారముకొరకైనని తేలింది. శివ పూజ చేయు రాజు ఈ విషయమును విని - దొంగతనము చేయుటకు వచ్చిన ఆ శివభక్తుని విడుదల చేశాడు.

ఈ విషయము రాజుగారి కళ్లను తెరిపించింది. తన ఆస్తి, వనరులు తనవి కానే కావని, అన్నీ తనకు చెందవని, అవన్నీ మహాశివునివి, శివభక్తులవి - అని గ్రహించాడు. అందుకని తన ధాన్యాగారమును అందరి శివభక్తులకు తెరిచి వుంచాడు. వాళ్లకు కావలసినవి తీసికొని వెళ్లవచ్చునని చెప్పాడు. పరమ శివుని మెప్పును అవలీలగా పొందాడు. శివసాయుజ్యమొందాడు

# 56. పూగజ్ తునాయి నాయనారు

పూగజ్ తునాయి నాయనారు శేరువిల్లిపుత్తూరుకు చెందిన ఆది శైవస్థుడయిన ఋషి. పరమ శివభక్తితత్పరుడు. దేవాలయ అర్చకుడు. శైవాగమాల ప్రకారము మంత్ర యుక్తముగా అభిషేకము, నిత్యార్చన నిష్టగా పట్టుదలతో చేయుట ఆయన నిత్యకృత్యము. ఒకసారి దేశంలోకరువువచ్చింది. ఆహారము కొనుటకు గూడ డబ్బు లేకపోయింది. ఆయనకున్న నిరంతర ధ్యాన తత్పరత, శివసేవాతత్పరత ఆకలితో నకనకలాడుతున్నా - దేవాలయం విడిచి పోవుటకు ఆయన మనస్సంగీ కరించలేదు. పూజచేస్తూనే వున్నాడు. బక్కచిక్కి ఆయన అస్తిపంజరము బయటపడ్డది. అయినా ఆ ప్రదేశాన్ని నాయనారు విడువలేదు. ఓపిక లేకపోయినా ఒక రోజున అభిషేకానికి దేమునికి జలము తెచ్చి శివ లింగానికి అభిషేకము చేస్తూంటే చేతిలోని కడవ జారి శివలింగంపై బడ్డది. నాయనారు మిక్కిలి అలసట మూలాన్ని స్పృహ కోల్పోయాడు. పరమ శివుడు ఆయన కలలో కన్పించి కరువు సమసిపోయేటంత వరకు గుళ్లో రోజు ఒక నాణెము విడిచి పెడతానని - దాని తో ఆహారము తెచ్చుకొని తినమని ఆదేశించాడు. నాయనారు లేచి చూస్తే తన కల నిజ మే ననిపించింది. ఎదురుగా ఒక నాణెం కన్పడింది. ఈ విధంగా భగవంతుడు కరువు తీరేటంతవరకు సహాయము చేశాడు. నాయనారు విడువకుండ తన శివపూజను కొన సాగించి అంత్యమున శివసాయుజ్యమందినాడు.

## 56. పూగజ్ తునాయి నాయనారు

పూగజ్ తునాయి నాయనారు శేరువిల్లిపుత్తూరుకు చెందిన ఆది శైవస్థుడయిన ఋషి. పరమ శివభక్తితత్పరుడు. దేవాలయ అర్చకుడు. శైవాగమాల ప్రకారము మంత్ర యుక్తముగా అభిషేకము, నిత్యార్చన నిష్టగా పట్టుదలతో చేయుట ఆయన నిత్యకృత్యము. ఒకసారి దేశంలోకరువువచ్చింది. ఆహారము కొనుటకు గూడ డబ్బు లేకపోయింది. ఆయనకున్న నిరంతర ధ్యాన తత్పరత, శివసేవాతత్పరత ఆకలితో నకనకలాడుతున్నా - దేవాలయం విడిచి పోవుటకు ఆయన మనస్సంగీ కరించలేదు. పూజచేస్తూనే వున్నాడు. బక్కచిక్కి ఆయన అస్తిపంజరము బయటపడ్డది. అయినా ఆ ప్రదేశాన్ని నాయనారు విడువలేదు. ఓపిక లేకపోయినా ఒక రోజున అభిషేకానికి దేమునికి జలము తెచ్చి శివ లింగానికి అభిషేకము చేస్తూంటే చేతిలోని కడవ జారి శివలింగంపై బడ్డది. నాయనారు మిక్కిలి అలసట మూలాన్ని స్పృహ కోల్పోయాడు. పరమ శివుడు ఆయన కలలో కన్పించి కరువు సమసిపోయేటంత వరకు గుళ్లో రోజు ఒక నాణెము విడిచి పెడతానని - దాని తో ఆహారము తెచ్చుకొని తినమని ఆదేశించాడు. నాయనారు లేచి చూస్తే తన కల నిజ మే ననిపించింది. ఎదురుగా ఒక నాణెం కన్పడింది. ఈ విధంగా భగవంతుడు కరువు తీరేటంతవరకు సహాయము చేశాడు. నాయనారు విడువకుండ తన శివపూజను కొన సాగించి అంత్యమున శివసాయుజ్యమందినాడు.

## 57. కోట్పులి నాయనారు

కోట్పులి నాయనారు వెల్లాలకులస్తుడు. చోళరాజు యొక్క ప్రధాన సైన్యాధికారి. పరమశివభక్తుడు. మహా పవిత్రుడు. సచ్ఛీలవంతుడు. తన ఆదాయములోనుంచ ధాన్య ము కొన్ని అన్ని శివాలయములకు నివేదనకు పంపేవాడు. ఇది చాలకాలము చేశాడు.

ఒక రోజున తన ఉద్యోగ ధర్మముమీద కొంతకాలం బయటకు వెళ్లాల్సి వచ్చింది. అందుకని అన్ని శివాలయాలకు వలసినంత ధాన్యము కొన తన బంధువుల కప్పజెప్పి వెళ్లాడు. బంధువులకు ముందరనే నిర్దుష్టముగా చెప్పాడు. "ఈ ధాన్యము దేవాలయము లకే. మీరెవ్వరు స్వంతానికి దీనిని ముట్టుకొనగూడదు" అని. కోట్పులి నాయనారు లేని సమయంలో కరువు వచ్చి పడింది. ఎవరికి ఆహారము దొరకలేదు. అందుకని దేవుని ధాన్యమును వారు ఆకలి తీర్చుకొనుటకుపయోగించారు. నాయనారు తిరిగి రాగానే విషయం విన్నాడు. వారిమీద చాలకోపం వచ్చింది. ఈ మహాపరాధానికి వాళ్లందరిని ఇంటికి పిలిపించి చంపించేశాడు. అందులో తన తల్లిదండ్రులున్నా వారిని గూడ క్షమిం చలేదు. దేవునిమీద నున్న అపారభక్తితత్పరత ఆయనచేత ఇంత పని చేయించింది. శివు నిమీద వున్న అపార ప్రేమముందు తల్లిదండ్రుల బంధువులయెడ ప్రేమ గణనలోనికి రాలేదు. మహాదేవుడు ఈ అనుపమ నిరతిశయభక్తికి చలించి పోయాడు. ప్రత్యక్షమయి నాయనారుకి అతని చేతిలో చనిపోయిన బంధువులందరికి మోక్షమనుగ్రహించి తన లోకానికి తీసికొని వెళ్లాడు.

## 58. పూసలార్ నాయనారు

పూసలారు తొండైమండలములోని తిరునిన్రావూరు బ్రాహ్మణుడు. ఆయన మానసికోపాసన మహోత్కృష్టముగా భాసించింది. బాహ్య విగ్రహారాధన కన్న మానసిక పూజ వెయ్యిరెట్లు అధికమైన మహాత్మ్యము కలది. మానసికోపాసన సమాధి స్థితిని, ఆత్మ దర్శనమును త్వరితము చేస్తుంది.

పూసలారు పరమశివునికి దేవాలయము నిర్మింపదలచాడు. దానికొఱకు ఆయనవద్ద ధనము లేకపోయింది. అందుచే మనోమందిరమును నిర్మింపదలచి ఆ దేవాలయమునకు వలసిన సరంజామా అంతా మనసులోనే సేకరించి ఒక మంచి ముహూర్తాన శంఖు స్థాపన చేశాడు. మనోమందిరము పూర్తిఅయింది. దేవుని ఆదేవళములో నిలుపుటకు ఒక స్థిరముహూర్తము నిశ్చయించాడు.

ఇలా వుండగా కడవ రాజుగూడ కంచిలో ఒక బృహదీశ్వరాలయము నిర్మించాడు. దైవ ప్రతిష్ఠకు ఒక ముహూర్తము నిర్ణయించాడు. కడవరాజుగూడ పరమశివ భక్తుడు. కాకతాళీయంగా పూసలారు ముహూర్తము, కడవరాజు ముహూర్తము ఒకటే అయినవి. పరమశివుడు పూసలారుయొక్కభక్తి అభినివేశము భక్తి ప్రపత్తి - రాజుగారి భక్తిని మించిపోయిందని లోకానికి తెలియబరచ దలచాడు. అందుకని రాజుగారి కలలో కనిపించి కంచిదేవాలయంలోదైవ ప్రతిష్ఠకు ఇంకొక ముహూర్తము నిర్ణయించ వలసినదనియు - ఆ సమయమునకు తానుమహాభక్తుడైన పూసలారు నిర్మించిన మందిరములో ప్రతిష్టకు వెళ్తునట్లుగాను చెప్పాడు.

రాజుగార్కి ఆశ్చర్యమేసింది. నిద్రలేచి భగవంతుడు పేర్కొన్న భక్తుడైన పూసలారు దర్శనము చేసికొనుటకును, అతను నిర్మించిన దేవాలయం దర్శించుటకును తిరునిన్రావూరు వెళ్లాడు. అక్కడ దేవాలయము వెదికాడు. కన్పించలేదు. పూసలారు గృహమునకు వెళ్లి - ఆయనకు తన కలగూర్చి చెప్పి పూసలారు నిర్మించిన దేవాలయమును చూపమని అర్థించాడు. రాజుగారి కలవినగానే పూసలారు స్థబ్ధుడయ్యాడు. “నేనెంత సామాన్యుడను. దేవదేవుడు ఎంత ఔదార్యముతో నా మానసిక మందిరం నే తన మందిరంగా భావించ నిచ్చగించాడు ? ఎంత కొరుచమూర్తి. నన్ను నిజముగ ధన్యునిగా చేశాడు మహేశ్వరుడు”అనుకొని -రాజుగారితో “మహారాజా ! దేవదేవుడు కరుణామయుడు. అది నా మానస మందిరమే” అని చెప్పాడు. రాజుగారికి పరమాశ్చర్యము వేసింది. పూసలారు అనితర భక్తికి ముగ్ధుడై ఆయన కాళ్లకు మొక్కాడు. పూసలారును

బహుధి అర్చించాడు. పూసలారు తాను అనుకున్నవిధంగా తనమానస మందిరములో దేవదేవుని వుంచాడు. ప్రతిష్టచేసి - నిరంతరార్చన సలిపాడు. అంత్యమున పూసలారు పరమశివుని సాన్నిధ్యానికి చేరాడు.

# 59. నేశ నాయనారు

నేశ నాయనారు కంసిలి నివాసస్తుడు. సాలై కుటుంబములో జన్మించాడు. శివుడన్నా శివభక్తులన్నా ఈయనకు పరమ ఇష్టము. ఎల్లప్పుడూ పరమశివుని చరణాలపైననే నేశనాయనారు దృష్టివుండేది. నాలుక నిరంతరము పంచాక్షరినే ఉచ్ఛరించేది. భక్తుల సేవలలో ఆయన కరచరణాలు నిమగ్నమై యుండేవి. ఈ త్రిగుణాలు ఆయనకు శివ సాయుజ్యాన్ని అనుగ్రహించాడు.

ఈయన జీవితము దైవనామమహాత్మ్యమును ప్రస్ఫుటము చేస్తుంది. సిరపుల్లి నాయనారు రాత్రింబగళ్లు నిరంతర పంచాక్షరి జపంచేసేవాడని చూచాము. నిరంతర స్మరణలో నేశనాయనారు గూడ గడిపే వాడు. ఈ పద్ధతి ఇలా వుంటుంది. ప్రొద్దున్న నిదురనుంచి లేవగానే ఒక అర్ధగంట సేపు కూర్చొని పంచాక్షరి మంత్రజపము చేయండి. ఈ వరవడి ఆగకుండ యుండుటకు పనిచేస్తున్నప్పుడు గూడ ప్రతిగంటకు ఒక్క తూరి ఆగి జపముకొన సాగించండి మంత్రోచ్ఛారణ చేయునంత సేపు భగవంతుని దర్శిస్తున్నట్లు భావించండి. ఈ విధమైన సాధన మీకు సహజమైతే - మీరు పనిచేస్తున్నా, కూర్చున్నా, నించున్నా, నిద్రిస్తున్నా -మీ మనస్సు మంత్రజపము చేస్తూనే వుంటుంది.

ఈ జపయోగంతోపాటు నాయనారు యోగమమైక్యత గూడ సాధన చేశాడు. దైవం గూర్చి తపించాడు. దైవం కోసం పనిచేశాడు. దైవం ఎడల నిరతిశయభక్తిని చూపాడు. దైవాన్ని అపరిమితంగా ప్రేమించాడు.

60. కోచెన్ గాట్ చోళనాయనారు

చోళ దేశంలో చంద్ర తీర్థముంది. చంద్రతీర్థములో ఒక చోట దట్టమైన పొద వుంది. ఆదట్టమైన పొద దగ్గర జంబూ వృక్షముంది. ఆజంబూ వృక్షము క్రింద శివలింగ ముంది. ప్రతిదినము ఒక తెల్ల ఏనుగు వచ్చి లింగము ముందు సాష్టాంగపడి అర్చించి వెళ్లేది. ఒక సాలీడు గూడ ఆ శివలింగమును పూజించేది. ప్రతిరోజూ ఆ లింగంపై ఎండు టాకులు పడుతుండుట చూచి ఆ ఆకులు పడకుండ సాలీడు శివలింగంపై తన గూడు ను అల్లింది.

మరుసటిరోజున పూజకు ఏనుగువచ్చి చూస్తే దానిమీద సాలీడు గూడు చూచిం ది. ఎవరో ఆ లింగంను అపవిత్రము చేశారని భావించి ఆ సాలీడు గూడును తీసివేసి అర్చించి వెళ్లి పోయింది. తర్వాత సాలీడు వచ్చి చూస్తే తన గూడు కన్పించలేదు. తన గూడు పోయినందుకు విచారించి తిరిగి తన గూడును శివునిమీద రక్షణకు అల్లింది. మరుసటి దినమున ఏనుగు తన గూడును పాడుచేయు చుండుట చూచి సాలీడు ఏనుగును కుట్టింది. ఏనుగు దాని విషంతో అక్కడి కక్కడే మరణించింది. సాలీడు గూడ ఏనుగు తొండం క్రింద పడి మరణించింది.

శివానుగ్రహమువలన సాలీడు చోళరాజు సుబాదేవన్ కు కుమారుడుగా జన్మిం చింది. సుబాదేవన్ అతని సతీమణి చిదంబరము వెళ్లి నటరాజస్వామిని తమకు సంత తికై ఒక కుమారునికై అర్థించారు. పరమశివుడు వారిని అనుగ్రహించాడు. అతని సతీ మణి కోమలవతి గర్భం ధరించింది. కుమారుని కనేవేళ అయింది. జ్యోతిష్కులు కొన్ని క్షణాల తర్వాత ఆమె కనినచో త్రిభువనముల నేలు పుత్రుడు జన్మిస్తాడని చెప్పారు. రాణి గారు - ఆమె పొట్టచుట్టూ గట్టిగా కట్టి తనను ఇంటిలోని చూరుకు తలక్రిందులుగా వ్రేలాడ తీయుడని ప్రార్థించింది. మంచివేళ అవగానే ఆమెను క్రిందికిదించి యధావిధిని పడుకోబెట్టారు. ఆమెపుత్రుని కన్నది.

పుత్రుడు కొంచెం ఎక్కువ సేపు తల్లి గర్భంలోనున్నందున అతని కళ్లు ఎఱ్ఱ బడ్డా యి. తల్లి తన కుమారుని చూచుకొని కొచెకన్నానో (ఎఱ్ఱకళ్లపుత్రుడు) అని అంటూ

ప్రాణం విడిచింది. యుక్తివయసు రాగానే చోళరాజు ఆ పుత్రునికి పట్టము గట్టి తను అరణ్యాలకు పోయి తీవ్రముగా తపస్సుచేసి శివ సాయుజ్యమందాడు.

కోచెన్ గాటు చోళుడు శైవమతవ్యాప్తికి ఇతోధికముగా కృషి చేశాడు. తిరుఅనైకా లో ఇది వరకు జంబూ వృక్షము క్రింద చక్కని దేవాలయమును కట్టి ఆందులో శివ లింగమును ప్రతిష్ట చేశాడు. చోళనాడులో ఎన్నో శివాలయాలను మందిరాలను తిల్లైలో 3000 బ్రాహ్మణులకు నిర్మించి యిచ్చాడు. చిదంబరంలో నిత్యార్చనకై కట్టు దిట్టమైన ఏర్పాటు చేశాడు. అంత్యమున శివసాయుజ్యమందినాడు.

పోయ్గయార్ తనరచనలలో కలవాజినారపత్తు లో కోచెన్గాట్ చోళనాయ నారును పద్యాలలో శ్లాఘించాడు.

ఈయన చరితము కొంచెము శ్రీకాళహస్తి చరితమును పోలివుంది.

61. తిరునీలకంఠ యాజ్‌పనార్

చోళ రాజ్యంలో తిరుఏరుకట్టన్ పులియూరు లో తిరునీలకంఠ భూజ్‌పనార్ అనే మహాశివభక్తుడు ఉండేవాడు. వీణలలో ఒక రకమైన యాజ్ మీద భక్తిపాటలు చాల చక్కగా మనోహరంగా గమకంగా పాడేవాడు. దేవాలయాలను దర్శించి దేవుని మీద యాజ్‌మీద పాడుట ఆయనకు అలవాటయింది. ఒక రోజున మధుర వెళ్లాడు. గుడి ముందర నిలుచుని పాడటం మొదలు పెట్టాడు. మధుర దేవదేవుడు సుందరేశ్వరునికి తన సమక్షంలో ఆ పాటలు పాడించుకోవాలని, వినాలని అనిపించింది. అందుకని భక్తుల కలలోకన్పించి మరుసటి దినమున యాజ్‌పనారును గర్భగుడిలోనికి తీసికొని వచ్చి పాడించమని నిర్దేశించాడు. యాజ్‌పనారును మరుసటి దినము లోనికి తీసికొని వెళ్లుటము ఆయనకు ఆశ్చర్యము గొల్పింది. ఇది భగవంతుడి లీల అని గ్రహించాడు. యాజ్ మీద పాడటం భగవంతుని కిష్టమని గ్రహించాడు. అలా పాడుతూంటే దివ్యవాణి వినిపించింది. తడినేల తగిలితే యాజ్ పాడవుతుంది అందుచే ఆయనకు బంగారు ఆసనము వేసికూర్చో బెట్టండి అని వెంటనే బంగారు ఆసనము అమర్చబడింది. యాజ్‌పనారు దేవునికి సాష్టాంగ పడి దేవుని అనంత కరుణా శీలత్వమును గూర్చి ఆ కనకపు ఆసనము పై నించొని పాడాడు. మనోహరంగా పాడాడు.

యాజ్‌పనార్ తర్వాత తిరువారూరు వెళ్లాడు. అక్కడ గూడ దేవాలయము బయటనే నించొని పాడాడు. ఇక్కడగూడ దేవుడు అతనిచే తన సమీపంలో పాడించుకో తలచాడు. దానికొఱకై దేవాలయమునకు ఉత్తర దెస ద్వారము కల్పించాడు. యాజ్ పవారు దేవుని ఇంగితము గ్రహించి ఆ ద్వారము ద్వారా లోనికి ప్రవేశించి దైవము ముంగిట మనోహరంగా పాడాడు.

ఈయన సంబంధార్‌తో చేరి సాయుజ్యమును పొందుట సంబంధార్ (28) చరిత్రలో చూస్తాము.

## 62. సదయ నాయనారు

## 63. ఇసైజ్ఞాన నియారు

తిరునావలూరులో తిరుమురైపడిలో సదయనార్ అనే ఆదిశైవుడు ఉండేవాడు. అతని పూర్వీకులందరూ మహాశివభక్తులు. ఇసైజ్ఞాననియారు అతని సతీమణి. మహాపతి వ్రత. ఆమెకు గూడ శివుడనిన మహాప్రీతి. వారి పూర్వ జన్మల విశేషం మూలమున దైవ దత్తంగా ఒక పుత్రుడు కలిగాడు. అతనే ప్రసిద్ధి వహించిన సుందర మూర్తి నాయనారు.

అక్కడమన్నరాజు నరసింగ మునైయారు ఈ శిశువును, శిశువు అందాన్ని చూచి ముగ్ధుడై పెంచుకుంటానని తల్లిదండ్రుల నడుగగా - వారు ఏమీ ఆలోచించ కుండ వెంటనే ఆ శిశువును రాజుగారి కిచ్చారు. ఈ ఇవ్వటంలో వారి వైరాగ్యభావము, దేని యందు మమకారము లేకుండుట ప్రస్ఫుటమైంది. వారలు గృహస్థ ధర్మమును చక్కగా నిర్వహించి అంత్యమున శివసాయుజ్యమందారు. నాయనార్లుగా పిలువ బడ్డారు.

ప్రపంచానురక్తిలో సంసార బంధము ఒకటి. అనురక్తి కలిగిన సంసారముం టుంది. భవ బంధాలు ఏర్పడుతాయి. అనుబంధరహితంగ నిర్లిప్తతతో నున్నచో నీవు బంధములనుండి విముక్తులవుతారు. జీవన్ముక్తులవుతారు. క్షణంలోనే బ్రహ్మానంద స్థితిని చేరుకోగలరు. హిందూ ఆర్ష సంప్రదాయము ఇది వక్కాణిస్తుంది. క్షణంలోనే అన్నిభవ బంధాల్నుండి సశరీరంగానే విముక్తిడిగా భాసిస్తారు. ప్రపంచమంతా దివ్యజ్యోతి స్వరూపంగా గమనించగలరు. సృష్టి పరిజ్ఞానము వ్యతిరేక రూప ప్రతిరూపాలు అన్ని సుగమమవుతాయి.